శ్రీ గురుభ్యో నమః.

# తత్త్వకథన పరిశిష్టము.



## 'వర్ణోత్పత్తివిమర్శ' సమీక్ష.

'బాలవ్యాస, తర్క, వ్యాకరణ, వేదాన్తపారీణ'

**వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే**

రచియింపఁబడి,

భట్నవిల్లిగ్రామసంస్థాపిత శ్రీ శారదాముద్రణాలయమునందు

ముద్రింపఁబడి,

ప్రకటింపఁబడియె.

ప్రతులు : 500.

**16-8-56**

 [మూల్యం: **1-8-0**

# విషయసూచిక.




విషయము. పుట.

(1) కన్యాబాలా శబ్దార్థ సమీక్ష 9

(2) కానీన శబ్దార్థ సమీక్ష 11

(3) కుంతీ యౌవన వాద సమీక్ష 17

(4) సద్యః ప్రసూతివాద సమీక్ష 38

(5) కర్ణ నిషేకజన్మ శబ్దార్థ సమీక్ష 40

(6) కర్ణోత్పత్తి విమర్శ సమీక్ష 51

(7) కుంతీ కన్యాత్వ వర సమీక్ష 53

(8) కుంతీ సత్యవతీ "పుంయోగేచ్ఛావాద" సమీక్ష 56

(9) సంఘర్ష జనన శ్లోకాక్షేప సమీక్ష 61

(10) వనపర్వ గ్రంథాక్షేప సమీక్ష 64

(11) నీలకంఠీయ దూషణ సమీక్ష 69

(12) బ్ర. వే. కవిసార్వభౌముల ప్రథమ కరపత్రము 1

(13) పై ప్రథమకరపత్రమునకు బ్ర. వే. బాలవ్యాసుల సమాధానము 4

(14) బ్ర. వే. కవిసార్వభౌముల 2 కరపత్రము 10

(15) బ్ర. వే. కవిసార్వభౌముల 2 కరపత్రమునకు సమాధానము. 14

(16) బ్ర. వే. కవిసార్వభౌముల 3 కరపత్రము. 19

(17) బ్ర. వే. కవిసార్వభౌముల 3 కరపత్రమునకు సమాధానము.






# విజ్ఞప్తి.

భారతం భానుమా నిన్దు ర్యది న స్యు రమీ త్రియః ।
తతోఽజ్ఞానతమోఽన్ధస్య కాఽవస్థా జగతో భవేత్ ॥ (పాద్మము.)

తమోహరములగు సూర్యచంద్రమండలములు ఎట్లు జగదుప కారకములో ల్ల అజ్ఞానహరమగు మహాభారతము జగదుపకార కమై యున్నది. ఇది వేదవ్యాసమహర్షి ప్రణీతము.

"భారతస్యేతిహాసస్య...నానాశాస్త్రోపబృంహితామ్...సంహితాం శ్రోతుమిచ్ఛామః" అనుటచే ఇది నానాశాస్త్రోపబృంహితమై యున్నది. కావ్యమీమాంసలో—

"ఇహ హి వాఙ్మయ ముభయథా శాస్త్రం కావ్యం చ ।
శాస్త్రపూర్వకత్వా త్కావ్యస్య పూర్వం శాస్త్రే ష్వభినివిశేత ॥
నహ్యప్రవర్తితప్రదీపా స్తమసి తత్త్వార్థసార్థ మధ్యక్షయన్తి ।"

శాస్త్రమని, కావ్యమని ద్వివిధమైయున్న వాఙ్మయములో కావ్యము శాస్త్రపూర్వకమగుటచే మొదట శాస్త్రములయందు గట్టి కృషి చేయవలెను. చీకటిలోని పదార్థములను దీపములేకుండ కానలేరు కదా? అని చెప్పబడుటచే మహాకవుల కావ్యార్థజ్ఞానమునకే శాస్త్రాభ్యాస మవసరమైయుండ మహర్షి మహాభారతార్థజ్ఞానమునకు శాస్త్రాభ్యాసపాటవ మావశ్యకమని చెప్పవలెనా ?

కనుక నానాశాస్త్రనిష్ణాతులగు మహావిద్వాంసులే మహాభారతార్థమును యథాతథముగా గ్రహింప సమర్థులు.

మహాభారతవ్యాఖ్యాత నీలకంఠాచార్యులు. అట్టి మహావిద్వాంసులు తత్త్వగ్రహణ తత్పరులగు బుద్ధిమంతులు ఆవ్యాఖ్యానాధారమున భారతార్థము గ్రహింపగలుగుచున్నారు.

ఇక శాస్త్రాభ్యాస మేమియులేక, వ్యాఖ్యానమును గమనింపక భాషాంతరీకరణము లేవో చూచి, స్వాభిప్రాయములను మాలగ్రంథమున కలికించుచు, ఆతుకనిచోట అది ప్రక్షిప్తమనుచు, సర్వజ్ఞత్వాభిమానములతో స్వకపోలకల్పనలతో తలకోకపద్ధతిని విద్వన్మార్గమును నిరసించుచు, అగునది కాదని, కానిదగుననిచెప్పుచు మహాభారతముపై

విమర్శము లనబడు పుస్తకములు లేవదీయుచు ఆరూపమున సామాన్య జనులలో ప్రతిష్ఠ సంపాదించుకొనగోరుచున్నవారు విమర్శకులు.

మహాభారత ప్రకటితులగు పూజ్యులయందు నిందల నారో పించుచున్నవి విమర్శములు. తన్నిందానిరాకరణము చేయుచున్నది మా 'మహాభారతతత్త్వకథనము.

ఆక్షేపముల నుద్ఘాటనచేయుచు వానిపై నిరాక్షేపముగా సమా ధానములు చెప్పుచుండుట శాస్త్రకారమర్యాద. అదేరీతి ననుసరించిన 'తత్త్వకథనము' విమర్శకు లెత్తిన ఆక్షేపములను పరిహరించుచునే తత్త్వప్రతిపాదనము చేయుచువచ్చినది.

ఇప్పుడొక విమర్శ ముద్భవించినది. దీని పేరు 'కర్ణోత్పత్తి' విమర్శగ్రంథము ఇది "యేలూరుపాటి రామభద్ర చయనులు — అహం" గారిచే రచింపబడినది. వెనుక శ్రీ కవిసార్వభౌములు సద్భా వముతో నడిపి ఆపివేసిన పత్రికావాదము యొక్క ఛాయ నాశ్ర యించి యిది తలయెత్తినది. ఇది శ్రీ కవిసార్వభౌములును హర్షింప నట్టి నీలకంఠాచార్యదూషణాదులతో గూడియున్నది.

ఆక్షేపనిరాకరణపూర్వకముగా తత్త్వప్రతిపాదనము చేయు టకు, కావలసిన ఆక్షేపముల నందించు ఈ గ్రంథము వారు ప దృష్టితో వ్రాసినను మా 'తత్త్వకథనము' నకుఅవసరమే అని మేము దీనిని ఆదరముతో నందుకొని దీని ఆక్షేపములకు సంబంధించియున్న ఇంచుమించు 100 అంశములను పరాస్తము గావించి విద్వన్మార్గమున తత్త్వము నిరూపించి యున్నాము.

విమర్శకుల ఆర్భాటములకు మోసపోక ఈపనిందను శ్రద్ధతో చదివి ఆర్ష విజ్ఞాన సంపన్నులై భారతీయత్వాభిమానము నిలవబెట్టు కొనవలసిన దనియే మావిజ్ఞప్తి.

"విద్వద్విమర్శకోక్తిషు సారాఽసారౌ నిరూపితావస్మిన్
స్పష్టం స్యాద్ద్రష్టౄణాం విద్వన్మార్గాఽప్రకంప్యత్వమ్॥"

ఇట్లు,
గ్రంథకర్త:



# 'కర్ణోత్పత్తివిమర్శ' సమీక్ష

శ్రీ అన్నవర దేవస్థానమున గతసంవత్సరము దేవస్థానమువారు కోరిన 'భారతము—కర్ణస్వరూపము' అను విషయముపై నేనుపన్యసించునపుడు అధ్యక్షులుగానున్న శ్రీకవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు తమ అభిప్రాయభేదములను ప్రకటించుచు 3-5-55 4-5-55, తేదీలలో జరిగిన సభలలో కర్ణునిది సద్యస్కాలజననమని, కుంతి అప్పటికి ప్రౌఢయని, స్వమతమును వెల్లడించి దీనిని పత్రికాముఖమున ప్రకటింతు నని చెప్పి ఆపై 17-5-55 నాటికి ప్రథమకర పత్రము వారు ప్రకటించిపంపుట, వారిననుసరించి నేనును సమాధాన పత్రము ప్రకటించి వారికి బంపుట ఇట్లు వాదోపవాదములు వారి 3 కరపత్రములలోను నా 3 కరపత్రములలోను నడిచి యంతటితో ఆగిపోయినది.

ఇక ప్రస్తుతాంశము—

24-5-56 నాటికి 'కర్ణోత్పత్తి' (విమర్శగ్రంథము) అను పుస్తకమొకటి నాకు పంపబడినది. అది 56 పుటలు కలదై 14 పుట లుపోద్ఘాతము కలదై యున్నది.

ఉపోద్ఘాతములో విమర్శకర్తల వ్రాత యిట్లున్నది—

మన్మథసంవత్సర వైశాఖ శు. ౧౧శి దినమున అన్నవరమున జరిగిన సభలో బాలవ్యాసులు కర్ణస్వరూపమును వర్ణించుచు కుంతి పసిదనియు, కర్ణుని పదినెలలు మోసి, కనెననియు చెప్పిరట! అధ్యక్షులుగనుండిన ఆస్థానకవి కవిసార్వభౌము లద్దానిని ఖండించి మాటలాడుటయేగాక 10-5-55 నొక కరపత్రమును ముద్రించి వారి కంపించుటయు, వారుత్తరమిచ్చుటయు కృష్ణమూర్తిశాస్త్రి గారు పండితసమావేశము నేర్పాటుచేత తగునని వ్రాయుటయు,

పణము నొడ్డుటయు, కథకు లొప్పుకొనకుండుటయు 23-6-55 'నామనవి' శీర్షికతో తిరిగి సార్వభౌములు వ్రాయుటయు కథకులు సమావేశమునకు రానొప్పమియు జరిగినవట! ఈకరపత్రములన్నియు నాకు జేరినవి.

1 మహాభారతతత్త్వకథనమున వ్రాయబడినవానినే చర్విత చర్వణ మొనర్చినందున కథకుల వాదమున బస కన్పడలేదు.

2 యుక్తిశూన్యములను సూక్తు లనుకొనిన వీరివ్రాతలు పర పక్షజయము నాపాదించుచునే యున్నవి.

3 నాకు భారతవిషయమునగల ఆసక్తిని సుబ్రహ్మణ్యశాస్త్రి గారి కుతర్కము ప్రేరేపించినందున పండితాభిప్రాయ సేకరణము నొనర్చుట న్యాయమని తోచినది...

4 కథన—కరపత్రములలోని వ్రాతలను ఖండించుచు ఈచిన్ని పొత్తమును వ్రాసితిని. తత్త్వకథన మంతయు కువ్యాఖ్యలపై నాధారపడిన కథితపదదోష కలితమైనదని పండితులకు నామనవి. కథనములలో హెచ్చుస్థానము కర్ణు నాశ్రయమొందినదే యగుట నేనును కర్ణోత్పత్తి పేరిటనే వ్రాయనైనది...

నేనిదివరలో పొత్తముల ముద్రించుట యెరుగను; వ్యాసరచనమే ప్రధానముగ నడచిన నేనీనాడు క్రొత్తదయిన పుస్తకముద్రణమునకు గడంగుటచే...లోపములు బరిగి...యుండవచ్చును. నేరమని క్షమించవలయునని పండితపాఠకుల నర్థించుచున్నాను." పు. 11-14)

ఈవ్రాతలోని 1, 2, 3, 4. అంశములమాట లుపేక్షణీయములు కాకుండుట, వీరి ఆసక్తిని తీర్చవలసియుండుట, ముఖ్యముగా సిద్ధాంతమును ప్రదర్శింపవలసియుండుట కారణముగా వీరి విమర్శగ్రంథమును సమీక్షించుట కందుకొనుచున్నాము—

దాని ముఖపత్రముపై— 'రచయితను నేను—యేలూరుపాటి రామభద్రయనులు' అని యున్నది.

ఇచ్చట రచయిత—...రామభద్రయనులు అనియే వ్రాయక నేను అనికూడ వ్రాసినారెందులకో? ఆరచయిత మరెవ్వరో అని

లోకు లనుకొనకుండుటకా? నేను అనిన అట్లనుకొనరనిపించినదా? పేరు చేయలేనట్టి పనిని 'నేను' చేయగలుగునా ?

ఉపోద్ఘాతాంతమున—'యేలూరుపాటి రామభద్రయసులు... అహం' అని యున్నది. దీనినిబట్టి యిది అహంకారపూర్వకప్రవృత్తి యని తెలియుచున్నది.

విమర్శకారుల వాక్యములు—

"కథకుల భారతములో (వారు చూచినది) ప్రక్షిప్తములను పాఠభేదముల నొప్పుకొనరు. నేను మాత్రిగ వారికి వ్యతిరేకిని"

(ఉపో. పు11)

దీనినిబట్టి వీరి దృష్టి యెట్టిదో స్పష్ట మగుచున్నది. నేను చూచిన భారతములో ప్రక్షిప్తములను, పాఠభేదములను నేనొప్పుకొనననట! వీరు ప్రక్షిప్తములను వాని నే నొప్పుకొనవలెనా !

ఏది గ్రంథస్థమో ఏది ప్రక్షిప్తమో ఏది పాఠాంతరమో ఏది యపపాఠమో నిర్ణయింపగల శక్తి ఆర్ష వాఙ్మయమందు కూలంకష ప్రజ్ఞకల వ్యాఖ్యాతృవర్గమునకే కలదు. అట్టివారు నిర్ణయించియున్న వానినే మేమొప్పుకొనువారము.

నేడు, తమ కర్థముకానివానిని, అడ్డువచ్చినవానిని ప్రక్షిప్తము లనుట విమర్శకులకు పరిపాటి యైనది. ఆపద్ధతిని మే మొప్పుకొన జాలము.

"కురుపాండవదాయభాగవినిర్ణయ" కర్తలు, పాండురాజు రాజ్యార్హుడు కాడనుటకు ప్రమాణముగా "సోఽపి పాండు స్సుతో జాతో రాజ్యయోగ్యో న సమ్మతః" అను దేవీభాగవతవచనము నుదాహరించిరి. '...దాయభాగవిమర్శన' కర్తలు, పాండురాజరాజ్యవాదమున కడ్డువచ్చిన దని అది ప్రక్షిప్త మనిరి. మరియొకరు పాండురాజ రాజ్యవాదమునకు దాని యడ్డు లేదని సమన్వయించియున్నపుడు అది ప్రక్షిప్త మని యెందుకనవలయును ? కనుక ప్రక్షిప్తమనుట కిట్టివారు తగరు.

# తత్త్వకథన పరిశిష్టము.

—॰ భారతవ్యాఖ్యాతయగు నీలకంఠుని గూర్చి విమర్శకుల వ్రాత యిట్లున్నది ॰—

"వావిళ్ళముద్రణము— 'నారాయణం నమస్కృత్య' శ్లోక వ్యాఖ్యానారంభమందు వ్యాఖ్యాత యెవరో తెలియనగు వాక్యములు లేవు. ఇతరపర్వప్రారంభములందుకాని, తుదనందుకాని వ్యాఖ్యాత ఊరు పేరులు లేవు. నీలకంఠుని దీవ్యాఖ్య యనుకొనవలసినమాటలు లేవు. కాని టిప్పణియున్నది.

"శాంతిపర్వమునకు నీలకంఠుడు వ్యాఖ్యాత యని తెలియును. తలిదండ్రుల పేరులు లేవు. ఆదిపర్వాంతమున నీలకంఠుడు వ్యాఖ్యాత యని యున్నది. ముద్రితమైన వ్యాఖ్య అతనిదే యనుట కుపపత్తి చాలుట లేదు.... భారతమునకు గల వ్యాఖ్యను గచ్ఛద్వ్యాఖ్య యనియు, క్వచిద్వ్యాఖ్య యనియు చెప్పుచున్నారు......సుబ్రహ్మణ్యశాస్త్రిగారి కథనములో నీలకంఠీయములని కొన్ని శ్లోకములు గలవు...... కర్ణదుర్యోధనాదులందు తనకు గలిగిన యేవగింపుమాత్రమే దెలుపుచుండుటవలన నీలకంఠీయమను పేరున నొకపాత్రమును వ్రాసి ఈవ్యాఖ్య కెత్తుచు వచ్చినాడని అనిపించుచున్నది.

...అన్యకర్తృకమును శాస్త్రిగా రంగీకరింపకుండుట యుచితము కాదని నేనందును; నీలకంఠుని పేరుతో నీశ్లోకములు ప్రక్షిప్తములు కానోపును; మొత్తముమీద నాలోచించినచో వ్యాఖ్యానముల సహా భారత మనేకరూపముల దాల్చినదని నామతము. (ఉపో. 5-6పు.)

వీరి యీమాటలు చూడగా వావిళ్లముద్రణముమాత్రము చూచి, అందున్న టిప్పటి జూచి, అందు వ్యాఖ్యాత ఊరుపేరులు లేకుండుట జూచి వ్యాఖ్యాత నీలకంఠు డని తెలియగలచోట తలిదండ్రుల పేరులు లేకుండుట జూచి, భారతమునకు గల వ్యాఖ్య గచ్ఛద్వ్యాఖ్య. క్వచిద్వ్యాఖ్య అను వ్యవహారమును చూచి మొత్తముమీద ముద్రితమైయున్న నీలకంఠీయవ్యాఖ్య నీలకంఠునిది కాదని వీరు

తో్రిసివేయుట తప్ప ముద్రితనీలకంఠీయమును వీరు చూచినట్లే కన బడదు. ముద్రితనీలకంఠీయమునుగూర్చి చిత్రశాలాముద్రణాలయాధి పతి వ్రాసిన యీవాక్యములు చూడుడు—

"అత్ర చ నీలకంఠకృతా భారతభావదీపాఖ్యా టీకా సంని వేశితా। త్రిచతురాసు టీకా స్వీయమేవ విశేషతో మహారాష్ట్రే ష్వాద్రియతే సుధీభిః। సంపూర్ణా చేయ ముపలభ్యతే న ఖండితా।"

దీనినిబట్టి భారతభావదీపమను టీక నీలకంఠకృత మనియు, ఇది సంపూర్ణముగా నున్నదనియు 3, 4 టీకలలో నీలకంఠీయమే మహా రాష్ట్రవిద్వాంసులలో విశేషముగా నాదరింపబడుచున్నదనియు విశదమైనదా ?

"ఇతి శ్రీమత్పదవాక్యప్రమాణజ్ఞమర్యాదా ధురన్ధరచతుర్ధరవంశా వతంస గోవిన్దసూరిసూనోః నీలకంఠస్య కృతౌ భారతభావదీపే..."

దీనినిబట్టి నీలకంఠుని తండ్రి గోవిందసూరి యని, ఆతడు చతు ర్ధరవంశీయుడని, భారతభావదీపము నీలకంఠకృతమని విశద మయినదా?

ఇట్టి నీలకంఠీయములోని విషయము లచ్చటచ్చట టిప్పణిగా కూర్చబడి వావిళ్ళముద్రణమునం దుండెను. అట్టిదే క్వచిద్వ్యాఖ్య యనబడెను. అట్టిటిప్పణిని చూచి దానికి మూలభూతమైన సంపూర్ణనీల కంఠీయము నన్యులెవ్వరో వ్రాసి చేర్చినారని ఈవిమర్శకర్త లనుట హాస్యాస్పదము. నీలకంఠీయములోని శ్లోకములు ప్రక్షిప్తములట! మూలము, వ్యాఖ్యానములు ననేకరూపముల దాల్చినవట! వీరేమను టకును వెనుదీయరు. నీలకంఠీయము కర్ణదుర్యోధనాదులయందు ఏవ గింపునే తెలుపుచున్నదట! దానికి కారణ మేమైయుండును ? భార తము వారి చేష్ట లట్టివని ప్రకటించుచేనా ? యథాతథముగా భార తార్థమును వ్యాఖ్యానించు నీలకంఠునిది తప్పా ? అట్టి దుశ్చేష్టలుకల కర్ణదుర్యోధనాదులది తప్పా ?

వ్యాసుడు పాండవపక్షపాతియని యొక విమర్శకు డనెను. భారత ములో ప్రక్షిప్తము లున్నవని మరియొక విమర్శకు డనెను. నీలకంఠుడు పక్షపాతి యని, నీలకంఠీయములో ప్రక్షిప్తము లున్నవని ఈవిమర్శకు

లన్నారు. ఇట్టి యారోపణములు కర్ణదుర్యోధనపక్షపాతదోషమున సంభవించుచున్నవి. ఆర్షగ్రంథములను, విద్వద్వ్యాఖ్యానములను, విద్వద్వ్యవహారమును అప్రమాణ మనువారి మాటలను ప్రమాణముగా దీసికొనువా డెవ్వడు ?

'యస్య ప్రమాణం న భవే త్ప్రమాణం
కస్తస్య కుర్యా ద్వచనం ప్రమాణమ్ ।'

కనుక ఈవిమర్శకుల ప్రమాణవిరుద్ధమైన స్వేచ్ఛాప్రసంగము విద్వద్గ్రాహ్యము కానేరదు. దీనినిబట్టి—

'నీలకంఠుని పేరుతో వ్యాఖ్య డాంబికముగ వ్రాయబడి యుండవచ్చును.'

ఇత్యాది విమర్శకారోక్తులు పరాస్తములు.

నీలకంఠీయములో తత్తదాఖ్యానతాత్పర్యసంగ్రహ మని కొన్ని శ్లోకము లున్నవి. అవియే సందర్భానుసారముగా మాతత్త్వకథనములో కొన్ని యుదాహరింపబడినవి. మహాభారతమునకు హరివంశాంతము సంపూర్ణముగా విద్వన్మనోజ్ఞముగా అనితరసాధారణముగా టీక వ్రాసి లోకుల ననుగ్రహించిన నీలకంఠుడు ఆతాత్పర్యసంగ్రహ శ్లోకములతో సారాంశమును వెల్లడింప దాని సేవగించుకొని యీ విమర్శకారులు అవి ప్రక్షిప్తము లనుటకు సిద్ధపడినారు. ఈవిమర్శకారోక్తు లెట్టివో పాఠకలోకమే నిర్ణయించుకొనవలసియున్నది.

మే మాదరించెడి నీలకంఠీయమును ఈవిమర్శకర్తలు నిరసించుచున్నారుకదా ! ఈనిరసనము శ్రీకవిసార్వభౌములకు సమ్మతమా ? సమ్మతమైనచో వారు ప్రథమకరపత్రములో-'దశోత్తరేపక్షే' అనగా చైత్రాదిపదిమాసములపైనగు మాఘము మొదటిదినమున కర్ణుండు పుట్టె నని నీలకంఠాచార్యులవారు భావార్థదీపికలో వ్రాసియున్నారు.

అని తమ వాదమునకు బలకరముగా నీలకంఠీయము నెట్లు పరిగ్రహించినారు ? శ్రీకృష్ణభారతములో (పు. 531) ఈస్థలములో ఆనీలకంఠీయమునుదాహరించి యెఱ్ఱాప్రగ్గడ భారతములోనిది సరియైనది కాదని యెట్లు వ్రాసినారు ?

ఆనీలకంఠీయమునకు వారనుకొనిన దర్థముకాదనునది వేఱే విషయము.

కనుక ఈవిమర్శకర్తల నీలకంఠీయనిరసము కవిసార్వభౌమమత విరుద్ధముకూడ నయియున్నది.

నీలకంఠాచార్యసూక్తులు—

'బహూన్ సమాహృత్య విభిన్నదేశ్యాన్
కోశాన్వినిశ్చిత్య చ పాఠ మగ్ర్యమ్।
ప్రాచాం గురూణా మనుసృత్య వాచ
మారభ్యతే భారతభావదీపః ॥'

భిన్నభిన్నదేశములలోని బహుకోశములను సంగ్రహించి, శ్రేష్ఠమైన పాఠమును నిశ్చయించి, ప్రాచీనులగు గురువుల వాక్కుల ననుసరించి, భారతభావదీపరచనను ఆరంభించుచున్నాడను.

'టీకాన్తరా ణీన్దురవిప్రభాణి
బాహ్యార్థరత్నాని చకాసయన్తు।
అన్తర్నిగూఢార్థచయప్రకాశే
దీపః క్షమో భారతమన్దిరేఽస్మిన్ ॥'

సూర్యచంద్రప్రభాతుల్యములైన టీకాంతరములు బాహ్యపదార్థవిశేషములను ప్రకాశింపజేయుగాక. నిగూఢములై మహాభారతమందిరాన్తర్గతములై యున్న పదార్థవిశేషములను ప్రకాశింపజేయగలది భారతభావదీపమే.

దీనినిబట్టి అనేకదేశములలోని భారతప్రతులను అనేకముగా సంగ్రహించి పరిశీలించి సాంప్రదాయికపాఠము నిశ్చయించి గురుపరంపరోపదేశము ననుసరించి సర్వతోముఖపాండిత్యముతో రచింపబడినదే నీలకంఠీయము. అంతియకాని ఏదో యొక ప్రతిని చూచి ఏదో యొక పాఠమును బట్టుకొని ఏదో విధముగా నెవ్వడో అనామకుడు వ్రాసిసిట్టి దది కాదని విశదమైనదా!

ఇట్టి నీలకంఠాచార్యపరిష్కృతభారతములో ప్రక్షిప్తములట! పాఠభేదములట! ఆపాఠభేదములుకూడ నచ్చటచ్చట జూపుచు నీలకంఠీయములోనే సమన్వయింపబడియున్నవి.

ఈవిమర్శకారు లిట్లనుచున్నారు—

'పూనా ఓరియన్టలిస్టువారు పాఠభేదముల జూపుచు ముద్రణము నొందించిరి. సరి అయిన పాఠమును నిర్ణయించి మూలమును ముద్రించరైరి...ఎవరికి దోచిన రీతిని వారు గ్రహించుటయే పర్యవసానమైనది. పలువురు పండితులున్న పెద్దసంస్థయే అట్లు చేయుచునప్పుడు న్యాయసంస్కరణ మెట్లు సాగును? పాచితి శైలి తప్పకనిజమునుబయటపెట్టగలవు...కుతర్కాన్వితాకాండతాండవము లోకవంచనమునకు కారణ మగును...అని మనవి' అని.

అయితే ఆపూనా ఓరియన్టలిస్టువారి భారతనూతనముద్రణము గూడ వీరికి నచ్చలేదన్నమాట. కారణము? సరియైనపాఠమును నిర్ణయించి మూలమును ముద్రింపకపోవుటయట! అనగా వీరు ప్రక్షిప్తము లనదలచినవానిని వారు గ్రంథమునుండి తీసివేయకపోవుటన్నమాట. వీరి మాటలనుబట్టి పూనాసంస్థ ముద్రించిన భారతప్రతిలో మూలము యథాపూర్వపాఠమే కలిగియున్నట్లు తేలుటచేతను, నీల కంఠాచార్యపరిష్కృతభారతము విద్వదాదరణీయమై యుండుటచేతను తదాధారముతో నడచు మారచనలో లోకవంచన మేమున్నది? కుతర్కమేమున్నది? అకాండతాండవమేమున్నది? ఇవన్నియు నిరాధారమైన వారి స్వేచ్ఛారచనలో నున్నవో, ప్రమాణాధీనమైన మారచనలో నున్నవో బుద్ధిమంతులే గ్రహింపగలరు.

ఈవిమర్శకారు లిట్లనిరి—

'కథన కరపత్రములలోని వ్రాతలను ఖండించుచు ఈచిన్న పొత్తమును వ్రాసితిని. తత్త్వకథనమంతయు కువ్యాఖ్యలపై నాధారపడిన దని పండితులకు నామనవి.' అని. (పు 13)

నేనును పండితుల కొరకు మనవి జేయుచున్నాను— స్వోత్ప్రేక్షితమైయున్న విమర్శకమార్గమును, యుక్తిప్రమాణసంబద్ధమైయున్న విద్వన్మార్గమును తమ యెదుట బెట్టినాము. ఇందు త్యాజ్య మేదియో, పూజ్య మేదియో నిర్ణయించు పని మీదే. అని.

"తం సన్త శ్రోతు మర్హన్తి సదసద్వ్యక్తిహేతవః।
హేమ్నస్సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధి శ్శ్యామికాపి వా॥"

అనికదా కాళిదాసమహాకవిసూక్తి.

"శాస్త్రిగారైనను శాంతముగనీపొత్తమును జదివి తమవాదమును మార్పు నొందించుకొనగలరని ఆశించుచున్నాను"(పుట 13)

అనుచున్నారు విమర్శకర్తలు. మార్పు నొందించవలసినది ప్రమాణవిరుద్ధవాదమా? ప్రమాణసంబద్ధవాదమా? ప్రమాణములు మారనపుడు ప్రమాణసంబద్ధవాద మెట్లు మారును? కనుక మార్పు నొందించవలసినది (ప్రమాణానుగతము గావింపవలసినది) వారివాద మగుటచే వారే ఆపని జేయగలరని మేమాశించుచున్నాము.

ఇంతవరకును ఉపోద్ఘాతముభ్యాంశ సమీక్ష యైనది.

—• కన్యాబాలాశబ్దార్థసమీక్ష •—

విమర్శకుల వ్రాత యిట్లున్నది—

"శ్రీ శాస్త్రిగారు మహాభారతతత్త్వకథనము 6వ భాగము 1209 పుట యెనిమిదవపంక్తిలో కుంతి పసిబిడ్డ అని నిష్కర్షగా వ్రాసిరి. సాక్ష్యము- ఎఱ్ఱాప్రగ్గడ అరణ్యపర్వములో పసిబిడ్డ, పిన్నది పసిపాప అని వాడుటయే...పాప యన చిన్నవయసుది కదా! పసియెందులకు,, ? అట.

వీరుదాహరించిన స్థలములో—'దుర్వాసమహర్షి మంత్రోపదేశ మొనరించినపుడు కుంతి 'యౌవనవతి' అని యొకరు వ్రాసినమాటను పరిశీలించుచు ఇట్లు సంస్కృతాంధ్రభారతములలో దేనియందును లేదని నిరూపించునపుడు—'ఇయం బ్రహ్మన్ మమ సుతా బాలా' అని యున్న వాక్యమును, అక్కడనే 'పసిబిడ్డవయ్యును పడతి నీవెంతయు గుణవంతురాలవు గురులయందు' అనియున్న ఆంధ్రభారతవాక్యమును ఉదాహరించి నిరాధారముగా యౌవనవతియనుట అన్యాయ్యమని ప్రతిపాదింపబడినది. ఇచ్చట వీరి యాక్షేపమేమన? కుంతి పసిబిడ్డ అనగా బాల, అను మావాదమునకు గాని 'కాదు యువతి' అను ఈవిమర్శకవాదమునకు గాని గ్రంథాధారముండవలయును. అది మేముచూపినాము. విమర్శకులు చూపలేదు. మేము చూపిన ప్రయోగములకే తాముత్ప్రేక్షించిన అర్థము నతికింప నారంభించినారు.

ఇక పసిబిడ్డలని నేను వ్రాసినట్లు చెప్పుచు ఎఱ్ఱాప్రగ్గడ ప్రయోగించిన 'పసిపాప'లో పసియెందులకు అని వీరెవ్వరినడుగుచున్నారు? ఎఱ్ఱాప్రగ్గడవలననే వీరికాసంశయము తీరవలెను.

'బాలశబ్దము పసికూనకే వర్తింపదు' అట (పు. 1) అది నిజమే కాని ముఖ్యార్థములో యువతికి వర్తింపదు.

'వ్యాకరణముపై నిలబెట్టబడినబాల జీప్టాప్లపై నిలబడకజారి పడిపోయినది అట." (పు. 1)

వీరు పొరబడుచున్నారు. వ్యాకరణముపై నిలబడినది పడిపోవుటేనా? వ్యాకరణముపై నిలబడిన శబ్దము తాను పడిపోదు సరి కదా ఇతరశబ్దములను బడగొట్టును.

'బాలాకన్యాశబ్దములు ప్రథమవయస్సును దెలుపు ననినారు. కన్యాకుమారీశబ్దములు మొదటివయసుస నున్న పడుచు పేర్లని లింగాభట్టనగ వీరు బాలనుకూడ కలిపినారు.' అట. (పు. 1-2)

కన్యాకుమారీశబ్దములే గాని బాలాశబ్దము ప్రథమవయోవాచకము కాదని వీరిభ్రాంతి. "వయసి ప్రథమే"...కుమారీ కన్యాయాన కన్యాయాః కనీనచేతినిర్దేశాత్ 'అజాద్యత ష్టాప్......బాలా వత్సా......ఏషు 'వయసి ప్రథమే' ఇతి జీప్ప్రాప్తః' ఈకౌముదీ గ్రంథమున కర్థము దెలిసికొనినయెడల బాలాశబ్దము కన్యాకుమారీ శబ్దములతో గలియునదో కాదో వీరికి తెలియగలదు.

1 "ఆషోడశా ద్భవే ద్బాల స్తత స్తరుణ ఉచ్యతే" మనుష్పది. 'శిశుత్వం శైశవం బాల్యమ్' అమరము. పదియారేండ్లకు లోబడిన వయసట. 'తరుణీ' కన్యావస్థాం తరతీతి' ముప్పదేండ్లకు లోబడిన వయసు కలది. ఇంతవరకు కన్యకదా!

2 "కన్యకాజాతః పెండ్లికాని పడుచుకొడుకట! కన్య పసిబిడ్డ కాదు" అట. (పు 2)

వీరిక్కడ ప్రథమాంశములో బాల— తరుణుల భేదమును ప్రతిపాదించినారు. దీనినిబట్టి బాల్య— తారుణ్యముల భేదము నంగీకరించినట్లే. ఆతారుణ్యమే "తారుణ్యం యౌవనం సమే" అను అమరమును బట్టి యౌవన మనబడుచున్నది. కాబట్టి బాల్యమునకును యౌవనము

నకును భేదము వీరును అంగీకరించినవారే. పదియారేండ్లకులోబడిన వయసు బాల్యమని వీరు వ్రాసినదే. "ఆషోడశా ద్భవే ద్బాలా' పదియారేండ్లది బాల యనబడును" అని వీరాశ్రయించినకరపత్రములో నున్నదానిని ఈ విమర్శకులు సమర్థింతురా ? ముప్పదేండ్లకు లోబడిన వయసుకలది తరుణి అని వ్రాసి 'ఇంతవరకు కన్య కదా!' అని వ్రాసి నారు. ఎంతవరకు ? ముప్పదియేండ్లవరకా ? కన్యావస్థ దాటనంత వరకా ? ప్రథమవయోరూపమైన కన్యాత్వము ముప్పదేండ్లవరకు నుండు ననుట విరుద్ధము. 'కన్యావస్థ దాటనంతవరకు' అనుపక్షములో 'ఇంతవరకు కన్యకదా' అనునది అనవసరము. ఇది దేనిని సాధించుటకు వ్రాసినది ? కనుక ప్రథమాంశము నిరస్తము.

—• కానీన శబ్దార్థ సమీక్ష •—

ఇక వీరి ద్వితీయాంశము— ఇక్కడ వీరి కొకింత చెప్పవలసి యున్నది— అమరకోశములో- "కానీనః కన్యకాజాత స్సుతః" అనుచు 'కన్యాయా అపత్యం కానీనః) అను కానీన శబ్దవ్యుత్పత్తి ప్రదర్శింప బడినది. ఇక్కడ అమరసుధావ్యాఖ్య యిట్లున్నది- "కన్యాయాఅపత్యం 'కన్యాయాః కనీన చ' ఇత్యణ్, 'కానీనః కన్యకాసుతే కర్ణే వ్యాసే ఇతి హేమ చన్ద్రః" అని. కానీనశబ్దము కన్యకాసుతుడగు కర్ణునియం దును, వ్యాసునియందును వర్తించునని దాని కర్థము. పై హేమచం ద్రోక్తి, కానీనశబ్దము కేవలయోగార్థము నవలంబించి కన్యకాజాతుల నందరను చెప్పునది కాక యోగరూఢితో కన్యకాజాతులుగా భారత మందు చెప్పబడిన కర్ణవ్యాసులనే బోధించు నని దెలుపుచున్నది. ఈ విశేష మేమనగా—

'కన్యాయా అపత్యమ్' అనుటలో కన్య అపత్యసంబంధము కల దగుట, అపత్యసంబంధము కలది కన్య యగుట అను విరోధము లేకుండ మొదటను సుతోత్పత్త్యనంతరము వరప్రభావముననను కన్యకలే అయిన కుంతీసత్యవతుల పుత్రులకే ఆకానీనత్వము చెల్లుట విశేషము. కనుకనే కౌముదిలో 'కన్యాయాః కనీన చ...కానీనో వ్యాసః కర్ణశ్చ' అని

యున్నది. ఇక్కడ 'బాలమనోరమ'లో—'భారతే వ్యాసః కర్ణశ్చ కన్యాయాః పుత్రావితి ప్రసిద్ధమ్' అని యున్నది.

మహాభాష్యప్రదీపమం దీవిషయ మిట్లు చెప్పఁబడినది—

'మునిదేవతా మాహాత్మ్యాత్ యా పుంయోగేఽప్యక్షత యోని ర్భవతి, యథా కుస్తీ మన్త్రాహూతదినకరోత్పాదితకర్ణాఖ్య పుత్రాపి పునః కన్యైవాఽభూత్। తదపత్యం కానీనశబ్దాభిధేయమ్'

పరాశరముని మహిమవలన వ్యాసోత్పత్త్యుత్తరము కన్యాత్వో చ్ఛిత్తి లేనట్టి సత్యవతీదేవియొక్కయు, సూర్యమహిమవలన కర్ణోత్ప త్త్యుత్తరము కన్యాత్వోచ్ఛిత్తి లేనట్టి కుంతీదేవియొక్కయు సుతులు కానీనశబ్దముచేత చెప్పఁబడుదురు. అని భావము.

ఈవిమర్శకు లీవిశేషమును మనస్సున ధరింతురుగాక.

'కన్య పసిబిడ్డ కాదు' అట! వారన్న యువతి యగునా?

ప్రథమవయస్సుకలది కన్య యని చెప్పియే యున్నాము. కనుక వీరివ్రాత పరాస్త మైనది.

విమర్శకుల వ్రాత యిట్లున్నది—

'ఈనడుమ ప్రకటించిన కరపత్రములో చంటిపిల్ల కాదనుచున్న కథకులు బాలాశబ్దమును ముఖ్యార్థములోనే దేలగొట్టినారు.' అటపు2

అయితే బాలాశబ్దమునకు ముఖ్యార్థము చంటిపిల్ల అని వీరి తాత్పర్యమా? యువతి యని తాత్పర్యమా? వెనుక జూపినట్లు పదియారేండ్లకు లోబడిన వయసు కలది బాలఅని వ్రాసిన వీరు దానికి ముఖ్యార్థము చంటిపిల్ల యనుట, యువతి యనుట విరుద్ధము కాదా. చంటిపిల్ల అనుమాట నాది కాదని వీరికి తెలియదు కాఁబోలు. నే ననినది కవిసార్వభౌముల ప్రథమకరపత్రములో నెట్లు వ్రాయబడినదో చూడుడు— 'శాస్త్రిగారా యుపన్యాసములో కుంతి చిన్నపిల్ల... అని చెప్పినారు.' ఇట్లుండ 'చంటిపిల్ల కాదనుచు బాలాశబ్దమును ముఖ్యా ర్థములోనే దేలగొట్టినారు.' అనుమాటకు అర్థ మున్నదా? కనుక నిది పరాస్తము.

'వృద్ధకుమారీతి తు గౌణః' అను తత్త్వబోధినీసూత్రమును శాస్త్రిగా రుదాహరించిరి. కుమారీపదము ముఖ్యమయి వృద్ధపదము గౌణ మగు నను సూత్రాభిప్రాయమును కాదననుకాని ముఖ్యముకూడ గౌణముగ మాఱు నవకాశము కలదని ఆసూత్రమే సూచించుచున్నది.' అట (పు 2)

దీనినిబట్టి ఏదిసూత్రమో ఏది వాక్యమో తెలియకపోవుట కేమికాని వీరు శబ్దములకు గౌణ—ముఖ్య-విభాగము సంగీకరించినట్లు స్పష్టము. మంచిది. వృద్ధా, కుమారీ పదములలో కుమారీపదమే గౌణార్థకమై వృద్ధతో నభేదాన్వయము నొందిన దని తెలిసికొనవలెను.

'ఇట్లు కన్య బహుముఖార్థముల నొందినను మొత్తముమీద వివాహముకాని స్త్రీగనే కనబడుచుండి... బాలాశబ్దమువలెనే కన్యాశబ్దముకూడ స్త్రీవాచకముగనే వ్యవహరించబడుట స్పష్టమగుచున్నది. కన్య కర్థము చంటిది కాదు. శాస్త్రిగారు కన్యను బాల యని భ్రమించినారు.' అట. (పు. 3)

ఈవిమర్శకర్తలు అక్కడక్కడ గల కన్యా-బాలా-కుమారీ-శబములనుచూచి యివి స్త్రీవాచకములుగనే కనబడుచున్నవని అవి ప్రథమవయోవాచకములు కావని తేల్చినారు. మేము చెప్పిన దేమనగా—ప్రథమవయోవాచకము లయియున్న ఆకన్యాదిశబ్దములు గౌణార్థములోనే స్త్రీమాత్రబోధకములుగా నాయాస్థలములలో వాడబడినవి కాని అదియే ముఖ్యార్థమని కాదు. 'సింహోమాణవకః' ఇత్యాదులలో మాణవపరమైన సింహశబ్దము గౌణార్థకమందురా? ముఖ్యార్థక మందురా? సింహత్వజాతి సింహశబ్దమునకు ముఖ్యార్థమైయున్నట్లు ప్రథమవయస్సు కన్యాదిశబ్దములకు ముఖ్యార్థమై యున్నది. దీనినే 'వయసి ప్రథమే' అను వ్యాకరణసూత్రము తెలుపుచున్నది. అని.

'కన్య కర్థము చంటిది కాదు.' అట! ఇక్కడ అప్రసక్తప్రతిషేధదోషము. కన్య చంటిది అను ప్రసక్తిని దెచ్చినవా రెవరు?

'కన్యను బాల యని భ్రమించినారు' అట. ఇది భ్రమ కాదు.

ప్రిమయే. ప్రియోగములనుగూడ చూడుడు—

'ఏవ ముక్త్వా తు తాం కన్యాం కున్తిభోజో మహాయశాః ।
పృథాం పరిదదౌ తస్మై ద్విజాయ ద్విజవత్సలః ॥
ఇయం బ్రిహ్మణ మమ సుతా బాలా సుఖవివర్ధితా।' (వన. అ.304)

ఇక్కడ కుంతీదేవియందు కన్యా—బాలా—శబ్దములు ఏకత్రి వాడబడినవి. కన్య, బాల కాదా! 'బాలాశబ్దమువలెనే కన్యాశబ్దము కూడ స్త్రీవాచకము' అను మీమాట కేమర్థమో చెప్పుడు? కనుక పరాస్తము.

—•మాధవీయోక్త కన్యాశబ్దార్థమునుగూర్చి విమర్శకుల వ్రాత యిట్లున్నది•—

"వివాహవయోనిర్ణయ కన్యానిర్వచనముల జేయుచున్నాడు పరాశరుడు."... అట. (పు 6)

ఈ విమర్శకర్త లనిన 'కన్యానిర్వచనమును' చేసినవాడు పరాశరుడు కాడు. పరాశరస్మృతికి వ్యాఖ్యాత యగు మాధవాచార్యులు చేసినారు. ఆ మాధవీయవాక్యము లివిగో—

"కన్యాశబ్దేన లజ్జాద్యభిజ్ఞానరహితవయోయుక్తా వివక్షితా। తథా చ పురాణమ్—... యత్తు విష్ణునోక్తమ్—

"ఋతుత్రియముపాస్యైవ కన్యా కుర్యా త్స్వయం వర మితి"
......నను ఋతుమత్యాం కన్యాశబ్దః కథం ప్రియుక్తః, యతో యమేన 'దశవర్షా భవే త్కన్యా' ఇత్యుక్తమ్। నచ దశమే వర్షే ఋతు స్సంభవతి। నాయం దోషః, గౌర్యాదిశబ్దవత్కన్యాశబ్దస్యాపి యమేన పరిభాషితత్వాత్। సా చ పరిభాషా ఫలకథనాదావుపయుక్తా। తచ్చ పూర్వమేవోదాహృతం (కన్యాం దద ద్బ్రహ్మ లోక మితి।

లోకసిద్ధస్తు కన్యాశబ్దో వివాహరహితస్త్రీమాత్రి మాచష్టే। ఏవం చ సతి శాస్త్రేషు బహవః కన్యాశబ్దా అనుగృహీతా భవన్తి। తథాచానుశాసనికేఽష్టావక్రోపాఖ్యానే వృద్ధస్త్రియాం ప్రియుక్తః ...శల్యపర్వణ్యాపి వృద్ధస్త్రియాం నారదేన ప్రియుక్తః—"అసం

స్మృతాయాః కన్యాయాః కుతో లోకాః" ఇతి। ఉమామహే శ్వరసంవాదేపి 'ఋతుస్నాతా తు యా శుద్ధా సా కన్యేత్యభి ధీయతే' ఇతి.

తాత్పర్యము- ఎంతవయసులో సిగ్గుపడుట ఎరుగకుండునో అంతవయసు కలది కన్య అని పురాణములో నున్నది. పదియేండ్లది కన్య అని యమస్మృతిలో నున్నది. ఋతుమతి యందు కన్యాశబ్దము విష్ణు స్మృతిలో నున్నది. వృద్ధస్త్రీయందు కన్యాశబ్దము ఆనుశాసనిక మం దున్నది. శల్యపర్వమందును ఉన్నది. ఋతుస్నాతయందు కన్యాశబ్దము స్థలాంతరమందున్నది. ఇట్లనేకవిధములుగా నున్న కన్యాశబ్దమునకు వ్యవస్థ యెట్లనగా, వయస్సు నపేక్షింపకుండ అవివాహితస్త్రీమాత్రి మును కన్యాశబ్దము చెప్పునను పక్షములో పైప్రయోగము లన్ని యును అనుగతము లగును. పదియేండ్లది కన్య అనునది సంజ్ఞ. అని.

ఈ మాధవీయము కన్యాశబ్దమునకు పైప్రయోగములలో గౌణార్థప్రతిపాదనమే చేసియుండెను. ప్రథమవయోరూపమైన ముఖ్యార్థమును వ్యాకరణోక్తమైయున్నదానిని త్రోసివేయలేదు. పైప్రయోగము లన్నియు ముఖ్యార్థకములే అను వారి మతములో కన్యాశబ్దము అనియతార్థకము కావలసివచ్చును. వ్యాకరణవిరోధము తటస్థించును. అట్లు కాకుండుటకే మాధవీయము అవివాహితాత్వగుణ ముతో ప్రయోగముల కనుగతిని చేసియుండెను. మేమిప్పు డీవిమర్శ కర్తల నడుగుచున్నాము- కుంతీపరమై వివాదవిషయమైయున్న కన్యా శబ్దము ప్రథమవయోవాచకము కాదని కాని, అవివాహితార్థక మని కాని మాధవీయ మేమైన చెప్పునా ? వృద్ధయందు కన్యాశబ్దప్రయోగ మునకు శల్య- ఆనుశాసనిక- పర్వముల నుదాహరించిన మాధవా చార్యులవారు మీ మతప్రకారము ప్రౌఢ, యువతి. అగు కుంతి యందు కన్యాశబ్దప్రయోగమునకు ఆది- వన- పర్వాదుల నుదాహ రింపలేదేమి ?

ప్రథమవయోవాచకకన్యాశబ్దము వృద్ధయందువలె యువతి యందును విరుద్ధమేకదా। కుంతియందు కన్యాశబ్దము విరుద్ధము కాదు

కనుక దాని నెత్తుకొనలేదనక తప్పదు. విరుద్ధము కాకుండుట కుంతి యువతి కాకుండుటచేత ననక తప్పదు.

ఇప్పుడు మీవాద మేమైనది! మావాదమున కేమి బాధ వచ్చినది? కన్యాశబ్దములను కుప్పించిచేసిన మీ కోలాహలమంతయును అస్థానసంరంభము. పే. 3 లో సగమునుండి 4, 5 లు అసంబద్ధాలాపము లగుటచే త్రోసివేయబడినవి.

"బాలాశబ్దము పసిబిడ్డకే వర్తించు ననినారు తత్త్వకథకులు. శ్రీరాముని వనవాసమునకు వెంటబడిన సీత చిట్టిబొట్టె కాదు.... ఆమె బాల అయినది." అట. (పు 6)

తత్త్వకథకులు, కుంతీపరమైన బాలాశబ్దము యౌవనబోధకము కాదనినారు కాని, అది పసిబిడ్డకే వర్తించు ననలేదు. విమర్శకర్తలు పొరబడుచున్నారు. కుంతియందలి బాలాశబ్దమే వివాదగ్రస్తమై యున్నందున దానికి సంబంధించిన చర్చయే అవసరము. గౌణార్థకములు, నిర్వివాదములు, నయి యెక్కడెక్కడనో ఉన్న బాల— బాలా— శబ్దములను వీ రుదాహరించుట కవసరమేమి? అక్కడక్కడ ముఖ్యార్థముసంభవింపనిచోట నట్టిగౌణార్థము నెవ్వరంగీకరింపరు? ఆ గౌణార్థమునుబట్టుకొని లేనిపోని యభినివేశముతో ముఖ్యార్థము నెగురగొట్టుటకు సంకల్పించినవారు విమర్శకర్తలే.

ఇతరత్ర బాలాశబ్దములను చూపి 'ఆబాలల వయసెంతయో' 'ఈబాల వయసెంతయో' అనుచు వచ్చినారు విమర్శకులు, అచ్చట వారనుకొనినంత వయసు చెప్పుకొనవచ్చును.

"బాలాం పుంయోగ మనిచ్ఛన్తీం బాలామివ" నీలకంఠవాచ్యుడు. ఈ బాలవయ సెంతయో? శ్రీ శాస్త్రిగారి కన్యా- బాలా— ప్రవచనము పొరబాటొందిన దని పర్యవసానము" అట. (పు 7-8)

విమర్శకర్తలిచ్చట 'బాలాం...బాలామివ నీలకంఠవాచ్యుడు' అనుటలో నీలకంఠుడు అనక నీలకంఠవాచ్యు డనినారేమి!

పైవ్యాఖ్యాత నీలకంఠుడు కాడు. మరెవ్వరో అని సూచించుటకా! నీలకంఠపదవాచ్యుడు నీలకంఠుడుకాక మరొకరెట్లగుదురు?

వీరి పరిభాషలో దానికి మరొక రర్థమైనయెడల ఈరామభద్రియ నులుపదవాచ్యులును మరొకరే అయియుండవలెను. ఇక్కడ బాల సత్యవతి కనుక 'గతా ప్రథమయౌవనమ్' అను వచనముచేత సత్యవతిది ప్రథమయౌవన మని తెలిసికొనవలెను. ఆమెకు బాల్యముదాటుట చేతనే ఆమెయందు బాలాశబ్దమునకు గౌణార్థమును నీలకంఠులు చెప్పినారని తెలిసికొనవలెను. శాస్త్రిగారి కన్యా-బాలా-ప్రవచనము పొరబాటొందినదని పర్యవసానమట ! అది యెట్లు ? మాప్రవచనము శాస్త్రానుగతమని నిరూపించియే యున్నాము.

—• కుంతీయౌవనవాద సమీక్ష •—

విమర్శకుల వ్రాత యిట్లున్నది—

"శాస్త్రిగారు కరపత్రములో ప్రథమవయోవాచకమున బాలా శబ్దము శాస్త్రోక్త మనిరి. తమ బాలత్వము పసితనమునుండి చరమావస్థలోనికి మార్చుకొనుచున్నారు." అట. (పు 9)

వీరి కొకింత తెలుపవలసియున్నది— కుంతీబాల్యమును గూర్చి వివాదములో కవిసార్వభౌములు ప్రథమకరపత్రములో నిట్లువ్రాసిరి- "కుంతిం బిలిచి (తండ్రి) 'జానామి ప్రణిధానం తే బాల్యాత్ప్రభృతి నందిని' నీపేర్మి చిన్నతనమునుండి యెఱుంగుదు ననియె, దీని నప్పుడు చిన్నతనముగాక పైనగు పెద్దతనమే యని తెలియుట లేదా ?" అని. (ఇక్కడబాల్యశబ్దమునకు చిన్నతన మర్థము చెప్పి మరియొకచోట నిట్టిశబ్దమునకే వారు చిన్నతన మర్థము కాదందురు. అది ముందు తెలుపబడును.)

దీనికి సమాధానములో 'బాల్యాత్ ప్రభృతి' బాల్యావస్థలోని మొదటిభాగమునుండియు, అనగా అప్పటికంటె చిన్నతనమునుండియు నెరుగుదు నని అర్థము చెప్పవచ్చును. అప్పుడు కుంతి చిన్నతనములోనే యీవాక్యము సంగత మగును. ఆమెకు పెద్దతనము గల్పింప నవసరము లేదు. అని తెలిపినాము. బాలాశబ్దము ప్రథమవయోవాచకము కాదనలేదు. కుంతికి బాల్యముదాటిన దనలేదు. మేము బాలత్వమును మార్చుకొనిన దేమున్నది ? కనుక నిది పరాస్తము.

విమర్శకుల వ్రాత యిట్లున్నది—

"మయా మన్త్రబలం జ్ఞాతు మాహూత స్త్వం విభావసో!
బాల్యాత్ బాలేతి తత్కృత్వా క్షన్తు మర్హసి మే విభో" ॥

1 బాల్యాత్ మయా ఆహూతః అని అన్వయముకదా। తత్ కృత్వా అనిన బాలవ్యాసు లేమిచెప్పెదరు? తత్ కృత్వా దానిని చేసి, దేనిని చేయు మనెను కుంతి? (గర్భాధానముచేసి, ఎట్టా ప్రగడ)...గర్భాధానకృత్యమును చేయు మనెను... 2 ముందు శ్లోకములో 'బాలేతి కృత్వానునయం తవాహం దదాని'...అజ్ఞానము, చేతనే నన్ను తిరస్కరించుచున్నావు. 'క్రియతాం సంగమో మమ' అని చెప్పియు నిన్ను, నీ మంత్రదాతను నశింపజేసెద నని బెదరింపునుగూడ జరిగించినాడు.

3 కుంతి సూర్యుని మాట కంగీకరించనిచో కీడు మూడునని... ఆపద్ధర్మముగ నెంచి యంగీకరించినది. 'న శశాక తదా బాలా ప్రత్యాఖ్యాతుం తమోనుదమ్' ఇట పసితనము సూచితము కాలేదు. ప్రాత్యాఖ్యతయే ద్యోతితమైనది. తాను కోరిన పుత్రు నిచ్చిన సంగమించెద ననినది.

4 సూర్యుడు 'అవివేశ నాభ్యాం పస్పర్శ, నాభిని స్పర్శించెను. స్పర్శింప నిచ్చినదామె...సూర్యుడో కుంతిని శయ్యయందు బడవేసినాడు. తనను లీనము జేయించుకొనినాడు. 'ఆత్మసంస్థాం చకార' 'శయనీయే పపాత' 'మోహావిష్టా భజ్యమానా లతేవ' ఇట మోహము మూర్ఛగాదు. వీనిని స్పృశించినందున కలిగిన కామజనితమైన మైమరపు. తనలో లీనము చేసికొనుట యననామె హస్తములచే దన నాలింగనము కావించుకొనినాడని యర్థము. 'సంబభూవ తయా సహ' కలసెను.

ఈపర్యాలోకమునవలన కుంతిది పసితనము కాదనియు, యౌవనమే యనియు స్పష్టమగుచున్నది." అట! (పు. 10-11)

ఇచ్చట ప్రథమాంశమును సమీక్షింతము—పైశ్లోకములో తత్ కృత్వా అననేమో మేము చెప్పవలెనట! ఈవిమర్శకర్తలు వ్రాసిన దెంత బాగున్నదో ముందుతెలిపి ఆపై మేము చెప్పుదుము.

'తత్ కృత్వా' అనుదానికి తమకుప్రియమైన అర్థము వర్ణించినారు. సరే. కాని 'బాలేతి' అనుదాని కన్వయ మేమి చేసినట్లు? దీనికి మీయర్థములో ప్రయోజన మేమున్నట్లు? తత్ (మీరనిన) ఆపనిని కృత్వా చేసి-దీని కన్వయమెక్కడ? 'క్షన్తుమర్హసి'లోనేనా? కావలసిన పని చేయుమనికూడ చెప్పి ఇక 'క్షన్తు మర్హసి' అనుచు క్షమాపన మేమిటికి? ఆపై నున్న 'మే విభో' లోని మే పదమునకు దేనితో సంబంధము? మరియు ద్వితీయాంశముగా జూపబడిన మీవ్రాతలో— 'ముందుశ్లోకములో 'బాలేతి కృత్వానునయమ్' అజ్ఞానముచేతనే నన్ను తిరస్కరించుచున్నావు.' అని సూర్యు డనినట్లున్నది. ఆకృత్యమును మీమతప్రకారము చేయుమనినదాయె. ఏమితిరస్కరించినది? ఆపై 'క్రియతాం సంగమో మమ. అని చెప్పి నిన్ను, మంత్రదాతను నశింపజేసెద నని బెదరింపుగూడ జరిగించినాడు' అంటిరి. మీమతప్రకారము ఆకృత్యమును చేయుమని యామె అనిన తరువాత నీతర్జనభర్జనములెందులకు?

తృతీయాంశము—'కుంతి సూర్యునిమాట కంగీకరించనిచో కీడు మూడు నని యంగీకరించినది. 'న శశాక తదా బాలా ప్రత్యాఖ్యాతుమ్' అంటిరి. ఆమె సూర్యుడు సమీపించినతోడనే ఆకృత్యమును చేయు మనెనుకదా. ఇక కీడు మూడుటేమి? సూర్యుని నివారింప యత్నించి నివారింపలేకపోవుటేమి?

ఇదంతయు 'తత్ కృత్వా'కు తాము అసత్యముగా చెప్పిన అర్థముతో వచ్చిపడిన అనర్థము.

మరియు 'తత్ కృత్వా' దానిని చేసి దేనిని చేయు మనెను కుంతి? గర్భాధానకృత్యమును చేయుమనెను, అని వ్రాసి' గర్భాధానము చేసి ఎట్లాప్రగడ' అని చూపినారే. ఎట్లాప్రగడ 'తత్ కృత్వా'కు ఆయర్థము వ్రాసెనా? '...చేసి' అను పైవాక్యమును చూపుట యేమిపని? భ్రాంతికలిగింతురా పాఠకులకు.

'మయా మన్త్రబలం జ్ఞాతుమ్' గమ్యతాం భగవం స్త్వతి... కౌతూహలా త్సమాహూతః' అను శ్లోకతాత్పర్యముగా ఎఱ్ఱాప్రగడ వ్రాసినదిది—'పడతి యిట్లను గమలాప్తుతోడ

'కార్యమొక్కటియును లేదు కౌతుకమున
నేను మంత్రంబు నొడివితి నింతమాత్రి
జేసి నీకు నిచ్చుటకి విచ్చేయనేల
దివికి నరుగుము క్రమ్మఱ దేవ నీవు.

అనిన 'దానికి సూర్యుం డిట్లనియె'

ఇక్కడ ఆమాట లేదుకద। తత్కృత్వా అనుదాని అర్థములో ఎఱ్ఱాప్రగడ నెత్తుకొనవలసిన పనియేమి ? ఆత డామాటను వాడిన స్థలము చూడుడు— సూర్యప్రేరణ కొడబడని కుంతీదేవియొక్కయు, ప్రేరేపించు సూర్యునియొక్కయు, వాక్యోపవాక్యములు చాలవరకు జరిగినతరువాత నీ కిందువలన ధర్మహానికాని కన్యాత్వభంగముకాని రేమియు గలుగదని బోధించి యొప్పించి కలిసిన సందర్భము—'అని యొడంబఱిచి సూర్యుండు... దానికి గర్భాధానంబు సేసి గగనంబున కరిగె' ఇక్కడమాటను తత్కృత్వా లో అతికించి కుంతీదేవి ఘనతను మాపివేయు అర్థమును చెప్పుటకే విమర్శకర్తలు చూచినారుకాని శ్లోకసమన్వయమునుగాని, ఉత్తరగ్రంథసందర్భమునుగాని వీరు చూచుకొనలేదు. అహంకారపూర్వకప్రవృత్తిలో వచ్చు ఫల మిదియే.

ఇక మేమాశ్లోకార్థమును చెప్పుచున్నాము- మన్త్రబలం జ్ఞాతుం బాల్యాత్ మయా త్వ మాహూతః। మే=నాయొక్క; తత్= ఆ ఆహ్వానమును; బాలేతి కృత్వా= ఈమె బాలిక అనుకొని, క్షమింపుము. అని అర్థము.

ఇప్పుడు 'తత్కృత్వా' కు ఎట్లన్వయమో విశదమైనదా ? ఇప్పుడు పై గ్రంథముతో విరోధమా లేదు. అసభ్యతాదిదోషమా లేదు.

ఈ శ్లోకములో— 'మయా ఆహూతః బాల్యాత్, బాలేతి తత్కృత్వా క్షన్తు మర్హసి' అనుదానికి వీరాశ్రయించిన ద్వితీయకరపత్రములో "కుంతి సూర్యునితో నేను ఆరితేరినదానను కాను, చిన్న

దానను. తెలియక నిన్నట్లు పిలిచితిని. క్షమింపు మన్నది. లోకవ్యవహార మిట్లే యుండును. దీనం జేసి కుంతి పిల్ల యన నొప్పదు. ఇట్టి బాల్యము యౌవనమున ముమ్మాటికిని చేరును" అని కవిసార్వభౌములు చెప్పిన శ్లోకార్థమునకు ఈ విమర్శకులు చెప్పినది విరుద్ధమే కదా !

ఇక 'లోకవ్యవహార మిట్లే యుండును. దీనంజేసి కుంతి పిల్లయన నొప్పదు' అను మాటపై చెప్పవలసియున్నది—

వీరి మతప్రకారము, ప్రౌఢయై యౌవనములోనున్నట్టి ఆమె, నేను చిన్నదానను, తెలియక పిలిచితిని అని చెప్పుట, లోకవ్యవహార సిద్ధమగునట్లు, నీవు చిన్నదానవా ! అని వెంటనే యాక్షేపించుటకూడ లోకవ్యవహారసిద్ధము కాకుండునా ? అట్టి యాక్షేపము రానందున ఆమె చిన్నదే అని ధ్రువ మగుచున్నది.

ఇంకొకటి, 'చిన్నదానను, తెలియక పిలిచితిని' అనుటలో చిన్నదానను. అనికూడ ఎందులకు ? వారిమతప్రకారము 'బాల్యా దాహూతః' తెలియక పిలిచితిని, అననదే చాలునే. పెద్దదయియుండి చిన్నదాన ననుట, అదియు నిష్ప్రయోజనముగా ననుట, ఆక్షేపణీయము కాదా !

కనుక చిన్నదయియుండియే చిన్నదాన ననినది. ఆ యనుటచే తెలియక పిలిచితి ననుట కుపోద్బలకమై నిరాక్షేపణ మయినది.

అట్టి కుంతీదేవి బాల్యమే అనంతరశ్లోకములో 'బాలేతి కృత్వాను నయం తవాహం దదాని' అనుచు సూర్యునిచే అనువదింపబడినది. కాబట్టి కుంతీదేవిది బాల్యమే. అది యౌవనములోనే చేరు ననుట అయుక్తమే.

—• కుంతీబాల్యవాదమున కుపష్టంభకములు •—

1 సూర్యుని ప్రత్యాఖ్యానము చేయలేనిదై సూర్యుడు తన తండ్రికి, గురువునకు హానికలిగింతు ననుటచే భీతిల్లినది కుంతీదేవి అప్పు డిట్లనుకొనెను—

'బాలేనాపి సతా మోహా ద్భృశం పాపకృతా మయా
నాభ్యాసాదయితవ్యాని తేజాంసి చ తపాంసి చ॥' (వన అ. 307)

టీ. బాలేన అల్పవయసాపి సతా సాధునా మోహాత్ చిత్త పారవశ్యాత్ పాపం కృతం హింసితం యైస్తాని నిష్పాపాన్యపి తేజాంసి సూర్యాదీని తపాంసి దుర్వాస ఆదీని నాభ్యాసాదయిత వ్యాని అత్యన్తం ప్రత్యాసత్తివిషయాణి న కర్తవ్యాని.'

తాత్పర్యము—అల్పవయసు కల సాధువుకూడ ఆలోచన లేకుండ పాపరహితులైనను- తేజోమూర్తులయిన సూర్యాదులనుగాని, తపోమూర్తులయిన దుర్వాసఃప్రభృతులనుగాని అత్యంతసామీప్యవర్తలను చేసికొనరాదు. అని.

ఇట్లు తన స్థితిని తలపోసికొనుటలోగూడ కుంతీదేవిబాల్యము, సత్ప్రవర్తన స్పష్టమగు మగుచున్నది.

కాబట్టి కుంతీదేవిది బాల్యమే. యౌవనము కాదు.

2 ఇంకొకటి. కుంతిభోజుడు దుర్వాసోమహర్షి శుశ్రూషకై పుత్రిక నప్పగించుచు మహర్షితో నిట్లనెను—

"ఇయం బ్రహ్మన్ మమ సుతా బాలా సుఖవివర్ధితా ।
అపరాధ్యేత యత్కించి న్న కార్యం హృది త త్త్వయా ॥
ద్విజాతయో మహాభాగా వృద్ధ—బాల—తపస్విషు ।
భవ న్త్యక్రోధనాః ప్రాయో హ్యపరాద్ధేషు నిత్యదా ॥"

మహర్షీ! ఈమె నాపుత్రిక; ఈమెది బాల్యము; ఈమె యత్కించిదపరాధముచేసినను దానిని నీవు మనసులో బెట్టుకొనరాదు. పూజ్యు లెప్పుడును వృద్ధ-బాల-తపస్వులు ఏదేని అపరాధము చేసినను వారియెడల ఆగ్రహింపరుకదా. అని.

శ్రీకృష్ణభారతములోగూడ నిట్లున్నది—

తే. దేవ మిము బోల్మహాత్ములు భావమందు
బాలవృద్ధతపస్వు లేలీలనైన
సలుప నపరాధములు వాని సరకుగొనక
కరుణ మన్నింప రెంతురుగాదె తలప. (పుట. 527)

ఇక్కడ ఆగ్రహింపదగని వారుగా పేర్కొనబడినవారు వృద్ధ-బాల-తపస్వులు. అంతియకాని యౌవనవంతులు గారు. ఈమూడు

విధములయినవారిలో వృద్ధ—తపస్వులలో చేరని కుంతీదేవి బాలస్థాన ములోనే చేరినది. కాబట్టి కుంతీదేవిది బాల్యమే. యౌవనము కాదు.

3 ఇంకొకటి. కుంతిభోజుడు కుంతితో నిట్లు చెప్పెను—అమ్మా! మహర్షి మనయింట నివసింతు నని చెప్పగా మంచిదని సమ్మతించితిని. ఆతడు మహాతపస్వి; నాకు మాటరాకుండ నీవడకువతో మహర్షికి పరి చర్య చేసి కృతార్థత కలిగింపవలెను. అని. యిట్లు చెప్పగా కుంతీదేవి, తండ్రీ! నీకు మాటరాకుండ నాపరిచర్యలో లోటు లేకుండ నేను చేయుదు నని ధైర్యము చెప్పినపుడు—

"ఏవం బ్రువన్తీం బహుశః పరిష్వజ్య సమర్థ్య చ ।
ఇతి చేతి చ కర్తవ్యం రాజా సర్వ మథాఽదిశత్ ॥" (వన అ 304)

తండ్రి కుంతీదేవి నాలింగనముచేసికొని ఆమెకు కర్తవ్యము నుపదేశించెను.

శ్రీకృష్ణభారతములోగూడ నిట్లున్నది—
వ. ..."అని పల్కిన గూతుం గ్రుచ్చి కౌగలించుకొని కుంతిభోజుండు."
(పుట. 527)

ఈ యాలింగనము యౌవనములో నున్నపుడు తండ్రియయినను చేయుట భావ్యముకాని పని.

మనుస్మృతిలో—"మాత్రా స్వస్రా దుహిత్రా వా న వివిక్తాసనో భవేత్" 'నిర్జనగృహాదౌ నాసీత ॥'

తల్లితోగాని, తోబుట్టువుతోగాని, కుమార్తెతోగాని, పురుషుడు నిర్జనస్థలములో గలిసియుండరాదు. అని చెప్పబడినది.

యౌవనములోనున్నదానిని తండ్రి అయినను ఆలింగనము జేయుటనుగూర్చి యికచెప్పవలెనా? కనుక యౌవనములో నున్న దానిని తండ్రి ఆలింగనముచేసికొనె ననుట అయుక్తము. ఆలింగనము చేసికొనినట్లు స్పష్టముగా నున్నది.

దీనినిబట్టికూడ ఆమెది బాల్యమే. యౌవనము కాదు.

"ప్రార్థితయే ద్యోతితమైనది' కోరిన పుత్రు నిచ్చిన సంగమించెద ననినది" అనిరి. విమర్శకర్తలు. (పు 11)

ఆమెకు మహర్షి యిచ్చినది— దేవతల నాకర్షించి పుత్రిప్రద మగునట్టి మంత్రము. ఆమంత్రము పరీక్షింపనెంచి ఆమె సూర్యు నుద్దేశించి జపించినది. సూర్యుడు సన్నిహితుడై పుత్రోత్పత్తి గావింతు ననెను. ఆమె సమ్మతింపక వెళ్ళుమని వేడుకొనెను. అపై సూర్యుడు నిన్ను, నీకామంత్రమి చ్చినవానిని, నీ తండ్రిని గూడ శపింతు ననగా, దానికామె భయపడి నిరపరాధులగు తనవారి కాముప్పులేకుండ జేయుటకై సూర్యాపేక్షణకు లోనుగావలసిన స్థితికి వచ్చి తనకు ధర్మహాని, లోకనింద, కన్యాత్వభంగము లేకుండు వరములను పొంది తనకు తాత్కాలికమంత్రజపఫలితముగా గర్భలాభసమయ మనివార్యమై వచ్చిపడుట, మంత్రాహూతదినకరనిర్బంధ మపరిహార్యమగుట జూచి నా కిప్పుడిది తప్పదందువేని సరే యిట్టి పుత్రు ననుగ్రహింపు మనినది. విమర్శకులును— "నశింపజేసెదనని బెదరింపుగూడ జరిగించినాడు. సూర్యునిమాట కంగీకరించనిచో కీడు మూడునని ఆపద్ధర్మముగా నంగీకరించినది" అని వ్రాసియే యున్నారు. దీనిలో విమర్శకులకుప్రాధ తాద్యోతనమైనదట. అది దృష్టిభేదము తప్ప మరొకటి కాదు. ప్రమాణ బాహ్యమైన వీరి దృష్టి కుంతీబాల్యమునకు బాధకము కాదు.

ఇక చతుర్థాంశము—'అవివేశ, నాభ్యాం పస్పర్శ' అను రెండింటిలో కర్త సూర్యుడు; రెండవదానికి '...స్పర్శించెను. స్పర్శింపనిచ్చిన దామె' అనిరి. 'కీడు మూడు నని అంగీకరించినది.' అని చెప్పిన వీరు ఆమె స్పర్శసుఖమునకు అభిలాషపడిన దనునట్లు 'స్పర్శింపనిచ్చినది' అని వ్రాయుట హేయము.

ఒక బలాత్కారమునకు లోనయిన వ్యక్తిని 'స్పర్శింపనిచ్చిన' దనుట లోకమర్యాదయేనా ? 'ఆత్మసంస్థాం చకార' తనను లీనము జేయించుకొనినాడు. తనలో లీనముచేసికొనుట యన నామె హస్తములచే దన నాలింగనము కావించుకొనినాడని యర్థము' అనిరి. వీరి ధోరణిలో యనౌచిత్యము తెలిసికొనవలెను.

గ్రంథసందర్భ మెట్లున్నదో చూడుడు—

"...యోగాత్మా నాభ్యాం పస్పర్శ...తతస్సా విహ్వాలే వాసీత్ కన్యా సూర్యస్య తేజసా ।"

సూర్యుడు స్పృశించెను. అంత సూర్యతేజస్సుచేత ఆమె నిశ్చేష్టితురాలుగా నుండెను.

"పపాత చాథ సా దేవీ శయనే మూఢచేతనా" ఆపై తెలివి తప్పి శయ్యపై బడెను.

"మోహావిష్టా భజ్యమానా లతేవ" మూర్ఛితురాలై విరిగిన లతవలె బడినది.

ఇచ్చట విమర్శకర్తలు— "ఇట మోహము మూర్ఛ గాదు. స్పృశించినందున కలిగిన కామజనితమైన మైమరుపు" అనుట బాగున్నదా? విహ్వల, మూఢచేతన, అయియున్న స్థితిలో కామజనితమైన మైమరుపా?

"తిగ్మాంశుస్తాం తేజసా మోహయిత్వా
యోగేనావిశ్యాత్మసంస్థాం చకార।
నచైవైనాం దూషయామాస భానుః
సంజ్ఞాం లేభే భూయ ఏవాథ బాలా॥"

టీ. ఆత్మసంస్థాం వచనవశామేనాం న దూషయామాస. కన్యాత్వస్థాపనేనేతి శేషః॥

సూర్యుడు తన తేజస్సుచేత ఆమెను మోహావిష్టురాలను చేసి అనగా సొమ్మసిలజేసి యోగముచేత నావేశించి కర్తవ్య మాచరించెను. తన మాటపై నిలబడియున్న యీయామెను, కన్యాత్వస్థాపన చేయుటచే దూషితురాలను చేయలేదు. ఆపై ఆబాల తిరిగి తెలివి దెచ్చుకొనెను.

గ్రంథసందర్భ మిట్లున్నది. ఇచ్చట మొదట 'సూర్యతేజసా విహ్వలేవాసీత్' 'పపాత శయనే మూఢచేతనా' అని చెప్పి చివర 'సంజ్ఞాం లేభే భూయః' అని చెప్పబడినది. ఆనడుమను తెలివి తప్పి యున్నట్లే గోచరించుచున్నది. ఆస్థితియే 'మోహావిష్టా' అని చెప్పబడినది. ఆమోహమునే మూర్ఛకాదని విమర్శకర్తలు అనిరి. తెలివి తప్పిన స్థితిలోని ఆమోహము మూర్ఛకాక మరేమగును? 'స్పృశించి నందుచే కలిగిన కామజనితమైన మైమరుపు' అని విమర్శకర్తలు. "తిగ్మాంశుస్తాం తేజసా మోహయిత్వా" ఆమోహము సూర్యతేజ

స్పర్శన కలిగిన దనియుండ 'స్పృశించి నందున కలిగిన దనుట, కామ జనితమనుట' ఎంత విరుద్ధము ?

పైశ్లోకములో— 'ఆత్మసంస్థా మేనాం న దూషయామాస భానుః' తన మాటపై నిలబడిన యామెను సూర్యుడు దూషితురా లను చేయలేదు. అని నీలకంఠులు సమన్వయించియుండ, విమర్శ కర్తలు— 'ఆత్మసంస్థాం చకార' అని కలిపి ప్రేరణార్థము నతికించి 'తనను లీనముజేయించుకొనినాడు......తనలో లీనముచేసికొనుట యన నామె హస్తములచే దన నాలింగనము కావించుకొనినా డని యర్థము' అని వ్రాయుట యెంత విరుద్ధము ? తెలివితప్పియుండినట్టి ఆబాల బాహుప్రసారముచేసినట్లు కల్పించుట యుచితమా? 'యోగేనా విశ్య' యోగముచేత సూర్యు డావేశించినట్లుండ వీరి బాహ్యావ్యాపార కల్పన కర్థ మున్నదా ? కనుక వీరి దసంగత ప్రసంగమగుటచేత "ఈ పర్యాలోకనమువలన కుంతిది యౌవనమే అని స్పష్ట మగుచున్నది" అను వ్రాత పరాస్తమైనది.

కుంతీదేవిది బాల్యమే యౌవనము కాదు.

—• కుంతీబాల రజోదర్శనమునుగూర్చి •—

విమర్శకుల వ్రాత యిట్లున్నది—

"ఏవం సంచిన్తయన్తీ సా దదర్శర్తుం యథేచ్ఛయా।
వ్రీడితా సాఽభవ ద్బాలా కన్యాభావే రజస్వలా॥

ఇట గుంతి రజస్వలయై యుండినట్లుండ 'యదృచ్ఛయా'ను యాదృచ్ఛికమును చేసి ఇది వయఃప్రయుక్తము కాదనుచు... పొరబాటొందిరి. 'యదృచ్ఛయా— అకస్మాత్। ఋతుం రజో చిహ్నం దదర్శ.' అని అన్వయము. 'యదృచ్ఛా సంభవిత ఋతుం దదర్శ' అని కాదు 'దదర్శ'లోనే ఆ అకస్మికత్వ మున్నది. ఆక స్మికప్రాప్తి అయినచో ప్రాప్త్యర్థ మిచ్చు ధాతువే ప్రయోగింప బడియుండును." (పు. 11-12)

పైశ్లోకములో విమర్శకుల పాఠము—'యథేచ్ఛయా.' అసలు భారతపాఠము— 'యదృచ్ఛయా.' ఇట్లుండ వీరేమి వ్రాయుచు

న్నారు ? 'యదృచ్ఛయా అకస్మాత్, ఋతుం రజశ్చిహ్నం దదర్శ' అనియే అన్వయమట మరేదికాదు? యదృచ్ఛాసంభవితఋతుం దదర్శ' అని కాదట ! ఇందు భేదమెక్కడ ? 'యదృచ్ఛ' వాక్యద్వయమందు నున్నదే. అట్లు 'ఋతుం దదర్శ' కూడ నున్నదే. ఇక భేదమేమి ? మొదటిదానిలో ఋతుం రజశ్చిహ్నం' అని వీరి అర్థమున్నది. రెండవ దానిలో 'ఋతుం' అనియేకాని ఆయర్థము లేకున్నది. ఇదియేనా భేదము? ఈభేదము అర్థభేదమా ? అన్వయభేదమా ? ఇది యేమివ్రాత ? 'ఋతుం' అనియే శ్లోకమందున్నదాయె. కనుక నిది అసంగతప్రసంగము.

తమవ్రాతకు పండితాభిప్రాయములనుగూడ సేకరించుకొనిన ఈవిమర్శకుల పైవాక్యములలోని "రజోచిహ్నం" "సంభవిత" అని యున్న ప్రయోగములకు సాధుత్వ మెట్లో చెప్పవలె నని అడుగుచున్నాము.

పైశ్లోకమునకు తాత్పర్య మేమనగా—కుంతీదేవి మహర్షి తన కుపదేశించిన మంత్రముయొక్క మహిమను వెంటనే తెలిసికొందునని భావించుచుండగా ఆమెకు తటాలున రజోదర్శన మైనది. "కన్యాభావే" రజస్వల కాదగని యీడున రజస్వల యగుటనుబట్టి ఆమె వ్రీడితురా లయినది. అని. లోకములో రజస్వల అగుటకు వయస్సు నిమిత్తమై యుండును. కుంతీదేవియెడల 'యదృచ్ఛయా' అని యుండుట చేత నిర్నిమిత్తత్వ మొప్పుకొనవలయును. దీనినే వయఃప్రయుక్తము కాదని మేము చెప్పినాము 'వ్రీడితా సాఽభవద్బాలా కన్యాభావే రజస్వలా' అనుటలో కన్యాత్వరజస్వలాత్వములకు విరోధముప్రకటింపబడినది. 'అవివాహితాత్వమే కన్యాత్వము, కుంతీదేవికి యౌవనము, ప్రౌఢత్వము' అనువారి మతములో అవిరోధమేమున్నది ? కన్యయై అనగా అవివాహితయై, యౌవనవతియై యుండవచ్చును. రజస్వల అగుచుండవచ్చును. 'కన్యాభావే రజస్వలా' అని విరోధ మేమున్నది ?

ఈకన్యాత్వము రజస్వల కాదగని యీడు అని చెప్పినపుడే ఆశ్లోకోక్తవిరోధము సిద్ధించును. అది కుదురుటకే ఆమెకు రజోదర్శ

నము, వయఃప్రియుక్తము కాదని చెప్పినాము. దీనిలో పొరబా టొందినది ఎవరు?

అనవసరప్రసంగమునకు దిగి తమ పొరపాట్లను బయటబెట్టు కొనుటే తప్ప మాపొరపాటును వీరేమి చూపకలిగినారు?

ఇట్లు సమీక్షింపగా వీరివాత్ర పరాస్తమైనది. కుంతీదేవిది బాల్యమే; యౌవనము కాదు. అని ధ్రువమైనది.

—• కుంతీబాల వయోనిర్ణయము •—

మునివరిచర్యాకాలము మొదలు కుంతీదేవిది యౌవనమే అని యొకవాదము. కాదు బాల్యము అని యొక వాదము.

ప్రథమవయోవాచకములగు బాలా—కన్యా—శబ్దములకు ఆమె యందు పునఃపునః ప్రయోగము కున్తీబాల్యవాదమున కాధారము. అట్టి వచనాధారము కున్తీయౌవనవాదమునకు ఏమియు లేదు. ఉన్న దని ప్రతివాదులును చూపలేదు.

ఈబాలాదిశబ్దములే యౌవనబోధకము లని వారివాదము. ఆవాదమునకు బాధకములు ప్రదర్శింపబడినవి.

మునికి పరిచర్యను కుంతిభోజు డామెచే నారంభింపచేసినది మొదలు సూర్యదేవసాన్నిధ్యాంతము ఆమెయందు బాలా-కన్యా-శబ్దములే ప్రయోగింపబడి స్వయంవరకాలమునకు యౌవనశబ్దము ఆమె యందు ప్రయోగింపబడినది—

"తాం తు తేజస్వినీం కన్యాం రూప యౌవన శాలినీమ్ ।
అవృణ్వత పార్థివాః...తత స్సా కున్తిభోజేన...
పిత్రా స్వయం వరే దత్తా......" (ఆది. అ. 112)

దీనినిబట్టి స్వయంవరకాలమునకు ఆమెది యౌవన మని తేలినది

సూర్యసాన్నిధ్యకాలమునకు కుంతి ఋతుమతి యైనట్లుండుట యౌవనవాదపోషకము కానేరదనియు, అదివయః ప్రయుక్తము కాద నియు, కనుకనే—'వ్రీడితా సాఽభవద్బాలా కన్యాభావే రజస్వలా' అని చెప్పబడిన దనియు ప్రతిపాదించి కున్తీబాల్యవాదమునకే అది గమకమని నిరూపింపబడినది.

ఇప్పు డిక బాల్యము 15 సంవత్సరములవరకు గదా! అప్పటి కామె వయసెంత? అనునది విచారణీయాంశమై యున్నది. దీని కొరకు సాధారణముగా కన్యల ఋతుకాల మేదియో ముందుతెలిసి కొనవలయును. ఈవిషయము గ్రంథములలో నిట్లున్నది—

ధర్మాదర్శము— (పు.578)

"ఋతుకాల ఇతి ప్రోక్తం గార్గ్యాదిమునిసత్తమైః ।
స్త్రీచిహ్నం యౌవనం ప్రాప్య షోడశే వత్సరే తదా ॥
కృత్రిమా ద్దశమా దూర్ధ్వ మౌషధస్య నిషేవణాత్ ।
ఏకాదశే ద్వాదశే వా ఋతుకాలం వదన్తి హి ॥
అనురాగా ద్ద్వాదశేబ్దే త్రయోదశే తు కేచన ।
చతుర్దశే పంచదశే స్త్రీచిహ్నం తు భవిష్యతి ॥
వాతజా పిత్తజా చేతి దారుణా త్రివిధా స్మృతా ।
వాతజా ద్వాదశే వర్షే పిత్తజా చ చతుర్దశే ॥
దారుణా షోడశే వర్షే శోణితం పతతి ధ్రువమ్ ॥"

ఇక్కడ దేశభేదమునుబట్టి, ప్రకృతిభేదమునుబట్టి, వాసనాభేద మునుబట్టి 11 మొదలు 16 సంవత్సరములవరకు ఋతుకాల మని చెప్పబడినది.

వివాహకాలవిమర్శము—

"...దశవర్షా భవేత్కన్యా అత ఊర్ధ్వం రజస్వలా ఏకాదశ వర్షాదౌ క్వచిత్ స్త్రీణాం రజోదర్శనసంభవాత్ తత్పరతయా యోజనీయమిదం వచనమితి వ్యాఖ్యాతం స్మృతిముక్తాఫలే" పు.9

"అజ్ఞాతవ్యంజనాఽలోమ్నీ నతయా స హ సం వి శేత్"
లోమోద్గమశ్చ రజోదర్శనాత్ప్రాగేవభవతీతిఅనుభవజ్ఞానమ్। పు.6

దీనినిబట్టి కూడ 11వ సం॥రము రజోదర్శనకాలమని రజోదర్శన ప్రాక్కాలికమే లోమోద్గమ మని తేలినది.

ఇప్పుడు కన్యలకు ఋతుకాలము 11వ సం॥రముకూడ నగుటచే ఈసంవత్సరములోని ఋతుదర్శనము వయఃప్రయుక్తమే అగును.

కుంతికి ఋతుదర్శనము వయఃప్రయుక్తమని కాక యదృచ్ఛా సంభవ మనుటచేతను 'కన్యాభావే రజస్వలా" అనుటచేతను అప్పటి కామెది ఆదిగువవయస్సని చెప్పవలెను. అది ఋతువు సంభవింపనట్టి వయస్సుగా చెప్పవలెను. అది నవ దశమే వర్షే ఋతు స్సంభవతి' అను మాధవీయవచనానుసారము పదవసంవత్సర మనవచ్చును.

ఇప్పుడు సూర్యదేవసాన్నిధ్యకాలమునకు కున్తీదేవిది పదవ సంవత్సర మనదగును. దీనికి పూర్వమే ఆమె చేసిన మునిపరిచర్య. ఆపరిచర్య నామె చేసినది సంవత్సరకాలము.

"తత స్సంవత్సరే పూర్ణే యదాఽసౌ జపతాంవరః ।
నాపశ్య ద్దుష్కృతం కించి త్పృథాయాః ॥......" (వన. అ.305)

ఇట్లుచూడ ఆమె పరిచర్య నారంభించునప్పటికి ఎనిమిదవ సంవత్సరము.

కనుకనే తండ్రి ఆలింగనముచేసికొనుట, ఆంధ్రభారతములో నున్నట్లు పసిబిడ్డవనుట సంగతము లగును.

తొమ్మిదవసంవత్సరము మునిపరిచర్య అయి, ముని అంతర్ధాన మగుటతో పదవసంవత్సరము వచ్చుటతోడనే ఆమెకు సూర్యదేవసాన్నిధ్యము కలిగి ఆపదవ సంవతర్సము నిండకుండగనే కర్ణోత్పత్తి అయి పునః కన్యాత్వము సిద్ధించినది. ఇదియే కున్తీబాల వయోనిర్ణయము.

దీనితో కుంతికి యౌవనమే అనుచు ప్రతివాదులు చేసిన కోలాహాల మంతయు ప్రతిహతమైపోయినది.

—• మాసమన్వయములో విమర్శకులు పట్టిన వ్యాకరణపు తప్పట —

"శాస్త్రిగారు పెడద్రోవల నన్వయించుటయు చూడుడిటు— 'తతోఽహ మన్తర్భవనే పితు ర్వృత్తాన్తరక్షిణీ' 'పితు ర్భవనే' అని అన్వయించవలసియుండగ 'పితుః వృత్తాన్తరక్షిణీ' తండ్రియొక్క వృత్తాంతముల రక్షించున దని వ్రాయించినారు.

శాస్త్రిగారు వ్యాకరణపండితు లని వినికిడి. 'భీతార్థానాం భయహేతుః' అనుసూత్రము ప్రకారము 'పితుః' 'తండ్రినుండి' కావలెను. షష్ఠి యిట చెల్లదు" అట. (పు 12)

విమర్శకర్తలు చూపిన శ్లోకము పూర్తిస్వరూప మిది—
"తతోఽహం మన్త్రభవనే పితు ర్వృత్తాన్త రక్షిణీ ।
గూఢోత్పన్నం సుతం బాలం జలే కర్ణ మవాసృజమ్॥"(ఆశ్రమ.అ30)

ఇక్కడ విమర్శకర్తల అన్వయక్రమ మిది— పితుః అన్తర్భవనే గూఢోత్పన్నం సుతమ్...... తండ్రియొక్క అంతర్భవనమందు గూఢముగా బుట్టిన సుతుని విడిచిపెట్టితిని. అని.

తండ్రియొక్క అంతర్భవనమున బుట్టుటలో గూఢముగానుండుట అసంభవము "నహి తాం వేద నార్యన్యా... కన్యాపురగతాం బాలామ్" అనుటచేత అది కన్యాన్తఃపుర మనవలసియుండ తండ్రియొక్క అన్తర్భవన మనుట విరుద్ధము. అందుచేత "పితుః అన్త ర్భవనే" అను అన్వయము తప్పు.

'పితుః వృత్తాన్తరక్షిణీ' అనియే అన్వయింపవలెను. ఇచ్చట పితుః అనుదానికి వృత్తాంతమందో రక్షణక్రియయందో అన్వయము చెప్పవలసియున్నది. 'పితుః రక్షిణీ' అని రక్షణక్రియయం దన్వయమైనపుడు ఆరక్షింపబడు వృత్తాంతము కుంతీదేవిదే అనవలసివచ్చును. తన ఆవృత్తాంతమును ఒక్క తండ్రినుండియే గుప్తపరచిన దనవలసివచ్చును. అప్పుడు—

"సా బాన్ధవభయా ద్బాలా గర్భం తం వినిగూహతీ ।
ధారయామాస సుశ్రోణీ న చైనాం బుబుధే జనః ॥"

ఆకుంతీబాల బంధువర్గమునుండి తనగర్భమును గుప్తపరచుకొనుచు గర్భధారణ చేసియుండెను. ఆమె జనులకు తెలియబడనేలేదు. అని యున్నదానికి విరుద్ధ మగును. ఎవ్వరికిని తెలియబడకుండిన వృత్తాంతము ఒక్క తండ్రికి తెలియబడకుండె ననుట విరుద్ధము కాదా ?

ఈ విరోధపరిహారమునకుగాను వృత్తాంతములోనే "పితుః" అను దానికన్వయ మనవలెను. కనుకనే "మన్నిమిత్తం కులస్యాఽస్య లోకే కీర్తి ర్నశే త్తతః." అనుచు కుంతి, మహనీయా! నీవు నన్ను నిర్బంధించుటలో ఈ రాజకులమునకు లోకమునగల కీర్తి నామూలమున నశించును. అని సూర్యదేవునితో చెప్పుకొనినది. అందుచే ఆమెకు రక్షణీయము పితృవృత్తాంతమే. ఆ పితృవృత్తాంతము, 'వర్తనపుశుద్ధి, మర్యాద' అని విమర్శకులు వ్రాసినదే.

ఇప్పుడు, తన తండ్రి మర్యాదను లోకులనుండి కాపాడుచున్న దయి, అని సిద్ధించును. ఇక్కడ "పితా రక్షతి కౌమారే" అను న్యాయమున తన మర్యాద, తనకు రక్షకు డగు తండ్రి మర్యాదలోనే అంతర్భూతమైనందున తన మర్యాద పితృమర్యాదారక్షణముతోనే రక్షితమగునుగనుక ఆమె మర్యాదను చెప్పవద్దా? అను శంక కవకాశములేదు.

ఇట్లు చూడగా 'పితుః వృత్తాన్త రక్షిణీ' 'తండ్రియొక్క వృత్తాంతమును (మర్యాదను) రక్షించునదై' అనియే పర్యవసన్నమైనది. విమర్శకర్తల అన్వయము దుష్టమైనది.

మా అన్వయములో షష్ఠి చెల్లదట, ఎందుచేతనో, 'భీతార్థానాం భయహేతుః' అను సూత్రముచేతనా ?

అట్లయినచో— "కస్యబిభ్యతి దేవాశ్చజాతరోషస్య సంయుగే" (రామాయణము) ఇక్కడ కస్య అని షష్ఠి యెట్లు చెల్లినది ? 'కస్య' కు 'బిభ్యతి' తో అన్వయము కాక 'సంయుగే' తో అన్వయముకనుక చెల్లిన దందురా ? అట్లిక్కడగూడ పితుః పదమునకు 'రక్షిణీ' తో అన్వయముకాక 'వృత్తాన్త' ముతో అన్వయమగుటచే షష్ఠి చెల్లిన దని తెలిసికొనుడు. ఇతోధిక మీ విషయమై చెప్పు టనవసరము.

కనుక, 'శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వ్రాసిన వ్యాకరణదోషములు తొలగించుకొన వీలుకానివి' (పితుర్వృత్తాంతరక్షణీత్యాదులు) మొదలగు విమర్శగ్రంథములోని సాహసోక్తులు పరాస్తమైనవి.

—• విమర్శకులు కన్యాత్వవరదాత దుర్వాసు డనుటను గూర్చి •—

"వరస్వరూపము— 'కన్యాఽహ మభవం విప్ర యథా ప్రాహస మా మృషిః' పుత్రప్రాప్తియు, పునః కన్యాత్వప్రాప్తియుదుర్వాసో దత్తమంత్రప్రభావమే, అనుట తెల్లము.

భాగవతము— స్క౯. సాపి దుర్వాసో విద్యాం దేవహూతిం ప్రతోషితాత్ । తస్యాః వరపరీక్షార్థ మాజుహావ రవిం శుచిః॥ ప్రత్యయార్థం ప్రయుక్తో మే యా హి దేవ క్షమస్వ భో"అట. (పు15-16)

'కన్యాహ మభవ' మనుదాని పూర్వవాక్యము లిట్లున్నవి— దుర్వాసుడు మంత్రమిచ్చి చెప్పిన విషయము కుంతీదేవి చెప్పుచున్నది—

'ధర్మస్య జననీ భద్రే భవిత్రీ త్వం శుభాననే । వశే స్థాస్యన్తి తే దేవాయాం స్త్వ మావాహయిష్యసి॥ ఇత్యుక్త్వాఽన్తర్హితో విప్రః...

అథ హర్మ్యతలస్థాహమ్... సంస్మృత్య తదృషే ర్వాక్యం । స్పృహయన్తీ దివాకరమ్। స్థితాహం బాలభావేన... అథ దేవ స్సహస్రాంశు ర్మత్సమీపగతోఽభవత్... తతో మాం తేజసా విశ్య... ఉవాచ భవితా పుత్ర స్తవేత్యభ్యగమ ద్దివమ్......
నూనం తస్యైవ దేవస్య ప్రసాదా త్పున రేవ తు ।
కన్యాహ మభవం విప్ర యథా ప్రాహ స మా మృషిః॥' ఆశ్రమప.

అమ్మా! నీవు ధర్మజననివి కాగలవు. నీ వేయేదేవతల నాహ్వానింతువో వారందరు నీకు వశవర్తు లగుదురు. ఇట్లుచెప్పి మహర్షి అంతర్ధాన మయ్యెను. అంత నొకప్పుడు హర్మ్యతలమందు నేనుండి ఆ ఋషివాక్యము దలచుకొని బాలభావమున దివాకరుని కోరినదాననై యుంటిని. ఆదివాకరుడు నాసమీపగతు డయ్యెను. తేజస్సుచే నన్నావేశించి నీకు పుత్రుడు కలుగు నని చెప్పి దివమునకు వెళ్ళెను. (గూఢోత్పన్నుడగు పుత్రుని జలమున విడిచితిని) ఆదేవుని అనుగ్రహమున పునః నేను కన్య నయితిని, మంత్ర మిచ్చిన ఋషి యెట్లు చెప్పెనో అట్లు జరిగినది ఇది గ్రంథములోని విషయము.

విమర్శకర్తలు— 'మాం సః ఋషిః యథా ప్రాహ తథా అహం కన్యా అభవం' అని అన్వయ మనిరి. శ్లోకములోని ఉత్తరార్ధమున కిట్లు అన్వయమును చెప్పిన వీరు— 'నూనం తస్యైవ దేవస్య ప్రసాదా త్పున రేవ తు। కన్యాహ మభవమ్' అనియున్న పూర్వార్థముతో విరోధమును గమనింపరైరి. 'యథా ప్రాహ సమా మృషిః' అనుదానిని వెనుక కన్వయింపక 'తథా జాతమ్' అని అధ్యాహారము చేసి అన్వయించిన విరోధ ముండదు. ఋషి చెప్పినట్లే జరిగినది అని అర్థము లభించును. ఆజరిగిన దేమనగా— ఏ యే దేవతల నాహ్వానించెనో వారందరును సమీపగతులగుట, తాను కోరినదానిని వారు ఫలింపజేయుట, తాను ధర్మజనని యగుట ఇత్యాదికము.

తాను కోరినవానిలో చేరినదే కన్యాత్వహాని లేకుండుట. అది సూర్యదేవుని వలన సిద్ధించుట జూచి ఆఋషి చెప్పినట్లే జరిగినదని ఆమె చెప్పుకొనినది. అంతియకాని ఋషి కన్యాత్వ మిచ్చినాడని కాదు. వీరి దంతయు తప్పుదారి. వీరి దపార్థము.

శ్రీకృష్ణభారతమందుగూడ కన్యాత్వవర మిచ్చినవాడు సూర్య దేవుడనియే యున్నది. చూడుడు—

'బాల్యచాపలమున జేసి పద్మమిత్రు। తెలియ కే దప్పు చేసితి నలుగ కరుగుము । నాసంగమంబున నాతి ధర్మపథమ్ము చెడకుండ గన్యాత్వ మెడలకుండ వరమొసంగితి ॥"

ఇట్టి కవిసార్వభౌము లీ విరుద్ధాన్వయము నంగీకరింతురా? ఇక వారి భాగవతశ్లోకములు—

'కున్తే స్సఖ్యుః పితా శూరో హ్యపుత్రస్య పృథా మదాత్ ।
సాప దుర్వాససో విద్యాం దేవహూతిం ప్రతోషితాత్ ॥
తస్యా వీర్యపరీక్షార్థ మాజుహావ రవిం శుచిః ।
తదైవోపాగతం దేవం వీక్ష్య విస్మయమానసా ॥
ప్రత్యయార్థం ప్రయుక్తా మే యాహి దేవ క్షమస్వ మే ।

శ్రీధరీయమ్— పృథాయాః కన్యకావస్థాయాం కర్ణోత్పత్తి ప్రకారమాహ— కున్తేరితి... ప్రత్యయార్థమితి । పరీక్షార్థం మయా విద్యా ప్రయుక్తా । న తు త్వయా కిం చిత్కార్య మిత్యభిసన్ధినా । అతో యాహీతి ।'

కుంతీదేవికి కన్యకావస్థలో కర్ణోత్పత్తిప్రకారము చెప్పబడుచున్నది దూర్వాసునివలన కుంతి దేవతల నాహ్వానింపగల విద్యను పొంది ఆవిద్యయొక్క వీర్యపరీక్షకొరకు సూర్యదేవు నాహ్వానించు నంతట సమీపగతుడైన సూర్యదేవుని చూచి ఆశ్చర్యపడి దేవా! నేను పరీక్ష కొరకే విద్యను వినియోగించితిని. నీవలన నొకకార్యమును సంకల్పించి కాదు కనుక వెళ్ళుము. అని ప్రార్థించినది.

ఇక్కడచూడుడు—రెండవ శ్లోకములో 'తస్యా వీర్యపరీక్షార్థమ్" అని యుండగా "తస్యా వరపరీక్షార్థమ్" అని విమర్శకర్తలు

చూపి ఇదిగో దుర్వాసు డిచ్చిన వరమును పరీక్షించినట్లున్నదని ఆక న్యాత్వవరము దుర్వాసు డిచ్చినదే అని చిత్రము చేసినారు. మనము పరిశీలించునంతట అది వరపరీక్ష కాకపోయినది. దీనితో వీరిమాట నిరస్తమైనది.

ఆదిపర్వము—అ. 111 లో దుర్వాసుడు—"తస్యై స ప్రదదౌ మన్త్రమ్...అభిచారాభిసంయుక్తమ్, అబ్రవీచ్చైవ తాం మునిః, యం యం దేవం త్వ మేతేన మన్త్రేణావాహయిష్యసి। తస్య తస్య ప్రభా వేణ తవ పుత్రో భవిష్యతి।"

కుంతీదేవికి వశ్యాకర్షణాదిశక్తి కల మంత్ర మిచ్చి ఆపై నిట్ల నెను—నీ వేయే దేవతను ఈమంత్రముతో నాహ్వానింతువో ఆ యా దేవతవలన నీకు పుత్రుడు పుట్టును. అని. ఇదియే వరము; ఇందు కన్యాత్వసిద్ధిమాట లేదు. కనుక వీరిమాట తప్పు. పేజీ 16లో సగము నుండి 17లో సగమువరకు గల అసభ్యప్రసంగము త్రోసివేయబడినది.

విమర్శకర్తలు—"దత్వా చ తపతాం శ్రేష్ఠః పున స్స వరప ద్యుతిః। ప్రాదాచ్చ తస్యై కన్యాత్వం దివ మాచక్రమే తతః।"

"చకారకుక్షిత్వము వ్యాసుని కంగీకరించిన మార్పనవసరము లేదుకాని...పైపాదము క్రిందకును క్రిందిపాదము పైకిని మార్చిన గాని కుదరదు" అనిరి. (పు. 17)

క్రిందిపాదమును పైకిబెట్టుకొని తలక్రిందయినవారు విమర్శ కులుకాని శ్లోకము కాదు. చూడుడు శ్లోక మెట్లున్నదో—

"ప్రాదాచ్చ తస్యై కన్యాత్వం పున స్స వరముద్యుతిః।
దత్వా చ తపతాం శ్రేష్ఠో దివ మాచక్రమే తతః॥" (ఆది. అ.111)

దీనినిబట్టి తలక్రిందుచేసికొనినవారు విమర్శకు లగుట, కన్యాత్వ వరమిచ్చినవాడు సూర్యదేవుడే అగుట ధ్రువమైనది. ఇక్కడ 'చకార కుక్షి'అని వేదవ్యాసు నెత్తికొని చేసిన అప్రస్తుతప్రసంగము నింద్యము. ఇది యిట్లు పరాస్తమైనది.

"మహాభారతతత్త్వకథనములో ఈవర మెవ్వరిచ్చినదో వ్రాయుచు సూర్యుడిచ్చినదని వ్రాసిరి. "సాధయిష్యామి సుశ్రోణి! వ్రతం

వై జనయిష్యసి" "కన్యాహ మభవం విప్ర యథాప్రాహ సమా మృషిః" కన్య వగుదు వని దుర్వాసు డనుటయు, ఆత డనినట్లే నేను పునః కన్య నయితి నని కుంతి చెప్పుటయు కారణములుగ కుంతీకన్యాత్వసిద్ధికి సూర్యమహిమ కాక దుర్వాసవరమహిమయే కారణమై కథకుల వాద మపాస్తమగుచున్నది.

పరాశరుడు సత్యవతి కిచ్చిన వరముకూడ "కన్యాచైవ భవిష్యసి" అనియే అనిరి విమర్శకర్తలు (పు. 18)

వీరిక్కడ వరము సూర్యుడిచ్చినది కాదనుటకు 'సాధయిష్యామి' అనువాక్యమును, 'కన్యాహమ్' అనువాక్యమును ప్రమాణీకరించిరి. మొదటిదానిలో 'కన్యవగుదు వని దుర్వాసుడనుట' లేదు. సరికదా సూర్యు డనినట్లే యున్నది. చూడుడు—సూర్య ఉవాచ—

"సాధయిష్యామి సుశ్రోణి పుత్రం వై జనయిష్యసి ।
సర్వశస్త్రభృతాం శ్రేష్ఠం కన్యా చైవ భవిష్యసి ॥" (వన. అ 307)

ఇది మోసమే కద! ఇక రెండవ "కన్యాహ మభవమ్ విప్ర" అను వాక్యమునకు సంబంధించిన శ్లోకమును చూపి మేము వీరిది విరుద్ధాన్వయ మని వెనుక నిరూపించియే యున్నాము. ఇట్టి వీరి వ్రాత 'తత్త్వకథనము' లోని ఏమాటను నిరసించుచేనా! అజ్ఞులట్లనుకొందురో యేమో!

సత్యవతికి 'కన్యా చైవ భవిష్యసి' అని వరమిచ్చినవాడు పరాశరుడు కనుక కుంతికి ఆ వరమిచ్చినవాడు దుర్వాసుడే అనినట్లు వ్రాయుట అసంగతము. పురుషసంబంధమూలకమైన కన్యాత్వోచ్ఛిత్తికి కొరకు దేపురుషుడో ఆపురుషుడే అట్టి వరమివ్వవలసినవాడు. అట్టివాడు సత్యవతియెడల పరాశరుడు. కుంతియెడల సూర్యుడును. ఇట్టిస్థితిలో గ్రంథస్థమైన సూర్యవరమును గాదని గ్రంథస్థముకాని దుర్వాసువరముగా దానిని కల్పించి అప్రమాణముగా విమర్శకులు వ్రాసినది అసంగత మగుటచే త్రోసివేయుబడినది.

మాతత్త్వకథనోక్తిచే వీరివ్రాత పరాస్తముకాని, వీరివ్రాతచే మాతత్త్వకథనోక్తి పరాస్తము కాలేదని తెలుపుచున్నాము.

—• కుంతీసూర్యదేవుల గాథపై విమర్శకు లాడిన
మాటనుగూర్చి •—

విమర్శకుల వ్రాత యిట్లున్నది—

"భారతము కుంతీసూర్యులను గుక్కలమాదిరిచేసినది." అట పుట21 ఆహా! వీరి యీమాట భారతమును, భారతకర్త యగు వేదవ్యాస మహర్షిని, సూర్యదేవుని దూష్యులను చేయుచున్నది.

"బుద్ధి ర్యథావిధా యస్య స తథా మన్యతే జగత్ ।"

ఎవ్వని బుద్ధి యెట్టివిధమై యుండునో అట్టివిధముగనే లోకము నాతడు తలచుచుండును. అను న్యాయమున వీరిబుద్ధి అట్టిదనుకొనవలసియున్నది. సూర్యదేవునియందు వీరికిగలభక్తి, భారతకర్తయందు వీరికి గల పూజ్యభావము, భారతమందు వీరికి గల ప్రామాణ్యదృష్టి ఒక్కమాటతో బయటబడినవి. ఆగాథనుబట్టి వేదాంతదర్శనములో నేమి చెప్పబడినదో చూడుడు—

"జ్యోతిరాదివిషయాఅపి ఆదిత్యాదయో దేవతావచనాః శబ్దాః చేతనావన్త మైశ్వర్యా ద్యుపేతం తం తం దేవతాత్మానం సమర్పయన్తి... అస్తిహ్యైశ్వర్యయోగా ద్దేవతానాం జ్యోతిరాద్యాత్మభి శ్చావస్థాతుం యథేష్టం చ తం తం విగ్రహం గ్రహీతుం సామర్థ్యమ్...స్మర్యతేచ- 'ఆదిత్యః పురుషో భూత్వా కున్తీ ముపజగామహ' ఇతి.

తాత్పర్యము—లోకులకు గోచరించుచున్న జ్యోతిర్మండలముసు చెప్పు సూర్య-ఆదిత్యాదిశబ్దములు అఖండశక్తులు కలిగి చేతనాత్మకమయి యున్న ఆయాదేవతాస్వరూపమును తెలుపుచున్నవి ఆదేవతలకు ఐశ్వర్యశక్తివలన జ్యోతిర్మండలరూపముగా నుండుటకును, ఆయావిగ్రహమును యథేష్టముగా గ్రహించుటకును గూడ సామర్థ్యముండుట జగత్ప్రసిద్ధము; ఇది సూర్యుడు పురుషాకృతి వహించి కుంతిని ఉపగమించెను, అనుచు భారతములో స్మరింపబడినది అని.

దీనినిబట్టి మనకు గోచరించు సూర్యమండలము అచేతనము కాదనియు, అదిచేతనాత్మకదేవతాస్వరూపమనియు, ఆదేవత 'మంత్రా

ధీనం తు దైవతమ్' అనున్యాయమున మంత్రమున కధీననిమయు, ఆమంత్రము సిద్ధపురుషోపదిష్టము, పరమపవిత్రవ్యక్త్యాశ్రితము నయి నపుడు ఎంతశక్తికల దేవతనయినను శీఘ్రముగా నాకర్షించి తీరు ననియు, సిద్ధపురుషుల అమోఘవాక్యము, మంత్రముల అమోఘ శక్తి, వద్దనినను ఫలమీయక మానదనియు, లోకమునకు తెలుపుచు కుంతీసూర్యదేవుల గాథను నిదర్శనముగా నుదాహరించిన భారతము, వారిని గుక్కలమాదిరి చేసిన దని విమర్శకుల కనిపించుట దురదృష్టము.

హేయమైన వీరిమాట నింతటితో విడిచి అంశాంతర మందు కొనుచున్నాము.

## —'సద్యఃప్రసూతివాదసమీక్ష'—

విమర్శకుల వ్రాత యిట్లున్నది—

"తతో గర్భ స్సమభవ త్పృథాయాః పృథివీపతే।
శుక్లే దశోత్తరే పక్షే తారాపతి రివాంబరే॥
సా బాన్ధవభయా ద్బాలా గర్భం తం వినిగూహతీ।
ధారయామాస సుశ్రోణీ నచైనాం బుబుధే జనః॥
న హి తాం వేద నార్యన్యా కాచి ద్ధాత్రేయికా మృతే।
కన్యాపురగతాం బాలాం నిపుణాం పరిరక్షణే॥
తతః కాలేన సా గర్భం సుషువే వరవర్ణినీ।"

నీలకంఠుడు 'శుక్లే దశోత్తరే' కు వ్యాఖ్యను వ్రాయుచు 'ఏకాదశే శుక్లే పక్షే...మాఘశుక్లప్రతిపది కర్ణనిషేకజన్మేత్యర్థః।' అనినాడు. పదునొకండవ శుక్లపక్షపాడ్యమియందు మాఘశుక్ల పాడ్యమినాడు కర్ణనిషేకజన్మ యని అర్థము.

ఎప్పటినుండి పదునొకండవ శుక్లపక్షము ? పదికి బిమ్మట పదు నొకం డనుకొనుట యేనా ? మాసము మాటయేది ? మూలమున లేదుకదా! మాఘమునకు గతియేమి?" (పు 19-20)అని విమర్శకర్త లడుగుచున్నారు.

వీరికిచెప్పుచున్నాము— పదునొకండు పదికి బిమ్మటనే కనుక అవి యనుకొనుట తప్పనిదే. ఇక పదునొకండవ శుక్లపక్షము ఎప్పటి

నుండి ? అనుప్రశ్నకు 'చైత్రశుక్లపక్షమునుండి' అని సమాధానము, ఏమనగా లోకప్రసిద్ధమైయున్న చైత్రాదిమాసక్రమమునుబట్టియే తదన్తర్గతశుక్లపక్షగణన స్వాభావికము కనుక. ఇక రెండవది—మూలమున మాసముమాట యేది ? మాఘమునకు గతియేమి ? అని ప్రశ్న.

మాసముమాట ప్రత్యేకము లేదు కాని మాసాన్తర్గత శుక్లపక్షములమాట చెప్పబడినది కనుక ఆ శుక్లపక్షగణన, మాసక్రమగణనపయి నాధారపడియున్నది కనుక, ఆ మాసక్రమోపస్థితిలో మాఘమాసము సిద్ధించినందున మాఘమునకు గతి లేకపోలేదు. అని సమాధానము.

విమర్శకర్తల ఆక్షేపాంతరము— "కర్ణుని నిషేకజన్మయా ? 'కర్ణజన్మేత్యర్థః' అనలేకపోయెనా ? అట. (పు 20)

ఆనిషేకజన్మ వేరు, కర్ణజన్మవేరుఅగుటచే కర్ణనిషేకజన్మను కర్ణజన్మ యని నీలకంఠు లనలేకపోయె నని సమాధానము.

'దశమే మాసి సూతవే' పదియవమాసమున కాన్పుకలుగవలసి యుండగ ఏకాదశమున జరిగించినాడేమి నీలకంఠుడు? అట. (పుట21)

వీరుదాహరించిన 'దశమే మాసి సూతవే' వాక్యము ప్రసూతి కాలమును చెప్పును. నీలకంఠుడు చెప్పినది వీరనిన కాన్పు (ప్రసూతి) కాదు. సూర్యసమావేశకాలము. ఈభేదము వీరు తెలిసికొనలేక నీలకంఠునిమీద బడుచున్నారు. ఇది చాల తప్పు.

"శాస్త్రిగా రిట్లు నిర్వచనమును జేసిరి-కర్ణనిషేకజన్మకు ఆనాడు కర్ణుడు పుట్టినాడని అర్థము కాదని, కర్ణజన్మయనిన చాలును. నిషేకశబ్దమేందులకు ? అది కర్ణనిషేకజన్మకాని, కర్ణజన్మ కాదనుటకే, భూపతనము కర్ణజన్మ, గర్భప్రవేశము నిషేకజన్మ, అని"...

వారే నిషేకజన్మశబ్దముల సార్థక్యశూన్యతను చెప్పినారు. నేనడిగిన దదియే. పైవలె సమర్థించినారు," అట. (పు 22)

ఇక్కడ 'నేనడిగిన దదియే' లోని 'నేను' ఎవ్వరు ? ఈవిమర్శ గ్రంథముపై నున్న పేరుగలవారేనా ? వీరు అది యెవ్వరి నడిగినది ? ఎప్పు డడిగినది ? ఎక్క డడిగినది ?

'శాస్త్రిగారు... నిర్వచనము జేసిరి' అనుచు వీరు పై జూపిన వాక్యములు మాప్రథమ సమాధానపత్రములోనివి.

ఆ వాక్యప్రసక్తికి కారణము— కవిసార్వభౌములు ప్రథమకర పత్రములో "దశోత్తరే పక్షే" అనగా చైత్రాదిపదిమాసములపై నగు మాఘము మొదటి దినమున కర్ణుడు పుట్టె నని నీలకంఠాచార్యులవారు వ్రాసియున్నారు" అని వ్రాయుటే.

ఆవ్రాయుటకు కారణము— అన్నవరసభలో 'భారతము- కర్ణ స్వరూపము' అని యిచ్చిన విషయముపై నేనుపన్యసించునపుడు అధ్య క్షులై యున్న శ్రీకవిసార్వభౌములు అడ్డుతగిలి 'మాఘశుక్లప్రతిపది కర్ణనిషేకజన్మేత్యర్థః' అను నీలకంఠీయము నుదాహరించుట.

ఇట్లు కవిసార్వభౌములు ప్రవేశపెట్టినది అన్నవరసభలో 'కర్ణ నిషేకజన్మ' అను మాట; ఆమాటమీద మీఅభిప్రాయప్రకారము 'కర్ణ జన్మ' అనక 'నిషేకజన్మ' అను టెందులకు? అని యుప్పు డడిగినది నేను. ఈగ్రంథకర్తలకు ఆసభలో ప్రవేశము లేదు. తగుదునమ్మా అని వీరువచ్చి 'నేనడిగిన దదియే' అందు రిదేమి చిత్రము? "నిషేక—జన్మ శబ్దముల సార్థక్యశూన్యతను వారే చెప్పినారు." ఎవరువారు? ఆసార్థ క్యమును చెప్పవలసినవా రెవరు? సార్థక్యశూన్యతను చెప్పినవా రెవరు?

—• 'కర్ణనిషేకజన్మ' శబ్దార్థసమీక్ష •—

దీనినిటుంచి 'కర్ణనిషేకజన్మేత్యర్థః' అని వ్రాసిన నీలకంఠాచా ర్యులవారి హృదయ మేమో గమనింతము—

విమర్శకర్త లిట్లనుచున్నారు. 1 "నిషేకజన్మ యేమి? నిషేక మునకు జన్మయా?" రేతస్సేకము నిషేకముకదా...

కర్ణస్య=కర్ణునియొక్క; నిషేకః=రేతస్సేకమనుట యెట్లును తప్పే. 2 సద్యః నిషేకము జన్మము కానిచో, వేఱుగ జెప్ప బడియే యుండును. 'మాఘశుక్లప్రతిపది సూర్యస్య నిషేకః' (రేత స్సేకః కుంత్యామ్) అని చెప్పి 'తతః కాలేన' శ్లోకముకడ 'కర్ణస్య జన్మ" అని యుండును. నీలకంఠుని దనుకొనిన వ్యాఖ్య తప్పే." అని. (పు. 22)

ఎంతవానినయినను తప్పనుచు తీసివేయుటలో వీరు ఘనులు. 'నిషేకజన్మ యేమి? నిషేకమునకు జన్మయా? రేతస్సేకము నిషే కముకదా? కర్ణునియొక్క రేతస్సేకమనుట తప్పుకాదా?' అని

వీరాక్షేపించుచున్నారు. వీరి కొకింత తెలుపుచున్నాము.

నిషేకజన్మ అనుమాటకు నిషేకమునకు జన్మ అని అర్థము కాదు. నిషేకరూపమైన జన్మ అని అర్థము. కర్మధారయసమాసము. 'కర్ణనిషేకజన్మ' అనగా కర్ణుడనబడు జీవునకు నిషేకరూపమైన జన్మ అని అభిప్రాయము.

జన్మకంటె వేరుగా నిషేకమను జన్మ యొకటా ? ఇది యెక్కడ ప్రసిద్ధము ? అని శంకింతురేమో। చూడుడు—

ఐతరేయారణ్యకము— సాయనాచార్యభాష్యము—

"పితృశరీరం మాతృశరీరం స్వశరీర మిత్యావసథత్రియమ్...
తత్రాదౌ పితృశరీరరూపమావసథం దర్శయతి—

"పురుషేహ వా అయ మాదితో గర్భో భవతి యదేతద్రేతః।"
ఇతి. యోఽయం శరీరం బిభృతు ర్జీవాత్మా సోఽయం పురుషే పితృశరీరే ప్రథమతో గర్భో భవతి। నచాత్ర స్త్రీగర్భవదుదర వృద్ధ్యాసోఽభివ్యజ్యతే। కిన్తు యదేతత్పితృశరీరే సప్తమధాతు రూపం రేతోఽస్తి తదేవ గర్భ ఇత్యుచ్యతే। తస్మిన్ రేతసి జనిష్య మాణస్య జీవస్య ప్రవిష్టత్వాత్.......

తస్య గర్భస్య జన్మప్రకారం దర్శయతి—

"తద్యదా స్త్రియాం సించత్యథైన జ్జనయతి తదస్య ప్రథమం జన్మ" ఇతి.......తాదృశం రేతో యదర్తుకాలీనేన గమనేన స్త్రియా యోనౌ గర్భాశయే సించతి. అథ తదానీ మయం పురుష ఏన జ్జీవాన్తరావిష్టం రేతో రూపం శరీరం జనయతి। తదేత ద్రేతో నిస్సరణరూప మస్య రేత స్యవస్థితస్య... జీవస్య ప్రథమం జన్మే త్యుచ్యతే। 'తస్య త్రయ ఆవసథాః' ఇత్యుక్తానాం మధ్యే ప్రథమా దావసథా త్పితృశరీరరూపా త్సంపన్న మితి కృత్వా ప్రథమం జన్మ భవతి......

మాతృశరీరాన్నిర్గమనస్య పూర్వోక్తజన్మాపేక్షయా ద్వితీ యత్వం దర్శయతి—

"తదస్య ద్వితీయం జన్మ" ఇతి.

తాత్పర్యము— జీవునకు పితృశరీరము, మాతృశరీరము, స్వశరీరము అని నివాసస్థానములు మూడు. అందు మొదటిది పితృశరీరము; శరీరమును ధరించు జీవాత్మ పితృశరీరమందు మొదట గర్భముగా నుండును. ఇక్కడ గర్భము స్త్రీగర్భమువలె ఉదరవృద్ధితో గోచరించునదై యుండదు. పితృశరీరమందలి సప్తమధాతురూపమైన రేతస్సే గర్భ మనబడును. జన్మింపబోవు జీవుడు ఆ పితృరేతస్సునందే ప్రవేశించి యుండునుగనుక.

ఈ గర్భము యొక్క జన్మప్రకారము చెప్పబడుచున్నది అట్టి రేతస్సును ఎప్పుడు ఋతుకాలగమనముచేత పురుషుడు స్త్రీగర్భాశయమందు ప్రవేశపెట్టునో అప్పు డీపురుషుడు ఈ జీవాంతరావిష్టమై యున్న రేతోరూపశరీరమును జన్మింపజేయుచున్నాడు. రేతస్సునాశ్రయించియున్న జీవునకు ఈ రేతోనిస్సరణమే ప్రథమజన్మ అని చెప్పబడుచున్నది. ఇక మాతృశరీరమునుండి నిర్గమించుట ద్వితీయమైన జన్మ అగుచున్నది. అని.

దీనినిబట్టి 'కర్ణనిషేకజన్మ' సూర్యతేజస్సు నాశ్రయించి ఆ తేజస్సు శరీరముగా గలిగి జన్మింపబోవు కర్ణుడనబడు జీవాత్మయొక్క శరీరరూపమైన ఆ తేజస్సును, కుంతీగర్భాశయమందు సూర్యదేవుడు నిషేకించుట అను జన్మ కర్ణనిషేకజన్మ యని, సూర్యదేవ శరీరమునుండి కుంతీశరీరమున ప్రవేశించుట దాని కర్థమని, కుంతీశరీరమునుండి జన్మించుట దాని కర్థము కాదని విశదమైనదా ?

జన్మకంటె వేరుగా నిషేకజన్మ వేదప్రసిద్ధ మని తెలిసినదా ? నిషేక— జన్మ— శబ్దములకు పార్థక్య మిప్పుడు మనస్సునకు వచ్చినదా ? ఇట్లు ప్రథమాంశము ప్రత్యుక్తమైనది.

ఇక ద్వితీయాంశము—"సద్యః నిషేకము జన్మము కానిచో వేరుగా చెప్పబడియే యుండును. 'మాఘశుక్లప్రతిపది సూర్యస్య నిషేకః' అని చెప్పి 'తతః కాలేన' శ్లోకముకడ 'కర్ణస్య జన్మ' అని చెప్పియుండును." అట.

వీరనిన నిషేకము వీరనుకొనిన జన్మ కాదుకాని ప్రథమజన్మ కాకపోవుటేమి ? అసలు జన్మను 'తతః కాలేన' అనుచోట చెప్పవద్దా? అందురా ? నిషేకజన్మమునే అసలుజన్మ అని భ్రాంతిపడకుండుటకు యిక్కడ 'కర్ణనిషేకజన్మేత్యర్థః' అని చెప్పబడినది. పైనున్న 'తతః కాలేన సా గర్భం సుషువే' అనుశ్లోకములో కుంతి కనినదని చెప్పబడుటచే అసలు జన్మ అది యని స్పష్టమగుచునేయున్నది. అక్కడ వ్యాఖ్యానింపవలసినపని యేమున్నది ? "అన్యథా ప్రతిపత్తి రప్రతిపత్తిర్వా వ్యాఖ్యాబీజమ్" అను వ్యాఖ్యానమర్యాదను వీరెరుగరు కాబోలు.

ఇట్లు సమీక్షింపగా నీలకంఠుల హృదయమూ అవగతమైనది. విమర్శకర్తల వ్రాతయూ పరాస్తమైనది. ఇప్పుడు "నీలకంఠుని దనుకొనిన వ్యాఖ్య తప్పే" అనివ్రాసిన విమర్శకర్తలదే తప్పో వ్యాఖ్య తప్పో పాఠకమహాశయులు తేల్చుకొందురుగాక.

ఇంకను విమర్శకర్త లిట్లనుచున్నారు—

"శాస్త్రిగారు 'తతః కాలేన' అను వాక్యము నూతగా గొని ఎఱ్ఱాప్రగడ 'దశోత్తరే'కి అపార్థము చెప్పలేదని కరపత్రములో వ్రాసినారు. 'తతః కాలేన' అనంతరము కాలక్రమమున అని యూహించి ఏకాదశమునకు లాగినారు." అని. (పు. 23)

దీనికి చెప్పవలసియున్నది—'తతః కాలేన'కు 'దశోత్తరే'తో నేమియు సంబంధము లేదు. దశోత్తరశుక్లపక్షమందు కర్ణు డనబడు జీవునకు కుంతీగర్భప్రవేశము అక్కడ చెప్పబడినది. ప్రసవోచితకాలమునుబట్టి కుంతీగర్భమునుండి కర్ణోత్పత్తి యిక్కడ చెప్పబడినది. ఆప్రసవోచితకాలమే 'దశమే మాసి సూతవే' అనుటనుబట్టి దశమమాసమని ఎఱ్ఱాప్రగడ వ్రాసియుండెను. అది యుక్తమే. అని మేము వ్రాసినాము. ఏకాదశమున కేమి లాగినారు ? విషయము తెలిసికొనకుండ ఏదో తోచినట్లనుటేనా ?

ఇంకను ఇట్లనుచున్నారు—

"'తతః కాలేన' ఆకాల మందనవచ్చును. (పద్యః) 1'తతః కాలేన వైరాగః' 'తతః కాలేన సా గర్భ మవాప' 'తతః క్షణేన తత్స

ర్థం' 'నాదేయం తస్య తత్కాలే' ఇట్లు తతఃకాలము తత్కాలము, తతఃక్షణము తత్క్షణము కావచ్చును.

ఎఱ్ఱాప్రగడ 'తతః'కు గ్రమంబున నని అర్థముచెప్పుట తప్పు.... స్వతంత్రించినాడు; ఎఱ్ఱాప్రగడ నీలకంఠునివలె పదునొకండనక పదియవమాసంబున అనినాడు. పక్షముండెనుకదా? మాసముండదా అనుకొనినాడేమో.

2 మూలగతముకాని ఏకాదశమును నీలకంఠు డెత్తుట జరిగినదికదా...మూలములోని శుక్లము తారాపతికొరకు వచ్చినదని తెనుసుకొనక భ్రమభరితుడైనాడు నీలకంఠవాచ్యుడు. కావున పైశ్లోకవాఖ్య తప్పనియు 'తతఃకాలేన' శ్లోకము ప్రక్షిప్తము నస్థానపతితము నని నా అభిప్రాయము'' అని.

వీరికి చెప్పవలసియున్నది—'తతః కాలేన కు 'ఆకాలమందు' అని అర్థము చెప్పవచ్చు ననుట అయుక్తము. తృతీయకు అధికరణత్వార్థ మెట్లు? ఇంకొకటి—'తతః'లోని 'తసిల్' ప్రత్యయము పంచమ్యర్థకముకాదు. తృతీయార్థకమే అగుటకు గల ఆధారమేమి ? ఇంకొకటి— తతఃకాలము- తత్కాలము- ఆకాలము కదా! ఏకాలము ? మీరనెడి ఆకాలము కర్ణోత్పత్తికాలము కావలెను. 'తతఃకాలేన సా గర్భం సుషువే' అని యున్నది. చూచితిరా ?

వెనుకటి క్రియకు సంబంధింపజేసి తత్కాలమున ప్రసవించె నని చెప్పవలెను. ఆవెనుకటి క్రియలలో 'తతో గర్భస్సమభవ త్పృథాయాః' కుంతికి గర్భ మేర్పడిన దని మొదట నున్నది. ఆయేర్పడినపుడే ప్రసవించిన దందురా ? అట్లయిన 'సా బాన్ధవయా ద్బాలా గర్భం తం వినిగూహతీ ధారయామాస'... ఆమె బన్ధువులు తెలిసికొనకుండ గర్భమును గుప్తముగా ధరించియుండెను. అని యున్న ఈగర్భధారణమునకును 'నచైనాం బుబుధే జనః' 'న హి తాం వేద నార్యన్యా' అనువాక్యములకును గతియేమి ?

గర్భధారణము, గర్భమేర్పడి ప్రసవింపకుండు కాలమునకు చెందినది. చూచెడి వారు ఈమె గర్భవతి యని కనిపెట్టగలకాలమునకు

చెందినది గర్భగోపనము. ఇట్టి స్థితిలో గర్భ మేర్పడినపుడే ప్రసూతి అనువారి మతములో గర్భధారణ గర్భగోపనము లిముడుట యెట్లు? కనుక గర్భ మేర్పడిన పిమ్మట, ప్రసవించుటకు బూర్వము, గర్భధారణ చేసి అది యెవ్వరికి దెలియకుండ గుప్తపరచుకొనుచుండెను. 'తతః కాలేన సుషువే' తరువాత సకాలమున ప్రసవించెను. అనియే చెప్పి తీరవలెను. కాబట్టి 'తతఃకాలేన' ను, 'తత్కాలేన' నుగా జేయుట లసంగతమే.

ఇంకొకటి-తత్కాలమునే తతఃకాలముగా మూలకారుడు చెప్పె ననుమాట నిజమైనయెడల ప్రతివాదులచే 'చకారకుక్షి' అని కీర్తింపబడిన వ్యాసమహర్షి– 'తత్కాలేన చ సా గర్భం సుషువే' అని యేల చెప్పలేదు? 'తతః కాలేన' అని యేల చెప్పెను? కాబట్టి అది తదనంతర కాలార్థకమే కాని తత్కాలార్థక మెంతమాత్రము కాదు. ఆతదనంతరకాలము ప్రసవమునకు హేతుభూతకాల మనుటకై 'కాలేన' అని తృతీయాంతప్రయోగము కాలగతమైన ఆ ప్రసవహేతుత్వము 'దశమే మాసి సూతవే' అను శ్రుతిసిద్ధము. ఇప్పుడు తతః=తదనంతరము; కాలేన సుషువే=కాలహేతుకప్రసూతి కలదయ్యెను. అనగా గర్భమేర్పడినది మొదలు దశమమాసమున ప్రసవించెను. అని యర్థము పర్యవసించినది. ఇప్పుడు గర్భ మేర్పడుట, ఆపై గర్భము ధరించుట, ఆపై గర్భము గుప్తపరచుట, ఆపై ప్రసవించుట అనుక్రమము చక్కగా కుదిరినది. అది కన్యాగర్భమై యుండ, గర్భవతియై ఆమె కాలము గడుపుచుండ దానిని జనులు కనిపెట్ట లేకుండుటలో సూర్యదేవుని అసాధారణానుగ్రహము బుద్ధిమంతులకు విస్పష్ట మగునట్లు బోధింపబడినది. ఆయాఉత్పత్తులలోని ప్రభేదములను దురవగాహములగువానిని భిన్న భిన్నరీతులలో ప్రతిపాదించుచున్న భారతము కర్ణోత్పత్తిలో గల ఈవైలక్షణ్యమును వెల్లడించినది. ప్రతివాదు లిక్కడ సద్యఃప్రసూతి అర్థ మనుటకు ఎన్నిఎత్తులు వేసినను అవి వారిని భంగపరచు నవే. ఇక్కడ ఎట్లాప్రగడ వ్రాసినదే యుక్తము. ఈతనిని తీసివేయుచున్న ఈప్రతివాదుల ధోరణి తప్పు. స్వతంత్రించినవారు విమరకులేకాని యెట్లాప్రగడ కాదు.

2 నీలకంఠులను తృణీకరించు విమర్శకర్తల నిరంకుశత్వ మేమని చెప్పవలెను ? 'మూలగతముకాని ఏకాదశమును నీలకంఠు డెత్తినాడు" అట! ఇది యెక్కడ ? 'శుక్లే దశోత్తరే పక్షే' అనుచోటనా ? అక్కడ దశోత్తరము ఏకాదశము కాదా ? అది మూలోక్తము కాదా ? విమర్శకుల దర్థములేని మాట.

'మూలములోని శుక్లపక్షము తారాపతికొరకు వచ్చినదని నీలకంఠ వాచ్యుడు తెలుసుకొనక భ్రమభరితుడైనాడు' అట ! ఈవిమర్శక వాచ్యుల కిట్లనిపించుట చిత్రమే !

"తతో గర్భస్సమభవత్...శుక్లే దశోత్తరేపక్షే తారాపతిరివాంబరే"

ఇక్కడ గర్భసంభవకాలము వివక్షితముకాక కేవల శుక్లపక్ష చంద్రసామ్యమే మూలకారునకు వివక్షితమైనచో 'శుక్లేపక్షే' అనుటతో సరిపోవుచుండ దానికి 'దశోత్తరే'ను విశేషణము నిష్ప్రయోజనము కావలసివచ్చుచున్నది. సామ్యమునకు మాఘశుక్లచంద్రుని చెప్పుటలో విశేషము లేదుకనుక.

మాఘశుక్లమును బోధించు 'దశోత్తర' విశేషణము సార్థకమగుటకు దానిని గర్భసంభవకాలముగాకూడ అన్వయించవలసినదే. మాఘ శుక్లమందు గర్భము సంభవించినది. అని. ఆగర్భమునకు శుక్లపక్ష చంద్రునితో సామ్యము చెప్పబడినది. కుంతీ కుక్షిగతమై పరోక్షమై యున్న స్వరూపమునకు ప్రత్యక్షమగు శుక్లపక్షచంద్రుని పోలిక తగదు కనుక పరోక్షశుక్లపక్షచంద్రునే గ్రహింపవలెను. అట్టిచంద్రుడు శుక్ల ప్రతిపచ్చంద్రుడు; ఇట్టిచంద్రుడు మొదట పరోక్షముగా ఆకాశగతుడై యుండుట, క్రమాభివృద్ధినొందుట మొదలగు లక్షణములచే కుంతీ కుక్షిగతస్వరూపమునకు దృష్టాంతముగా చెప్పబడెను. ఇదియే నీల కంఠులుచెప్పిన అర్థము.

కేవల శుక్లపక్షము (ప్రతిపత్తు) తారాపతియందును, దశోత్తర శుక్లము (మాఘశుక్లప్రతిపత్తు) గర్భసంభవమందును నీలకంఠు లన్వయించినారు. దాని స్వారస్యము గ్రహించు శక్తి విమర్శకులకు

లేకపోయినది. పాపము ప్రతివాదుల కాపహించిన భ్రాంతి వారి దృష్టిలోఁ బడు వారందరు భ్రాంతులనియే వారికి గట్టిగా తోఁపింపఁజేసినది.

విమర్శకులు తుదకు చెప్పినమాట యిది—'కావున పైశ్లోక వ్యాఖ్యతప్పనియు, తతః కాలేన' శ్లోకము ప్రక్షిప్తము నస్థానపతితము ననియు నాఅభిప్రాయము' అని.

వీరి యభిప్రాయ మెవ్వరికి కావలెను? కావలసినది గ్రంథ కారుని యభిప్రాయము. అది శబ్దార్థపర్యాలోచనముచే గ్రాహ్య మగును. దానికి శాస్త్రమర్యాద తెలియవలెను. దానికి గురుకుల వాసపూర్వకమైన విద్యాభ్యాస ముండవలయును. ఆపై ఈశ్వరాను గ్రహ ముండవలెను.

ఇవి యేవియులేని యిట్టిస్వయమాచార్యపురుషులకు ప్రక్షిప్త మని, తప్పని తోఁచక మరెట్లు తోఁచును?

కనుక నిట్లసంగతమైన వీరి వ్రాత నిరస్తమైనది. కర్ణుని సద్యః ప్రసూతివాద మప్రామాణిక మగుటచే పరాస్తమైనది

విమర్శకు లింకను ఇట్లు వ్రాసినారు—

1 "బహుళ అష్టమివరకు చంద్రునికి పూర్ణత్వము జ్యోతిశ్శాస్త్ర మంగీకరించినది. కావుననే శ్రావణబహుళఅష్టమినాడు పుట్టిన కృష్ణుడు పూర్ణచంద్రునితో బోల్పబడినాడు. 'దేవక్యాం పుష్కలః పూర్ణః' (భాగవతము) దశోత్తరే'కి అట్టి సంబంధమే ఊహించవ లెను. 2 శుక్లే=శుక్లపక్షమందు దశోత్తరే=దశమికి పిమ్మట చంద్రుని వలె; గర్భః=శిశువు; సమభవత్=కలిగెను. అని అన్వయము.

3 గర్భ మందలి కలలమునకు తారాపతిని బోల్చుట పొసఁగదు కదా! కావున గర్భః అనినపుడు శిశువు అనియే చెప్పుట సమంజ సము." అని. (పు. 25 26)

ఇచ్చట చెప్పుచున్నాము—ప్రథమాంశము—

బహుళాష్టమివరకు చంద్రునికి జ్యోతిశ్శాస్త్ర మంగీకరించిన పూర్ణత్వము జాతక-ముహూర్తములకు సంబంధించిన సంకేతము కాని, లోకప్రసిద్ధమైన ఉపమానమునకు సంబంధించినది కాదు. ప్రతివాదులు చూపిన భాగవతవచనము—

"దేవక్యాం...విష్ణుః ఆవిరాసీత్। యథా- ప్రాచ్యాం దిశి ఇన్దు రివ పుష్కలః" శ్రీధరీయమ్— పుష్కలః పూర్ణః। అనేన దృష్టాన్తేన చన్ద్రస్య దిక్సంబన్ధ ఇవ భగవతో దేవకీగర్భసంబన్ధః...

దీనికితాత్పర్యము— ప్రాగ్దిశయందు పూర్ణచంద్రుడావిర్భవించినట్లు దేవకీదేవియందు భగవంతు డావిర్భవించెను. అని.

ఇక్కడ బహుళాష్టమినాడు పుట్టిన కృష్ణుడు పూర్ణచంద్రునితో బోల్చబడెనేకాని వారనుకొనినట్లు కృష్ణాష్టమినాటి చంద్రునితో బోల్చబడలేదు. కనుక వారివ్రాత తప్పు.

'దశోత్తరే' కి అట్టి సంబంధమే ఊహించవలెనట. ఇదియెంత సంబద్ధమో అంత సంబద్ధమే అదియును.

ద్వితీయాంశము— శుక్లే=శుక్లపక్షమందు, దశోత్తరే=దశమికి బిమ్మట చంద్రుడువలె; గర్భః=శిశువు, కలిగెను. అని అర్థమట.

వీరి మతమునుబట్టి ఆ కలిగినవాడు శిశువే. ఆశిశువు సహజ కవచకుండలశోభితుడు; తేజశ్శాలి. అట్టి శిశువు చంద్రునితోగాక దశమికి బిమ్మట చంద్రునితో బోల్చబడుటలో గల విశేష మేమో ?

ఇక్కడ 'దశోత్తరే, శుక్లే పక్షే' అను సప్తమ్యంతములలో 'దశోత్తరే' విశేషణమై శుక్లపక్షము విశేష్యమై కనబడుచున్నందున విశేషణములోని దశశబ్దము శుక్లపక్షపరమే అయి పదిశుక్లపక్షములపై నగు శుక్లపక్షమున, అని యర్థము లభించుచున్నది. అదియే మాఘ శుక్లమయినది. ఇక విమర్శకులు విశేష్యముగా నున్న శుక్లపక్షమును దశోత్తరమునకు విశేషణము చేసి ఈ దశోత్తరమునకు విశేష్యములేక, ఏతిథినో తెచ్చికొనికాబోలు దశమికి బిమ్మట, అని వ్రాసి శ్రుతహానిని, అశ్రుతకల్పనను అన్యాయముగా చేసినారు. ఇట్లుచేసి ఆదశోత్తరతిథిని చంద్రునితో ముడిపెట్టి అట్టిచంద్రునితో శిశువును పోల్చినారు. ఇట్టి ఏకాదశీచంద్రసామ్య మప్రసిద్ధము.

శ్రీకృష్ణభారతములో— "భానుమంతుని తేజఃప్రభావంబున చైత్రాదిదశోత్తరంబైన మాసంబునం దాదిమ దివసంబున గర్భంబు దాల్చె" అని యున్నందున, దశోత్తరమునకు చంద్రునితో అన్వయము.

గర్భశబ్దమునకు శిశు వను అర్థము. 'సమభవత్' అనుదానికి పుట్టె నను అర్థము. విమర్శకులు చెప్పిన యిదంతయు శ్రీకృష్ణభారతమునకు విరుద్ధము.

ఇట గర్భశబ్దమునకు శిశు వర్థము జెప్పి 'సమభవత్' అనుదానికి కలిగెను. అనగా పుట్టెను అని అర్థముచెప్పినారు.

ఇది 'తతో గర్భ స్సమభవత్' అనుశ్లోకమునకు సద్యఃప్రసూతిగా వారు చెప్పిన అర్థము. ఏదో వారు చెప్పినారుకాని దీనికి వెనుక సూర్యదేవోక్తిగా నున్న—"సాధయిష్యామి సుశ్రోణి పుత్రం వై జనయిష్యసి I ... కన్యా చైవ భవిష్యసి" అనుశ్లోకములో భవిష్యత్కాలమందే పుత్రోత్పత్తి, పునఃకన్యాత్వము చెప్పబడుటచేత వీరి సద్యఃప్రసూతి దానికి విరుద్ధము.

ఆ భవిష్యత్కాలముకూడ అద్యతనభవిష్యత్తుకాక అనద్యతనభవిష్యత్తుగనే ఈ కుంతీవాక్యము స్పష్టీకరించుచున్నది—

"తతో మాం తేజసావిశ్య మోహయిత్వా చ భానుమాన్ ।
ఉవాచ భవితా పుత్ర స్తవే త్యభ్యగమ ద్దివమ్ ॥" (ఆశ్రమ. అ30)

ఇక్కడ 'భవితా' అనుప్రయోగము అనద్యతనభవిష్యత్తును అనగా వ్యవహితమైన భవిష్యత్తును తెలుపుచున్నందున దీనికి సద్యఃప్రసూతివాదము విరుద్ధము.

ఇంకొటి—'తతో గర్భ స్సమభవత్' కుంతీదేవికి యే గర్భమేర్పడినదో 'గర్భం తం వినిగూహంతీ ధారయామాస' ఆగర్భము నామె గుప్తపరచుచు ధారణ చేసెను. 'తతః కాలేన సా గర్భం సుషువే' తదనంతర మామె ఆగర్భమును ప్రసవోచితకాలమునుబట్టి ప్రసవించెను. అని యున్న వాక్యముల వరుసలో కడపటిది 'గర్భం సుషువే' అనునది. ఇక్కడ 'సుషువే' అనునది 'షూఙ్ ప్రాణిగర్భవిమోచనే' అనుధాతువుస్రూపము. దీనికే ప్రసూతి అర్థము. విమర్శకులు ఇక్కడ చెప్పవలసియున్న ప్రసూతిని మొట్టమొదటనే 'గర్భ స్సమభవత్' అనుదానికి చెప్పుట, ఆ గర్భశబ్దమునకు శిశు వర్థమనుట, విరుద్ధము. వారన్నట్లు శిశువే దానికర్థమైన యెడల 'తత శ్శిశు స్సమభవత్' అని యేల చెప్పబడలేదు ?

'గర్భ స్సమభవత్' 'గర్భం సుషువే' ఇక్కడ ధాతువుల అర్థ భేదమును విమర్శకులు గమనింపనేలేదు. గర్భశబ్దమునకు ఎక్కడ శిశు వర్థమో ఎక్కడ కాదో కనిపెట్టలేదు. పై రెండువాక్యములకు మధ్య గల 'గర్భం ధారయామాస' కు గతి నాలోచింపలేదు. కనుక విరుద్ధమైన వీరి వ్రాత నిరస్తము.

తృతీయాంశము— 'కుంతీకుక్షిగతస్వరూపమునకు తారాపతి దృష్టాంతము చెల్లదు కనుక అక్కడ గర్భ మనగా శిశు వనుటే సమంజస'మట.

వీరనిన శిశువునకు వీరనిన ఏకాదశీచంద్రదృష్టాంతము చెల్లునా! కుంతీకుక్షిగతస్వరూపమునకు తారాపతిదృష్టాంతము చెల్లుట యెట్లో పూర్వము నిరూపించినాము. అసంగతమై యున్న వీరిసద్యఃప్రసూతి వాద మపాస్తము.

విమర్శకులు అక్కడక్కడగల కొందరి నుదాహరించి—

"ఇట్లు పలువురు సద్యఃప్రసూతులు పురాణములలో గన్పడు చున్నారు. కథకుల సద్యఃప్రసూత్యభ్యంతరములు, యుక్తిశూన్యములై నిలుచునవి కావని చెప్పవలెను" అనిరి. (పు 28)

ఎక్కడ సద్యఃప్రసూతి ప్రమాణసిద్ధమో అక్కడ దానినంగీకరింపనివారెవరు? ఇక్కడ భారతములో కర్ణునిది సద్యఃప్రసూతి అని చెప్పుటకు ప్రమాణము లేదని మేము చెప్పుచున్నాము. విమర్శకులకు యుక్తులు దానిని సాధింపజాలవనికూడ చెప్పినాము. ఇంకను విమర్శకు లిట్లనుచున్నారు—

"శ్రీమద్భాగవతమున కర్ణుని పుట్టుక చెప్పబడినది— 'సద్యః కుమార స్సంజజ్ఞే ద్వితీయ ఇవ భాస్కరః' ఈ 'సద్యః' ను కథకులేయుక్తిని ద్రోసివైచెదరో" అని (పు 27)

మేము చెప్పెడి యుక్తి యేమనగా—భాగవతములో సద్యోజననము చెప్పబడిన దని ఇట్లుచెప్పబడని భారతములోగూడ నదియే చెప్పవలె ననుట అసంగతము. భారతములో 'సద్యః' లేదు। ఆపై 'గర్భ స్సమభవత్' 'గర్భం (వినిగూహతీ ధారయామాస' 'నచైనాం

బుబుధే జనః' 'తతః కాలేన సా గర్భం సుషువే' అనువాక్యములవలన సద్యఃప్రసూతిని చెప్పుటకు బాధక మగుచున్నది.

ఇట్టిబాధకవాక్యములు ఆ భాగవతములో లేవు—

'అమోఘం దర్శనం దేవి ఆధత్సే త్వయి చాత్మజమ్ ।
ఇతి తస్యాం స ఆధాయ గర్భం సూర్యో దివం గతః ॥
సద్యః కుమార స్సంజజ్ఞే ద్వితీయ ఇవ భాస్కరః ।
తం సాఽత్యజ న్నదీతోయే కృచ్ఛ్రా ల్లోకస్య బిభ్యతీ ॥''

చూచితిరా ? ఇందు గర్భధారణము, గర్భగోపనము, కాల ప్రసూతి అనువిషయములు లేవు. సద్యః అని యున్నది దీనిలోవలె భారతములోగూడ చెప్పఁడు మనుట యెట్లు ? అది వాక్యార్థపరిజ్ఞానము లేనివారికే చెల్లును.

భాగవతములోవలె భారతములోగూడ సద్యఃప్రసూతియే అని వీరు బయలుదేరినట్లు, భారతములోవలె భాగవతములోగూడ సద్యః ప్రసూతి కాదని మరొకరు బయలుదేరిన వీరుచేయునదేమి ? కనుక భాగవతనిదర్శనముతో కర్ణునిపట్ల భారతమున సద్యఃప్రసూతివాదము నతికింపబూనిన విమర్శకుల మాటలు త్రోసివేయబడినవి.

ఇక్కడ మరొకమాట విమర్శకుల నడుగుచున్నాము—

''సద్యః కుమార స్సంజజ్ఞే ద్వితీయ ఇవ భాస్కరః ।''

అని మీరుదాహరించినశ్లోకములో సద్యఃప్రసూతుడైన కర్ణశిశువునకు భాస్కరదృష్టాంతము చెప్పబడియుండ భారతములో సద్యః ప్రసూతునిగా మీరుచేసిన కర్ణశిశువునకు ఏకాదశీచంద్రదృష్టాంతము నెట్లు చెప్పినారు ?

మీరుదాహరించిన భాగవతవాక్యమే సద్యఃప్రసూతకర్ణశిశువునకు చెప్పవలసినది సూర్యసామ్య మని బోధించుచుండ అట్టి ఆభారతోక్త శిశువునకు చంద్రసామ్యము చెప్పుటకు మీరెట్లు సిద్ధపడినారు ? ఆశ్లోక ములో నున్నది చంద్రసామ్యమే అందురా ? ... గర్భః అని మాత్రము లేదా ? ఆచంద్రసామ్యము ...తములో గర్భమా... నకు చెప్పబడియుండ మీరు దానిని శిశువున...పెట్టుట, ...త్తిన భాగవతవచనమునకు విరుద్ధమని మీకెందుకని...లేదు ?



గర్భమునకుమాత్రము ఆచంద్రసామ్యము ఎట్లు సరిపడు నందురా ? వినుడు—అది పూర్వోక్తప్రకారము ప్రతిపచ్చంద్రసా మ్యము; అది అన్తర్గతమై క్రమాభివృద్ధినొందు గర్భమునకు సరిపడునట్టి సామ్యము; బహిర్గతమైన శిశువునకు సరిపడునది సూర్యసామ్యమే. కనుక నీలకంఠుల వ్యాఖ్యానములో పూర్వోక్తవాక్యములకు విరోధ మేమియు లేదు; మీమాటలలో సంతయు విరోధమే; ఇట్టి మీరు నీలకంఠులను నిర సించుటా ? అని అడుగుచున్నాము. ఇట్లసంగతప్రసంగ మగుటచే వీరి సద్యఃప్రసూతివాదము నిరస్త మయినది.

ఈసద్యఃప్రసూతివాదుల నింకొకవిషయ మడుగుచున్నాము— హర్మ్యతలమందుండి కుంతీదేవి సూర్యదర్శనముచేసిన సమయ మేది ? "ప్రాచ్యాం దిశి సముద్యన్తం దదర్శాదిత్యమండలమ్" సూర్యు డుద యించుచున్న సమయమది; ఆపై సూర్యదేవాగమనము; తత్సంబంధము; 'సద్యః' తక్షణముకర్ణప్రసూతి. ఇకశిశుపరిత్యాగమెప్పుడు? "జాతమాత్రం చ తం గర్భం...మంజూషాయాంసమాధాయ...అశ్వనద్యా మవా సృజత్" పుట్టినతోడనే మంజూషయందు పదిలముగా నుంచి 'ధాత్ర్యా సంమంత్ర్య' పరిచారికతో ఆలోచించి అశ్వనదియందు విడిచెను.

ఆమెయునికి, పుత్రోత్పత్తియు—"తతోఽహ మన్తర్భవనే పితుః...గూఢోత్పన్నం కర్ణ మవాసృజమ్" 'పితుః అన్తర్భవనే గూఢో త్పన్నం' మీఅన్వయప్రకారము (పు.12) పితృభవనాంతరమందుకదా ! అట్టి తండ్రియొక్క అంతర్భవనమందు ఉనికి కలిగి దాని పైభాగ మందుండి, ఉదయించుచున్న సూర్యుని దర్శించి, మంత్రము జపించి తన్మూలమున సమీపించిన సూర్యునితో సంబంధించి, తత్క్షణము సుతుని ప్రసవించి, పుట్టినవెంటనే సుతుని అశ్వనదియందు ఆమె రహస్యముగా విడిచిపెట్టినదా ? ఇదంతయును ఆనాటి ప్రాతఃకాలకృత్య మని మీరు చెప్పవలసినదేకదా ! అది అట్లు సంభవమేనా ? ఇంతకంటె అనుచిత మైన వ్రాత యున్నదా ? పుట్టినతోడనే శిశువును విడిచిన సమయ మేదియో చూడుడు—

"అవాసృజత మంజూషాం...రుదతీ...నిశీథే కమలేక్షణా"
(వన. అ. 308)

శ్రీకృష్ణభారతమం దేమున్నదో చూడుడు—"ఇట్లు కనినంతన కుంతి...జాతమాత్రుండైన పుత్రుం బెట్టి పెట్టియం బదిలంబుగా అశ్వనదిం బడవిడుచుచు నన్నిశీథినీసమయంబున" (అరణ్య) కుంతికి పుత్రుడు నిశాసమయమందు బుట్టుట, ఆవెంటనే నదియందు విడుచుట జరిగినట్లు పైగ్రంథము చెప్పుచుండ అదియంతయు ప్రాతః కాలమందే జరిగినట్లు వెల్లడించు మీసద్యఃప్రసూతివాదము అసంగతము. సకాలప్రసవవాదమున కిట్టి యసాంగత్యముకాని, పూర్వోక్తవిరోధములుకాని యేమియు లేనందున అదియే సిద్ధాంతమై మీవాదమును త్రోసివేయుచున్నది.

—• కుంతీకన్యాత్వవరసమీక్ష •—

సూర్యదేవుడు కుంతికిచ్చిన కన్యాత్వవరమును గూర్చి—
"పుత్రం వై జనయిష్యసి...కన్యా చైవ భవిష్యసి।"

ఇక్కడ పుత్రజననానంతరము మరల కన్యవే అగుదువు అని వర మీయబడెను. అప్పటి కామె కన్యయే అనుట నిర్వివాదము. కన్యయైయున్న ఆమెకు పురుషసంబంధమూలకమైన పుత్రజననమైన తరువాత ఆకన్యాత్వమునకు భంగము(మార్పు)కలుగునని కదా 'కన్యా చైవ భవిష్యసి' మరల కన్యవే అగుదువని వరము. పురుషసంబంధముతో భంగము కలుగు ఆకన్యాత్వ మేదియో అది ఆవరముతో పునఃస్థాపితము కావలెను. అప్పుడే ఆవరమునకు సార్థక్యము

ఇక్కడ 'వివాహిత కాకుండుటే ఆమె కన్యాత్వము' అను విమర్శకుల నడుగుచున్నాము—మీరనిన ఆకన్యాత్వమునకు అనగా ఆమె వివాహము కానిదై యున్న పరిస్థితికి భంగకరము (మార్పుకలిగించునది) వివాహ మగునా ? సూర్యదేవసంబంధ మగునా ? సూర్యదేవసంబంధము వివాహము కాదు. వివాహమే వివాహరహితస్థితిని మార్చివేయునట్టిది వివాహ—అవివాహ—స్థితులకే విరోధముకనుక. ఇట్టిస్థితిలో ఆమె వివాహరహితస్థితికి సూర్యదేవసంబంధకృతమైన మార్పును మీరేమి చెప్పగలరు ? మార్పే లేనపుడు సూర్యదేవుని 'కన్యాచైవ భవిష్యసి' అను ఆవరమునకు సార్థక్యము మీరేమిచెప్పగలరు? ఆవరము

నకు మీమతములో ఇప్పటివలె అవివాహితవే పునః నీవయియుందువని అర్థము కనుక వరముతో బనిలేకయే అదిసిద్ధించియున్నందునఅప్పుడామె కావర మెందులకు ? అప్పు డావరమువ్యర్థమగుటే కాదు. ఇప్పటివలె అవివాహితవే పునః నీవయి యుందువు. అని మీరుచెప్పెడి ఆవరము ఆమెకు ముందు కాబోవు వివాహమునకు ప్రతిబంధకమై అనర్థకరమగుచున్నదికూడను.

"వివాహమువరకే ఆకన్యాత్వ మనిన చాలును." (పు. 26) అని మీరుసెలవిచ్చిన 'ఆకన్యాత్వము' ఏకన్యాత్వము ? వివాహరహితత్వమా ? అది యెంతవరకు చాలును ? వివాహమువరకునా ? అయితే ఓకుంతీ వివాహమగు వరకు నీకు వివాహరహితత్వమును అనగా అవివాహితవై యుండుటను నేను వర మిచ్చినాను. అని సూర్యదేవు డనెనా ? సూర్యదేవునిగూడ అర్థములేనిమాట లాడువానిగా జేయుచున్నారే.

వివాహమగువరకు అవివాహితలై యున్న నేటివారు అట్టి వరప్రభావముచేతనే అట్లున్నారా ? మీమాట లిట్లున్నవి.

ఇక మేము చెప్పుచున్నాము వినుడు—

కుంతికి సూర్యదేవుడు మంత్రాకృష్టుడై తనసంబంధము తప్పదని చెప్పుచున్నాడు. తన సంబంధముచేత ఆమె కన్యాత్వమునకు భంగము తప్పనిదై వచ్చినది. ఆకన్యాత్వభంగము ఆమెకు ముందు కాబోవు వివాహమునకు ప్రతిబంధకము కాబోవుచున్నది. అట్లు కాకుండ తన సంబంధమున ఆమెకు గలుగు కన్యాత్వభంగమును తాను పోగొట్టి ఆమె కన్యాత్వ మామెకు నిలుపుటకు "కన్యా చైవ భవిష్యసి" అని కన్యాత్వవర మిచ్చెను. కన్యాత్వ మక్షతయోనిత్వరూపమని శాస్త్రకారులు చెప్పియున్నారు. అది వెనుక 'భాష్యప్రదీప' గ్రంథమునుండి ప్రదర్శింపబడినది.

ఇప్పుడు తన సంబంధమూలమున తొలగిపోవు ఆమె కన్యాత్వమును ఆమెకు మరల నిలుపుటకై సూర్యదేవుని వరము సార్థకమై ఆమె భావివివాహమునకు సాధకమై ప్రశంసనీయమైన దని తెలిసికొనవలెను.

వరరూపమైన అట్టి కన్యాత్వము కల కుంతీదేవి వివాహము కన్యావివాహమైయుండ అది బిడ్డతల్లివివాహ మనుట అపచారము. సూర్యదేవుని ఆవరమును పాటింపని స్వేచ్ఛావాద మనర్థావహము.

విమర్శకుల వ్రాత యిట్లున్నది—

"1 శాస్త్రిగారు కుంతీవివాహము బిడ్డతల్లివివాహము కాదని... వ్రాసినారు. కుంతి కర్ణునికనలే దందురా ?

2 పాండువు వివాహమునాటికి కుంతి పసిబిడ్డయా ?

3 కర్ణు డామెకన్న బిడ్డ అయినప్పుడు తరువాత కొంత కాలమునకు జరిగిన కుంతీవివాహము సంతానవతీవివాహము కాదనుట ప్రతారణముకాదా ?

4 వరము బాల్యావయసు నిచ్చునది యైన బిడ్డల గనినప్పుడెల్లను బాల యగుచుండునా ?" అట! (పు. 27)

ఇక్కడ చెప్పుచున్నాము-ప్రథమాంశము-బిడ్డతల్లి వివాహము కాకుండుటకే సూర్యదేవుని కన్యాత్వవరమైయుండ అది బిడ్డతల్లివివాహ మెట్లగును ? కుంతి కర్ణుని కనలేదందురా ! అని అడుగుచున్న మిమ్ములను సూర్యదేవుడు కన్యాత్వవర మివ్వలేదందురా ! అని మే మడుగుచున్నాము.

ద్వితీయాంశము—పాండువు వివాహమునాటికి కుంతి పసిబిడ్డయా ! అను మీప్రశ్న కర్థము లేదు. కర్ణోత్పత్తికాలమునకు కుంతి దేవయస్సు ? అనునదే ప్రసక్తవిషయము. ముం దెప్పుడు వివాహమయినదో అప్పటి కావయస్సును కట్టుకొనవలయును.

తృతీయాంశము—కుంతి కర్ణుని కనిన దయినను ఆకనినది కనినట్లే యుండిపోక వరమువలన ఆకనినవారెవ్వరో అన్నట్లుండి సర్వాదరణీయురాలై యుండ ఆపై కొంతకాలమునకు జరిగిన స్వయంవర వివాహము సంతానవతీవివాహ మనుట అసంగతము కాదా ?

ఈవిమర్శకుల దృష్టిలో సంతానవతిగా కుంతి గోచరించుచున్నదేమో కాని, ఆమెను ప్రత్యక్షముగా చూచు లోకులకు అట్లామె గోచరించెనా ? సర్వమహర్షి-మహీపతి-సంస్తుతిపాత్రమైన కుంతీవివాహమునకు ఒక దోషమును కల్పింపబూనుట మంచిపని కాదు.

. వన్నెతక్కువబంగారము వహ్నియోగమున కుందనమైనపుడు ఆకుందనమును వన్నెతక్కువబంగారమనుట యెట్లు చెల్లదో అట్లే కర్ణోత్పత్తిచే వన్నెతగ్గిన బంగారమువలె నున్న కుంతి సూర్యదేవవర మనబడు వహ్నియోగమున కుందనమువంటిదైయుండ ఆమె వివాహము సంతానవతీవివాహ మనజెల్లదు.

చతుర్థాంశము—ఇక్కడ తన సంబంధమునుబట్టి తొలగెడి ఆమె కన్యాత్వము ఆమెకు నిలుపుటకై యివ్వబడినది వరము. సూర్య దేవుని దిట్టి వరమైయుండ 'బిడ్డల గనినప్పుడెల్ల బాల యగుచుండునా?" అని వీరి దిదేమిప్రశ్న ?

ఇట్లు సమీక్షింపగా అసంగతమైన వీరివ్రాత పరాస్తమైనది.

—• కుంతీసత్యవతీ 'పుంయోగేచ్ఛావాద' సమీక్ష •—

విమర్శకర్తల వ్రాత యిట్లున్నది—

'శాస్త్రిగారు ఇట్లు వ్రాసియున్నారు—'పృథాసత్యవత్యో రనిచ్ఛన్త్యోరేవ సూర్యపరాశరాభ్యా మపత్యోత్పాదనం కృతం' కుంతీసత్యవతులు పురుషసంబంధవాంఛ లేని దశలో నున్నపుడే సూర్యపరాశరులవలన వారికి సంతతి కలిగింపబడినందున అనిరి. 'అనిచ్ఛన్త్యోః'కు పురుషసంబంధవాంఛ లేనివారని అర్థము కాదు. కోరనివారి కని అర్థము." అని. (పు. 28)

ఇక్కడ వీరనినట్లు ఆకోరనివారు వాంఛలేక కోరనివారా ? వాంఛయుండి కోరనివారా ! వారు కోరనివారు అని వీరు చెప్పు చునేయున్నారు. ఆకోరనివారికి వాంఛమాత్రమున్నదని వీరెట్లు చెప్పగలరు ? వాంఛలేక కోరనివారిలో వారెందుకుచేరరు ? వారు ఆకోరనిది పురుషసంబంధమే కదా ? అయితే యిప్పుడు 'వారు పురుష సంబంధవాంఛలేనివార'ను మాటలో వీరి యాక్షేప మేమున్నది ?

సత్యవతికి ఆవాంఛకలదనుటకు విమర్శకులెత్తుకొనిన వాక్యము లను గూర్చి మేము చెప్పుచున్నాము—

ఒకానొకప్రబలుని నిర్బంధమునకు లోనయి అట్టి యిచ్ఛలేనట్టి వ్యక్తితాత్కాలికములైన అభ్యంతరములను తన అనర్హతను చెప్పు

తప్పించుకొనుటకు ప్రయత్నించును. వాని కన్నిటికి సముచితపరిహార ముల నాతడుప్రదర్శించినపుడును, ఆవ్యక్తి ఎంతదుర్లభవిషయమును వెల్ల డించినను, దాని నాతడు అతిసులభముగా ఘటింపజేసినపుడును, ఆవ్య క్తికి తన నిర్బంధమును బట్టి వచ్చుదోషమును తానే తొలగించు నమ్మ కమును నిస్సంశయముగా కలిగించినపుడును, ఆవ్యక్తి అప్రిజలుని కథీన ముకాక తప్పని దగును.

ఇట్టి స్థితియే సత్యవతికి పరాశరునివలన ఘటించినది. ధర్మజ్ఞ మూర్ధన్యుడగు పరాశరముని ఒకప్పుడు పడవ నడుపుచున్న సత్యవతిని చూచి ఆకస్మికాభిలాషకు లోనయి అప్పుడు తన నిమిత్తమున ఆమె యందు ఒక మహాపురుషుడు జన్మింపనున్న విధిని గుర్తించి తన అని వార్యాభిలాష నామెకు వెల్లడించెను. అప్పుడామె దాశకన్యను నేనని చెప్పినది; అందరు జూచుచున్నా రనినది; అని నంతట ముని చీకటి గల్పించెను. ఆమె దాని కాశ్చర్యపడి వ్రీడితురా లయ్యెను.

ఆపై నాది చేపకంపు గొట్టుచున్న శరీర మనినది. అనినంతలో నామె శరీరమునకు సౌగంధ్యము గలిగించెను. తరువాత—

"విద్ధి మాం భగవన్ కన్యాం...త్వత్సంయోగాచ్చ దుష్యేత' కన్యా భావో మమానఘ' కన్యాత్వే దూషితే వాపి కథం శక్ష్యే ద్విజో త్తమ। గృహం గన్తు మృషే చాహం ధీమన్నస్థాతుముత్సహే ॥
టీ. స్థాతుం జీవితుం నోత్సహే ॥"

మహనీయా! నేను కన్యను; నీసంబంధమున నాకన్యాత్వము దూషిత మగును; అట్టిస్థితిలో నేనింటి కెట్లు వెళ్ళగలుగుదును? దూషితమైన కన్యాత్వముతో నేను జీవింపజాలను. అనినది.

అప్పుడు 'ఉవాచ మత్ప్రియం కృత్వా కన్యైవత్వం భవిష్యసి" అనంతరమందు నీవు మరల కన్యవే అగుదువు. అని ముని వర మిచ్చెను.

ఇట్లు ఆమె చెప్పిన అభ్యంతరములు పరిహరింపబడినవి. ఆమె యోజనగంధిగా చేయబడినది; పునః కన్యాత్వవరముకూడా అనుగ్ర హింపబడినది; అప్పుడామె మునిని ప్రత్యాఖ్యానము చేయజాలనిదైనది. ఇది ఇట్లు చెప్పబడినది—

"త మహం శాపభీతా చ పితు ర్భీతా చ భారత।
వరై రసులభై రుక్తా న ప్రత్యాఖ్యాతు ముత్సహే॥
అభిభూయ సమాం బాలాం తేజసా వశ మానయత్। (ఆది.అ.105)

టీ. బాలాం పుంయోగ మనిచ్ఛన్తీం బాలా మివ।"

సత్యవతి భీష్మునియొద్ద చెప్పుచున్నది—ఆముని కోరినట్లు చేయుటకు తండ్రివలన భయము, చేయకుండుటకు మునిశాపమువలన భయము కలదాననై దుర్లభములైన వరములచేత ప్రలోభితురాలనై ఆమునిని ప్రత్యాఖ్యానము చేయుటకు 'నోత్సహే' ఉత్సహింపలేక పోతిని. అని.

ఇక్కడ 'న ప్రత్యాఖ్యాతు ముత్సహే' అను మాటకు విమర్శకులు అర్థ మిట్లు సెలవిచ్చినారు—

"నేనందుల కడ్డుచెప్ప కుత్సాహముతో నంగీకరించితిని. లోభపడుటయు, నుత్సాహముతో నడ్డుచెప్పుట కిష్టపడకుండుటయు జరిగినది." (పు. 29)

ఇక్కడ మేమడుగుచున్నాము-'న ప్రత్యాఖ్యాతు ముత్సహే' ఈ మూడుపదములలో 'ఉత్సాహముతో నంగీకరించితిని' అని చెప్పిన మీఅర్థము ఏపదమునకు చెందినది? 'ఉత్సహే'ను చూచి ఉత్సాహముతో అని వ్రాయవచ్చు ననుకొనిరా! 'అంగీకరించితిని' దీని నెక్కడనుండి తెచ్చినారు? తోచినట్లు మాటలాడువారి ధోరణి యిదియే. మీమనసులోని విషయమును శ్లోకమున కల్పించుటకాదు. శ్లోకములోని విషయమును మీమనసున కల్పించుకొనవలెను.

'శాపభీతినిబట్టియు, వరములనుబట్టియు మునిని ప్రత్యాఖ్యానము చేయుట కుత్సహింపలేకపోతిని' అనుటలో ఆమె ప్రత్యాఖ్యానమునకే ఉత్సహించి (పూనుకొని)నట్లును, శాపభయ-వరదానములచే తుదకాప్రత్యాఖ్యానమున కుత్సహింపలేకపోయినట్లును, ప్రత్యాఖ్యానమున కుత్సహించిన నాకు శాపభీతి-వరదానములు ప్రతిబంధకములై వచ్చినపడెను అనినట్లును స్పష్టమగుచుండ ఉత్సాహముతో నంగీకరించినదనుట హేయము.

విమర్శకు లింకొకటి వ్రాసినారు—'బాలాం పుంయోగ మనిచ్ఛన్తీం బాలామివ' ఇవశబ్దము ప్రౌఢత్వమును సూచించుచున్నది."
(పు. 29)

ఈవ్రాత విరుద్ధము—ఇక్కడ 'బాలామ్' అనుదానికి 'బాలామివ' అని నీలకంఠులు వ్రాసిరి. అట్లు వ్రాయుటకు దీని పూర్వశ్లోకములో 'గతా ప్రథమయౌవనమ్' అని యున్నందున దానిని సరిపుచ్చుటకై 'బాలామివ' అని వ్రాయబడినది.

దీనికి బాలవంటిదని యర్థము. ఆబాలాసాదృశ్యము పుంయోగేచ్ఛ లేకుండుట అని నీలకంఠులు వ్రాసియున్నారు.

ఆనీలకంఠులు తన 'బాలామివ' మాటలోని 'ఇవ' శబ్దమునకు పుంయోగేచ్ఛ లేకుండుటను చెప్పగా, విమర్శకులు 'ఇవ' శబ్దము ప్రౌఢత్వమును సూచించుచున్నది.' అనుట అయుక్తము.

మూలములో 'ఇవ' లేదు. అందున్న బాలాశబ్దమునకు ప్రౌఢత్వమర్థమూ కాదు. టీకలోని 'ఇవ'కు 'పుంయోగ మనిచ్ఛన్తీ' అని టీకాకారులే వ్రాసినందున వీరి ప్రౌఢత్వమూ దాని కర్థముకాదు. వీరిది విరుద్ధధోరణి ఇట్లు చూడగా సత్యవతీదేవి దనిచ్ఛయే. వీరిది స్వేచ్ఛావాదమే

సత్యవతీపరాశరుల గాథలోని సారాంశము—

"సంశయోఽత్ర న కర్తవ్య స్సంభవే మునిసత్తమాః ।
మహతాం చరితే చైవ గుణా గ్రాహ్యా మునే రితి ॥
కారణాచ్చ సముత్పత్తి స్సత్యవత్యా ఝషోదరే ।
పరాశరేణ సంయోగః పున శ్శంతనునా సహ ॥
అన్యథా తు మునే శ్చిత్తం కథం కామాకులం భవేత్ ।
అనార్యజుష్టం ధర్మజ్ఞః కృతవాన్ స కథం మునిః ॥
స కారణేయ ముత్పత్తిః కథితాఽఽశ్చర్యకారిణీ ।
శ్రుత్వా పాపాచ్చ నిర్ముక్తో నరో భవతి సర్వథా॥" (దేవీభా. 2.2)

సూతు డుపదేశించుచున్నాడు— సత్యవతీపరాశరులవలన గలిగిన వేదవ్యాసుని అద్భుతజన్మనుగూర్చి సంశయింపకుడు.

మహాపురుషచరిత్రములోని గుణములు గ్రహింపవలెను. ఒకా నొక కారణవిశేషమున మత్స్యోదరమునుండి సంభవించినది సత్యవతీదేవి. ఆమెకు పరాశరునితో సంబంధము. పునః కన్యాత్వమును బట్టి శంత నునితో వివాహము జరిగినది.

దృష్టము కానట్టి ప్రబల కారణము లేనియెడల మునిచిత్తము కామాకుల మెందు కగును? ధర్మజ్ఞుడైన ముని అనార్యకృత్యము నెట్లు చేయ బూనును? ఆశ్చర్యకరమైన ఈవేదవ్యాసుని యుత్పత్తి ప్రబలకారణముపై నాధారపడియున్నది. దీని శ్రవణముచే పాప విముక్తి యగును. అని.

ఇక కుంతికి పుంయోగేచ్ఛ అను విమర్శకుల వ్రాత—

"తస్యై స ప్రదదౌ 'మంత్రం' అనుచోట యెట్టికోరికలు లేనిది కుంతి అని వ్రాసినారు కథకులు...చూతము—

'తతః ప్రీతమనా భూత్వా...బ్రాహ్మణోఽబ్రవీత్...వరాణ వృణీష్వ కల్యాణి...కుంత్యువాచ...కృతం విప్ర వరై ర్మమ... ...యది నేచ్ఛసి మత్త స్త్వం వరం... ఇమం మంత్రం గృహా ణ త్వం— (పు. 30)

ఇక్కడ విమర్శకు లనున దేమి? వీరు చూపిన వాక్యములే కుంతి ఎట్టి కోరికలు లేవని చెప్పినపుడు మంత్ర మివ్వబడె నని ప్రకటించుచు న్నవికదా? ఇప్పుడుమాతత్త్వకథనము చెప్పినది నిజమే అయినది. 1"ఈమె అనిచ్ఛ,శాప-బంధు-భీతి-లజ్జా కారణములుగా కలిగినదికాని పురుషసంబంధవాంఛలేని యీడుదను కారణము కాదు. 2 తగిన పుత్రునొసగు నను ధైర్యము కలుగగనే అంగీకరించినది. 3 కావున నిట శ్రీశాస్త్రిగారి అనిచ్ఛావ్యాఖ్య పొరబాటలవాటనక తప్పదు." అట (పు. 31)

ఇక్కడ చెప్పుచున్నాము—ప్రథమాంశము–కుంతికి అనిచ్ఛను వీరును అంగీకరించియే దానికి గొన్ని కారణములు చెప్పిరి. అందు మొదటిది శాపభీతి. ఇది ఆమె అనిచ్ఛను గమనింపజేయునా? ఇచ్ఛను గమనింపజేయునా? ఆమె కట్టి యిచ్ఛయే యున్నపుడు శాపమున కవ

సరమేమి! ఇక రెండవది బంధుభీతి. ఇక్కడ చెప్పవలసియున్నది. ఇచ్ఛ లేనిదే ప్రవృత్తి కలుగదు. ఇష్టసాధనతాజ్ఞానము లేనిదే ఇచ్ఛ కలుగదు. ఆమెకున్న బంధుభీతి అది అనిష్టావహమని జములగా ఆమె కనిపింప జేసె నన్నమాట. అప్పు డిష్టసాధనతాజ్ఞానము కుంఠిత మగును. అప్పు డామెకు ఇచ్ఛ యెట్లు? ఇచ్ఛలేని ఆమె శాపభీతిచేత అట్లు బద్ధురాలై పోయినదని సారాంశము. కనుక విమర్శకులు చెప్పిన కారణములే ఆమెది అనిచ్ఛ అని ధ్రువపరచుచున్నవి.

ఆపై కుంతిది పురుషసంబంధవాంఛ లేనట్టి ఈడే అని వెనుక నిరూపింపబడినది కూడను.

ద్వితీయాంశము—'తగినపుత్రు నొసగు నను ధైర్యము కలుగగనే అంగీకరించిన'దట !

అయితే వీరు కల్పించు పుంయోగేచ్ఛకు ఇంద్రియప్రీతి ఫలము కాదన్నమాటే. ప్రతివాదిమతములో అవివాహితయైయున్నపుడు ఆమెకు స్వతః పుత్రాపేక్ష గల్పించుట అవినీతియే. సిద్ధాంతములో ఆమె బాల్యమున కాపుత్రాపేక్ష అసంభవమే. కాబట్టి కుంతీదేవి దనిచ్ఛయే. విమర్శకులది స్వేచ్ఛాజల్పితమే.

తృతీయాంశము—విమర్శకులు వ్రాసినట్లు 'పొరబాటలవాటనకతప్పనిది' తమ స్వేచ్ఛాజల్పితమె కాని అనిచ్ఛావ్యాఖ్యకాదు. ఈవిషయము నిరూపితమైనందున విమర్శకుల వ్రాత నిరస్తమైనది. కుంతీ సత్యవతులకు పుంయోగేచ్ఛ లేనపుడే సూర్యపరాశరులచే పుత్రోత్పాదనము కావింపబడిన దను వ్యాఖ్య నిరాక్షేపమైనది.

— 'సంఘర్షజననశ్లోకాక్షేపసమీక్ష —

విమర్శకుల వ్రాత యిట్లున్నది—

"గుహ్యా మేత త్తు దేవానాం కథయిష్యామి తేఽనఘ ।
క్షత్రింస్స్వర్గం కథం గచ్ఛే చ్ఛస్త్రపూత మితి ప్రభో ॥
సంఘర్షజనన స్తస్మా త్కన్యాగర్భో వినిర్మితః ।"

1. క్షత్రియత్వము శస్త్రధారణమున పూతమైనపుడు స్వర్గమన మెట్లని శంకించుటయు, కుంతీగర్భమువలన సిద్ధించు నని చెప్పు

టయు సారస్యమా ? 2 కర్ణార్జును లిరువుర సహాయము నున్నచో వాసవు నైనను జయించగలుగుదును అనిన ధర్మజునితో నారదుడు నీకొరకే యీకర్ణజననము అనుటలో గల ఔచితి యేమి ? ధర్మ రాజుకొరకే ఈఏర్పాటు జరిగినచో సంఘర్షజననము వైరాగ్యోద్దీపనమునేల కలిగినవి ? 3 సంఘర్షణమునకు వైరాగ్యోద్దీపన పర్థమా ? సంఘర్ష మనిన కలయిక వాడుకలో నున్నది. 4 కథకులు వైరాగ్యోద్దీపకమనినారు—కపిత్థ్యయము కావలె ననుకొని నారుకాబోలు. 5 'సన్తి దేవనికాయా శ్చ సంకల్పా జ్జనయన్తి యే! వాచా దృష్ట్యా తథాస్పర్శా త్సంఘర్షేణేతి పంచధా ।' (ఆశ్రిమ.)

ఈసంఘర్షజననమే పయిన దెల్పబడినది. వ్యాఖ్యాతగారి వైరాగ్యోద్దీపనము కాదు. వ్యాఖ్యాత ముందున్న సంఘర్షము నెరుగనివాడు. ఇట్టి కువ్యాఖ్యలు పాఠకుల బెడదోవను బట్టింపవా !" (పు. 36.37) అట !

ఇక్కడ వీరికి చెప్పుచున్నాము—ప్రథమాంశము—

పై నుదాహరింపబడిన శ్లోకములకు తాత్పర్య మిది—ధర్మజునితో నారదమహర్షి చెప్పుచున్నాడు—దేవతల రహస్యమును నీకు చెప్పుచున్నాను. క్షత్రియు శస్త్రపూతమై స్వర్గము నెట్లు పొందునా అని యాలోచించి ఆనిమిత్తమున సంఘర్షజననమైన కన్యాగర్భము నిర్మిత మైనది. అని. ఇందు విమర్శకు లన్నట్లు 'స్వర్గమన మెట్లని శంకించుట' ఇంకొకరు సమాధానము చెప్పుట మొదలగునవి లేనందున నది పరాస్తమైనది.

ద్వితీయాంశము—"కర్ణార్జున సహాయోఽహం జయేయ మపి వాసవమ్" (శాన్తి. అ. 1) "గుహ్యా మేతత్తు దేవానాం కథయిష్యామి తేఽనఘ" (శాంతిఅ.2) నీలకంఠీయము-'కర్ణార్జునసహాయుడనై వాసవు నైన జయింపగలుగుదు నని నీవనుట నిజమేకాని, ఈకర్ణార్జునులకు దేవతలచేత వైర ముత్పాదింపబడినది. అది యేమనగా—"గుహ్యా మేతత్తు దేవానాం కథయిష్యామి తేఽనఘ" ఇట్లు గ్రంథమం దున్నది కాని, విమర్శకు లన్నట్లు 'ధర్మజునితో నారదుడు నీకొరకే ఈకర్ణజననము' అని చెప్పినట్లు లేనందున నిదియు నిరస్తమైనది.

తృతీయ-పంచమాంశములు-నీలకంఠీయము—

"సంఘర్షజననో వైరాగ్యోద్దీపకః కన్యాగర్భో దేవైః పుత్రస్య స్వర్గమనాయ నిర్మిత ఇత్యర్థః"

అనియుండగా విమర్శకులు 'సంఘర్షజననమునకు వైరాగ్యోద్దీపన మర్థమా? అని గదమాయించుచున్నారు.

"స్పర్ధ సంఘర్షే, సంఘర్షః పరాభిభవేచ్ఛా' ధాతుపాఠము. "సంఘర్షః స్పర్ధా. సంస్పర్శః' సర్వశబ్దసంబోధిని. "స్పర్ధా వీరప్రతివీరవివాదః, సర్వశబ్దసంబోధిని.

ఇట్లుండుటనుబట్టి ఇక్కడ స్పర్ధార్థక మగు సంఘర్షశబ్దమునకు వైరాగ్యోద్దీపనమే యర్థమని మాసమాధానము.

విమర్శకు లనిన 'కలయిక' ఇక్కడ సరిపడదు కర్ణార్జునులలో కలయిక గోచరించెనా? వైరాగ్యోద్దీప్తి గోచరించెనా? అది యైనను వీరి మనస్సునకు రాకుండుట చింత్యము. విమర్శకు లుదాహరించిన పంచమాంశములోని శ్లోకములో, చూపబడిన సంఘర్షము స్పర్ధార్థకము కాదు. అక్కడ సందర్భ మేమనగా-దేవతలు సంతతిని సంకల్పము చేతను, వాక్కుచేతను, దృష్టిచేతను, స్పర్శచేతను, సంఘర్షము చేతను, కలిగింతురు. అని. ఇక్కడ సంఘర్ష మన కలయిక, ఇది సంఘర్షజననః అనుచోట అతుకదు. ఆకలయిక, కర్ణార్జునులలో అసంభవ మగుట కూడ కారణము.

ఇట్లుండ విమర్శకులు 'ఈసంఘర్షజననమే (కలయికయే) పయిన దెల్పబడినది. వ్యాఖ్యాతగారి వైరాగ్యోద్దీపనము కాదు. వ్యాఖ్యాత ముందున్న సంఘర్షము నెరుగని వాడు. ఇట్టి కువ్యాఖ్యలు పాఠకుల బెడబోత్రవను బట్టింపవా ?' అనిరి.

కువిమర్శమీవిమర్శకులదా? కువ్యాఖ్య ఆనీలకంఠులదా? పాఠకుల బెడతోత్రవను బట్టించునది వీరి విమర్శమా? వారి వ్యాఖ్యానమా? ఈనీలకంఠీయ దూషకుల కీపెడదారి యేలవచ్చినది. వీరికిది నీలకంఠాచార్యదూషణఫలితమే. భారతహృదయమును భారతగ్రంథసమన్వయ పద్ధతిని తెలిసికొన నవసరములేనివారికి నీలకంఠీయముతో బని యేముండును ?

వీరికిని నీలంఠులకునుగల అంతరమును గుర్తింపగల పాంశకమహో శయులదే ఎరుగని వారెవరో నిర్ణయింపగల భార మని విన్నవించుచు అసంగతమైన వీరి 3. 5 అంశములు త్రోసివేయుచున్నాము.

చతుర్థాంశము—'వైరాగ్యోద్దీపక మనినారు. కప్రిత్యాయము కావలె ననుకొనినారు కాబోలు! అట.

ఈవిమర్శకులు 'వృద్ధకుమారీతి తు గౌణః' "అనుతత్త్వబోధినీ సూత్రము"...అనువ్రాతలోను (పుట.2) రజోచిహ్నాం' (సంభవితబుతుం) (పు. 1౬) అను ప్రయోగములలోను తమవ్యాకరణపరిజ్ఞానమును బయట బెట్టుకొనుటేకాక ఇక్కడ ఈమాటలలోకూడ దానిని బయట బెట్టుకొనినారు. 'వైరాగ్యోద్దీపకము' ఇక్కడ కప్రిత్యయము చేయబడినదో, లేక మరియొకప్రిత్యయము చేయబడినదో వ్యాకరణపండితుల నడిగి తెలిసికొనవలసినదని చెప్పుచు అసంబద్ధమైన వీరి వ్రాత త్రోసి వేయుచున్నాము.

—వనపర్వగ్రంథాక్షేపసమీక్ష—

విమర్శకుల వ్రాతయిట్లున్నది—

1 "పాతాళవాసులైన దైత్యదానవులు వైతానకర్మజనిత కృత్యచే దుర్యోధనుని దమ సన్నిధికి దెప్పించుకొని...రనుచు శాస్త్రిగారధర్వవేదోక్తప్రిక్రియను హోమక్రియ నడిపింప బడినట్లు వ్రాయించిరి. కాని వ్యాఖ్యాత మాత్రము ఆక్రియ 'నతుత్రియారూపమ్' వేదసమ్మతము కాదనినాడు. ఆధర్వణిక మనుచు వేదరూపము కాదనుట యెట్లు? ఆధర్వము వేదము కాదని అభిప్రాయపడినట్లున్నాడు.

2 కర్మను నడిపినవారు దైత్యదానవులు—బహువచనము. చక్రిః క్రియ బహువచనము. కర్మసిద్ధ్యనంతరము పుట్టిన కృత్య'రాజన్ కిం కరోమి'అనును. ఏకవచనప్రయోగ మెట్టిది? రాజుగ బిలిచిన దెవరిని?

3 శాస్త్రిగారి కథనములో కొన్ని శ్లోకము లియబడినవి...... ఈశ్లోకములన్నియు యోగ్యములును ముఖ్యములు నని భారత మున చేరినవి.

ఇది (దైత్యదానవులు పురిగొల్పుట) కల కానోపు. కలను నిజ మని దుర్యోధనుడు నమ్మగ శాస్త్రిగారును నమ్మినారు...'' (పు.38.39)

వీరికి చెప్పుచున్నాము-ప్రథమాంశము- ''వైశంపాయన ఉవాచ-పాతాళవాసినః... దుర్యోధనస్య వై ఆహ్వానాయ తదా చక్రుః కర్మ వైతానసంభవమ్'' (వన. అ. 251)

నీలకంఠీయము— ''వైతానసంభవమ్ అగ్నివిస్తారసాధ్యం నవ కుండ్యాదివిధాన మాథర్వణికం నతు త్రయీరూపమ్ ।''

ఇక్కడ విషయ మేమనగా ఘోషయాత్రలో దుర్యోధనుడు గంధర్వపరాభూతుడును, పాండవరక్షితుడు నయి అచింత భరింప లేక మరణింపదలచి ప్రాయోపవేశనమునకు సిద్ధపడినపుడు పాతాల వాసులగు దైత్యదానవులు ఆదుర్యోధనుని తమ దగ్గరకు రప్పించుకొని బోధింపనెంచి దానికి సాధనముగా నొక కర్మ వారు చేసినా రనియు, అది వైతానసంభవకర్మ అనియు మూలములో చెప్పబడినది.

ఇక్కడ వ్యాఖ్యాత ఆకర్మ అథర్వవేదోక్త—నవకుండ్యాదివిధాన మనియు, త్రయీ (ఋగ్యజుస్సామ)రూపము (ప్రతిపాద్యము) కాదనియు చెప్పియుండెను. అంతియకాని అది విమర్శకు లను కొనినట్లు 'వేదసమ్మతము కాదని' వేదరూపము కాదని, అథర్వము వేదము కాదని' ఏమియు చెప్పియుండలేదు. అట్లు చెప్పుటకు ఆవ్యాఖ్యాత చతుర్వేదపాండిత్యప్రతిభకలవాడుకాని, వీరివలె నేమియు తెలియనివాడా ? కనుక నిది పరాస్తము.

ద్వితీయాంశము— 'కర్మను నడిపినవారు దైత్యదానవులు—బహు వచనము. కర్మసిద్ధ్యనంతరము పుట్టిన కృత్య, 'రాజన్ కిం కరోమి' అనును. ఏకవచనప్రయోగ మెట్టిది ? రాజుగ బిలిచిన దెవరిని ?' అనిరి విమర్శకులు.

ఔరా! వీరెంత భ్రాంతులో! వీరు శ్లోకముల నిట్లర్థము చేసి కొందురుకాబోలు. వీరికి చెప్పుచున్నాము—

'రాజన్ కిం కరోమి' అని యున్నశ్లోకమునకు పూర్వము 8 శ్లోకము లున్నవి. వానికి మొదట 'వైశంపాయన ఉవాచ' అని

యున్నది. అందుచేత నది జనమేజయమహారాజునకు చెప్పఁబడుచున్న విషయము. ఇప్పుడు చూడుడు—

"కర్మసిద్ధా తదా తత్ర జృంభమాణా మహోద్భుతా ।
కృత్యా సముత్థితా రాజన్ కిం కరోమీతి చాబ్రవీత్ ॥"

ఇక్కడ, 'హే రాజన్=ఓ జనమేజయా! 'కృత్యా సముత్థితా కిం కరోమీతి చాబ్రవీత్' కృత్య ఆవిర్భవించి నేను చేయున దేమని అడిగెను. అని యర్థము. దీనికి మీరు ముందువెనుకలు చూచుకొనక కుండ 'రాజన్ కిం కరోమి' అని అసంబద్ధముగా ముడిపెట్టి ఆక్షేపింతురా? ఇట్టి పరిజ్ఞానముతో తాము వ్యాఖ్యాతపై గద్దరింతురా? ఆ వ్యాఖ్యాతది కువ్యాఖ్య యందురా? ఆవ్యాఖ్య పాఠకులను పెడ దోవ బట్టించు నందురా? ఇది తమకు భావ్య మనిపించినదా? చాలు. చాలు. మీ కెంతజ్ఞానము కలదో దీనితో విస్పష్టమైనది.

తృతీయాంశము— ఘోషయాత్రానిమిత్తమున దుర్భరపరాభవఖిన్నుడగు దుర్యోధనుడు కర్ణశకునిప్రభృతులెంత చెప్పినను వినక మరణింప నిశ్చయించి ప్రాయోపవేశనమునకు కూర్చుండునప్పుడు దైత్య దానవులు తమ దగ్గరకు రప్పించుకొని ఆతనికి బోధించి మరణింపకుము. మేమందరము నీపక్షముననుండి పాండవసంహారమూలమున దేవపక్షము నోడించుటకు బూనుకొనినాము. ఈ యీ విధముగా మేము సహాయ పడెదము. అని గట్టిగా చెప్పి దుర్యోధనున కుత్తేజనము కలిగించి పంపగా నాతడు హస్తినాపురమునకు బయలుదేరి వెళ్ళెను. అని బోధించు మూలశ్లోకములు మా తత్త్వకథనములో నుదాహరింపబడినవి. వానిని గూర్చి విమర్శకు లిట్లనినారు— 'శాస్త్రిగారి కథనములో కొన్ని శ్లోకము లీయబడినవి. ఈ శ్లోకములన్నియు భారతమున చేరినవి. 'ఇది (దైత్యదానవులు పురికొల్పుట) కల కానోపు. కలను నిజమని దుర్యోధనుడు నమ్మగా శాస్త్రిగారును నమ్మినారు' అని.

వీరి కిక్కడచెప్పుచున్నాము— దుర్యోధనుడు నిజమని నమ్మినది కలను కాదు. దైత్యదానవుల వాక్కులను.

"తై ర్విసృష్టం మహాబాహుం కృత్యా సైవానయ త్పునః।
ప్రతినిక్షిప్య తం వీరం కృత్యా సమభిపూజ్యచ॥
అనుజ్ఞాతాచ రాజ్ఞా సా తత్రైవాఽన్తరధీయత।
గతాయా మథ తస్యాంతు రాజా దుర్యోధన స్తదా॥
స్వప్నభూత మిదం సర్వ మచిన్తయత భారత।"

ఆ దైత్యదానవులు విడిచిపెట్టిన దుర్యోధనుని ఆకృత్య యథా స్థానమునకు చేర్చి అనుజ్ఞదీసికొని అంతర్ధానమైనది. ఆమె అంతర్ధానమైన తరువాత ఈ విషయమునంతను స్వప్నభూతముగా నాతడు తలచెను.

స్వప్నభూతమనగా అనుకొననట్టిది జరుగుట. రెండవకంటి వాడెరుగకుండ జరుగుట. అని యర్థము. నిద్రావస్థలోనిది కల. దుర్యోధనుడు నిద్రించినట్లుకాని నిద్రనుండి మేల్కొని ఆవిధముగా నను కొనినట్లుకాని యున్నదా? కనుక దుర్యోధనుడు వారి వాక్కులనే నమ్మినాడు కాని కలను నమ్మలేదు. అతనికి కల రాలేదు. దుర్యోధనుడే నమ్మని కలను శాస్త్రిగారు నమ్మెదురా?

కలను నిజమని దుర్యోధనుడు నమ్మినట్లు కల్పించినారు మీరు. ఆకల్పనతో దుర్యోధనుని ఆ ప్రాయోపవేశమునుండి చులకనగా లేవదీసి పురమునకు సపరివారముగ బంపినవారు మీరు. కర్ణాదుల మాటలను ధిక్కరించి ప్రాయోపవేశమునకు గూర్చుండినవాడు కలను నమ్మి కొని లేచి వెళ్ళినట్లు చెప్పినవారు మీరు.

అయితే మీ రే యే విషయములను కలయని చెప్పుదురో అవి మూలశ్లోకోక్తములేనా? అప్పుడు కలకు ఆధారముగా మీ రాశ్రయించెడి ఆశ్లోకములు 'భారతమున చేరినవి' అని యెట్లు వ్రాసినారు! మీకును అవియే గతికదా?

నీలకంఠాచార్యసమ్మతములు, ఆంధ్రభాగవతసమ్మతములు, శ్రీకృష్ణభారతసమ్మతములునగు ఆశ్లోకములన్నియు భారతమున లేనివే చేరిన వందురా? మీరా నిర్ణేతలు? చాలు చాలు.

దుర్యోధనునిది కల కాదు; మీవి కలవరింతలు; సందర్భశుద్ధి యుండని కలవరింతలు గ్రాహ్యములు కావు. గనుక దీనికి సంబంధించిన మీమాటలు త్రోసివేయబడినవి.

ఈదైత్యదానవప్రబోధములోని విషయమునే ఎత్తుకొని మరి యొకటి విమర్శకు లిట్లు వ్రాసినారు—

"1 మహేశ్వరుడును పరమేశ్వరియు... అస్త్రశస్త్రములతో నూర్ధ్వశరీరమును, పుష్పములతో నథఃకాయమునుగ దుర్యోధనుని సృష్టించినారు. పైన పురుషుడు క్రింద యువతి...... 2 ఇట స్త్రీమనోహరరూపము కలదని దుర్యోధను నథఃకాయము చెప్ప బడినది. 3 అస్త్రశస్త్రమయశరీరమును బుష్పమయశరీర మెట్లు ధరించుచుండెడిదో... తెలుపవలెను. 4 ఇట్టి డాంబిక నీచ కల్ప నముకల శాంతిపర్వభాగము నౌచితీయుత మని బుద్ధిమంతులూ హించవలసినదియేనా ? శాస్త్రిగారివంటి పండితులు... ఇట్టి సందర్భ శూన్యములగువాని నూతగ గొని పాఠకుల నూత ద్రోయుట తగునా ?" అని. (పు. 40.41)

ఇక్కడ చెప్పుచున్నాము—ప్రథమాంశము—దైత్యదానవులు దుర్యోధనునితో నిట్లు చెప్పుచున్నారు—

'పురా త్వం తపసాఽస్మాభి ర్లబ్ధో రాజ న్మహేశ్వరాత్ ।
పూర్వకాయశ్చ సర్వ స్తే నిర్మితో వజ్రసంచయైః ॥
అస్త్రై రభేద్య శ్శస్త్రై శ్చాప్యథఃకాయశ్చ తేఽనఘ ।
కృతః పుష్పమయో దేవ్యా రూపతః స్త్రీమనోహరః ॥
ఏవ మీశ్వరసంయుక్త స్తవ దేహో నృపోత్తమ ।
దేవ్యాచ రాజశార్దూల దివ్య స్త్వంహి న మానుషః॥ (వన. అ.252)

మేము తపస్సుచేసి పార్వతీపరమేశ్వరులవలన నిన్ను సంపాదించు కొనినాము. నీయూర్ధ్వకాయము శస్త్రాస్త్రముల కభేద్యమగునట్లు వజ్రమయముగ నీశ్వర నిర్మితమును, అథఃకాయము పుష్పమయముగ నీశ్వరీనిర్మితమును నయి నీదేహము సౌందర్యముచే స్త్రీమనోహరమై యున్నది. నీవు దివ్యపురుషుడవు కాని, మనుష్యమాత్రుడవు కావు. అని.

దీనికి విమర్శకులు—"పైన పురుషుడు క్రిందయువతి" అనిరి. వీరి విరుద్ధదృష్టికి చెందిన దీనిని త్రోసివేసినాము.

ద్వితీయాంశము— 'ఇటస్త్రీమనోహరరూపముకలదని దుర్యోధను నధఃకాయము చెప్పబడినది' అనిరి. ఇక్కడ రూపమన సౌందర్యము. అది అధఃకాయమునకు చెప్పబడినదని వీరికి తోచుట శోచనీయము.

తృతీయాంశము—అధఃకాయమునకు సౌందర్యము చెప్పబడినదని వీరి కెట్లు తోచెనో! అధఃకాయ మెట్లు ఊర్ధ్వకాయమును ధరించుచుండెడిదో అనుశంకయు నట్లు తోచినదే. ఇట్టివానికే చొప్పదంటిప్రశ్నలని పేరు.

'చతుర్థాంశము-'ఇట్టి డాంబికనీచకల్పనముకలశాంతిపర్వభాగము సౌచితీయుతమని బుద్ధిమంతు లూహించవలసినదియేనా?' అనిరి.

వీరి యీవ్రాత చిత్రముగా నున్నది— వీ రనినట్లు చూచినను వీరికి తోచిన డాంబికనీచకల్పనము వనపర్వభాగమునకు చెందియుండ శాంతిపర్వభాగమునకు అగ్రిహ్యాత నసంబద్ధముగా జెప్పుట, "పృష్ఠతాడనా ద్దన్తభంగః" అన్నట్లున్నది. వీరేమి వ్రాయుచున్నదియు చూచుకొనకుండ కేవలాహంకారపూరితులై నడుము కట్టినట్లు కనబడుచున్నది. ఇట్టి వారి మాటల కౌచిత్య మెట్లుండును ?

"శాస్త్రిగారివంటి పండితులు సందర్భశూన్యముల నూతనగొనవచ్చునా ?" అనిరి. పండితు లూతగ గొనినవి సందర్భశూన్యములు కానేరవు. సందర్భశూన్యములైనవి పండితు లూతగ గొనునట్టివి కానేరవు. కనుక వీరి వ్రాత పరాస్తము.

—॥ నీలకంఠీయదూషణసమీక్ష ॥—

విమర్శకుల వ్రాత యిట్లున్నది—

1 "తస్మై స ప్రదదౌ మన్త్ర మాపద్ధర్మాన్వవేక్షయా॥"(ఆది.అ111)

టీ. 'భావిసంతానప్రతిబన్ధస్య అనాగతావేక్షణేన' అని వ్యాఖ్యానించినాడు నీలకంఠవేషధారి. ఆపద్ధర్మ మిట్టిదేనా ? భావి=రాబోవు, సంతానప్రతిబన్ధస్య=సంతతియడ్డుకు; అనాగతావేక్షణేన=వచ్చుదానిని చూచుటచేత; అని కదా అర్థము. దుర్వాసు డనాగతావేక్షణశక్తి కలవాడని యర్థము. కుంతికి ముందు కలుగబోవు

సంతానప్రతిబంధక మెట్టిది ? పాండుశాపము కాబోలు. పాండు భర్తృత్వము. శాపము. తద్వరప్రాప్తిని సంతానముఁబడయుట, ఇన్ని ఆపత్తులను నెరిగి దూర్వాసు డిట్టి వరముల నిచ్చెనా ? వర మహిమ యిది కాదు.

2 ఆపద్ధర్మ మన కన్యాత్వమున సంతానము గనుట. అనువీక్షిం చుట అనగా పర్యాలోచించుట, అని అర్థము.

3 "ధర్మస్య జననీ భద్రే భవిత్రీం త్వం శుభాననే' (ఆశ్రమ) ధర్మరాజు పుట్టుకకు ముందే ఆతని తల్లిగ కుంతి చెప్పఁబడినది. వర ములో యముని పిలుచుననియు, ధర్మజుని గనుననియు సూచిం చుట ఔచితియేనా ? యముడు సూర్యునిపుత్రుడు. కర్ణుడు సూర్య జుడు, తండ్రికుమారు లని చూడకుండ కలియుట తప్పుకాదా ? వ్యాసుడుకాని, నీలకంఠుడుకాని ఈధర్మ మధర్మ మనరుకదా!" (పు41-42)

ఇక్కడ చెప్పుచున్నాము— ప్రథమాంశము—

విమర్శకులు చూపిన వాక్యములో 'తస్యై స ప్రదదౌమన్త్రమ్' అనుచు కుంతికి మంత్ర మీయఁబడినట్లుండ 'దుర్వాసు డిట్టి వరముల నిచ్చెనా ? వరమహిమ యిది కాదు' అని వీరంటు రేమి ? వరము మాట పై వాక్యమం దేది !

పైవాక్యమును వ్యాఖ్యానించిన నీలకంఠవేషధారిమాట ఈ విమర్శకవేషధారికి నచ్చలేదట. అది యేమో చూతము—

'తస్యై స ప్రదదౌ మన్త్ర మాపద్ధర్మాన్వవేక్షయా।
.................... అబ్రవీ చ్చైవ తాం మునిః॥
యం యం దేవం త్వ మేతేన మన్త్రేణావాహయిష్యసి।
తస్య,తస్య ప్రభావేణ తవ పుత్రో భవిష్యతి॥' (ఆది-అ111)

మునిచెప్పుచుండెను-కుంతీ! నీవీ మంత్రముచే నే యే దేవత వాహ్వానింతువో ఆ యా దేవతయొక్క ప్రభావముచేత నీకుపుత్రుడు కలుగగలడు. అని. ఇక్కడ 'యం యం' 'తస్య తస్య' అను వీప్సచేత అనేకదేవతలవలన ఆమెకు కలుగనైయున్న అనేకపుత్రులు మునిదృష్టికి గోచరించినా రనవలెనేకాని ఒకదేవతవలన గలుగు నొక పుత్రుడే

గోచరించినా దనుటకు వీలు లేదు. కాబట్టి ఆమెకు ముందు జరుగ బోవు వివాహము, ఆమె పతికి సంభవించు సంతానప్రతిబంధక శాపము, అప్పుడు ఆ యా దేవతల అనుగ్రహమున కలిగెడి పుత్రులునుగూడ మునిదృష్టిలో గోచరించిరేని తత్సాధనముగాగూడ ముని యామెకు మంత్ర మనుగ్రహించె నని చెప్పక తప్పదు. ఈ విషయమే "ఆపద్ధర్మాన్వవేక్షయా" అని మూలమునను "భావిసన్తానప్రతిబన్ధస్య అనాగతావేక్షణేన" అని వ్యాఖ్యానమునను చెప్పబడినది.

ఇట్టిస్థితిలో 'ఇన్ని ఆపత్తుల నెరిగి దూర్వాసు డిచ్చెనా' ? అను వీరిదేమి మాట ? అది వీరికి తెలియగల విషయమా ?

ద్వితీయాంశము— 'ఆపద్ధర్మ మన కన్యాత్వమున సంతానము గనుట అని అర్థమట' ఆపద్ధర్మము అనునప్పుడు ఆపత్తు, ధర్మము, రెండున్నవి. విమర్శకులు చెప్పిన అర్థములో ఆపత్తు ఏది ? ధర్మము ఏది ? ఆపత్తు- కన్యాత్వము, ధర్మము- సంతానము గనుట అందురా ? కన్యాత్వ మాపత్తనుట బాగున్నదా ? ఏది దుఃఖరూపమో ఏది రాకూడనిదో అది ఆపత్తు. కన్యాత్వ మట్టిదా ? ఇక కన్యాత్వమున సంతతి గనుట ఆపత్తని చెప్పుదురా ! అప్పుడు ఆపద్ధర్మములో మరి ధర్మమేది? ఇక ఇట ధర్మశబ్దము స్వభావార్థక మని ఆపద్ధర్మము=ఆపత్స్వభావము అదియే కన్యాత్వమున సంతతి గనుట అందురా యేమి !

అప్పుడు దుర్వాసు డిచ్చిన మంత్రము మీ మతప్రకారము కన్యాత్వమున సంతతిప్రదమై కుంతికి ఆపత్కరమైన దని చెప్పవలసి వచ్చును. సంవత్సరకాలము అనన్యభక్తితో తనకు పరిచర్యచేసిన కుంతి పాలబడి పరమానందముతో ముని యిచ్చిన మంత్రము ఆపత్కరమంత్ర మనుటకంటె అన్యాయము మున్నదా ? ఆమంత్రము ఆపన్నివారక మనవలయును. ఏకరది అసాధ్యము. మొత్తముమీద నీలకంఠీయమును దూషించుచు తగుదునమ్మా అని ఏదో చెప్పవచ్చిన విమర్శకులకు ఆపద్ధర్మమును సరిపుచ్చలేని ఆపత్తు వచ్చిపడినది.

నీలకంఠీయములో నిట్టి చిక్కు లేదు—'ఆపద్ధర్మాన్వవేక్షయా' ఆపద్ధర్మ=ఆపత్స్వభావముయొక్క, భావిసన్తాన ప్రతిబన్ధముయొక్క

అన్వేషయా అనాగత విషయజ్ఞానముచేత ముని మంత్రమిచ్చెను. అనుటలో సంతానప్రతిబంధ మాపత్తు, తన్నివారకముగా సంతానప్రదమైన మంత్రి మీయబడినదని సిద్ధించినది.

అట్టి ఆపద్ధర్మమును ముని యోగదృష్టిచే గ్రహించి సంతానసాధనముగా మంత్రి మిచ్చె ననుటే నిర్దుష్టార్థము. ఇప్పు డొక శంక కలుగవచ్చును.—కుంతికి వివాహానంతరము సంభవించు విషయమును గ్రహించియే మంత్రి మిచ్చినట్లగునుగాని, అప్పటి కర్ణోత్పత్తిని గ్రహించి కూడనిచ్చినట్లు సిద్ధించునా? అని.

"ఘటాయోన్మీలితం చక్షుః పటం న హి న పశ్యతి"

అని న్యాయము. ఘటమును చూచుటకు తెరచిన కన్ను ఘటమునే చూచి తత్ప్రాంతమందున్న పటమును చూడకుండ నుండదు. అట్లే కుంతియొక్క వ్యవహిత భవిష్యత్తును గ్రహించుట కేర్పడిన మునియొక్క యోగదృష్టి సన్నిహితభవిష్యత్తును గ్రహింపకుండ నుండదు. కనుక మునియొక్క ఆపద్ధర్మాన్వేషి పాండవోత్పత్తికి చెందినదిగా మూలములో చెప్పబడినను కర్ణోత్పత్తి అర్థాత్సిద్ధమగును. విమర్శకోక్తిలో మంత్రప్రయోగము కర్ణోత్పత్తి కేకాని పాండవోత్పత్తికి లేకపోవలసివచ్చును.. అది ధర్మస్య జననీ, అనియున్న మూలగ్రంథమునకు విరుద్ధము. ఇప్పుడు విమర్శకు లనిన, నీలకంఠవేషధారి చెప్పినది బాగున్నదో లేక ఈవిమర్శకవేషధారి చెప్పినది బాగున్నదో పాఠకులుగ్రహింతురుగాక.

తృతీయాంశము— తండ్రికుమారు లగు సూర్య-యమ- దేవతలు కుంతియందు ప్రవర్తించుట యుచితమా? అనుటనుగూర్చి—

"ధర్మస్య జననీ భద్రే భవిత్రీ త్వం శుభాననే"

"కుంతి యముని పిలుచుననియు, ధర్మజుని గను ననియు, దుర్వాసుడును, సూచించుట ఔచితియేనా ? తండ్రియగు సూర్యుడును కుమారు డగు యముడును కుంతితో గలియుట తప్పుకాదా? వ్యాసుడుకాని, నీలకంఠుడుకాని, ఈధర్మ మధర్మమనరుకదా?" అట

ఇక్కడ వీరి నడుగుచున్నాము.—ముం దేకార్యము జరుగనైయున్నదో దానిని ముని సూచించుటలో గల ఔచిత్యభంగ మేమి?

ముని సూచించినది జరిగినదా లేదా? ధర్మజుడు యమధర్మదేవునివలన కుంతీసుతుడై జన్మింపలేదా? మీరన్నదే అనుచితము

"అది తప్పు పితాపుత్రి లోకచోట బ్రివర్తింపరాదను ధర్మమును కాదని వ్యాసు డనునా? నీలకంఠు డనునా?" అను మీమాటపై చెప్పుచున్నాము.

అట్లు ప్రివర్తించుట జరిగిన దని చెప్పినది వ్యాసుడు కాదా? 'అట్లు వ్యాసుడు చెప్పడు. అది ప్రక్షిప్తము' అనుట మీ తాత్పర్యమా? అట్లయిన "అహో మూలచ్ఛేదీ తవ పాండిత్యప్రకర్షః" అను వాక్యము మీయందు సార్థక మయినదన్నమాటే.

మీ బుద్ధినిబట్టి మూలమును దిద్దుట, టీకనిబట్టి తలకెక్కుట కుపక్రమించుచు.

పితాపుత్రి లోకచోట బ్రివర్తింపరాదని చెప్పినట్టి వ్యాసుడే సూర్యదేవ– యమధర్మదేవులు అట్లు ప్రివర్తించినవిషయము చెప్పియుండెను. ఇక్కడ దెలిసికొనవలసిన దేమనగా—

అట్లు ప్రివర్తింపరా దనునది మనుష్యవిషయము. ఈ ప్రివర్తించుట దేవవిషయము. అని. మనుష్యధర్మమే దేవధర్మము కాదు. అని. ఈ విషయము వేదవ్యాసులే చెప్పెను—

"మనుష్యధర్మో దైవేన ధర్మేణ న హి దుష్యతి॥"

ఇక్కడ మనుష్యధర్మము వేరు, దేవధర్మము వేరు అని వేదవ్యాసోక్తియే స్పష్టీకరించుచున్నది.

విధినిషేధాత్మకమైన శాస్త్రము మనుష్యాధికారికమేకాని దేవతాధికారికము కాదు. మనుష్యులే కర్మయోనులగుట, దేవతలు భోగయోనులగుట దానికి కారణము. ఈవిభాగ మీ శ్లోకములో చెప్పబడినది—

"దేవాః పతంగాః పశవశ్చ కీటాః
భోగ్యా హి యోని రితి శాస్త్రసిద్ధమ్॥
మనుష్యయోనిః కిల కర్మయోనిః।
నిర్వాణపదవీ మనయా లభన్తే॥" (పురాణవర్మ-పు171)

భోగయోనులలోని పశుపక్ష్యాదులను శాస్త్ర మెట్లు నియమిం పదో అట్లే భోగయోనులగు దేవతలనుగూడ నియమింపనిదై కర్మ యోగులగు మనుష్యులనే నియమించుచు వారికి తరణోపాయప్రద ర్శక మగుచుండును. కనుక ఆ సూర్యదేవ- యమధర్మదేవుల ప్రవృ త్తిలో శాస్త్రవిరోధాపాదనము అయుక్త మని తేలినది.

ఇక నీలకంఠు లనిన దేమనగా—

"సర్వే సర్వాత్మకా దేవా విరజోవయవా యతః ।
సర్వే ఏవ సమా స్సర్వేఽనన్తా ఇతి హి వేదగీః ॥
నచైషాం వ్యభిచారోఽస్తి న చే త్సూర్యయమౌ కథమ్ ।
పితాపుత్రౌ సతీం కున్తీ ముపేయాతాం సురోత్తమౌ ॥
శ్రూయతే న హి వై దేవాన్ పాపం గచ్ఛతి సర్వథా ।
తస్మా ద్యజ్ఞై ర్దేవభావం ప్రార్థయీత నిరేనసమ్ ॥" (ఆది. ప్ర29)

దేవతలు సర్వాత్మకులు, వారి కది తప్పు కాదు. లేకున్న పితా పుత్రులు, సురోత్తములు నగు సూర్యయములు కున్తీసతిని ఎట్లు పొం దుదురు ? దేవతలకు పాప మంట దనియు, యజ్ఞములచేత పాప మంట కుండెడి దేవత్వము పొందదగిన దనియు శ్రుతి చెప్పుచున్నది. అని. ఇది నీలకంఠులు చెప్పిన విషయము.

దీనినిబట్టి మనుష్యులకు వర్తించు విధినిషేధములు దేవతలకును వర్తించు ననుకొనుట పొరబాటని తేలినది.

కనుక సూర్యయము లట్లు ప్రవర్తించుట వారికి తప్పు కాదు. వారట్లు ప్రవర్తించుటను చెప్పు మూలగ్రంథము తప్పు కాదు. భవి ష్యత్తులో వారట్లు ప్రవర్తించుటను యోగదృష్టిచే ముందే తెలిసికొనిన దుర్వాసునిది తప్పు కాదు. ఆ ఆపద్ధర్మమును గ్రహించి తత్సాధన ముగా కుంతీబాలకు ముని మంత్రమిచ్చుట తప్పు కాదు. ఆ ఆపద్ధర్మ మునకు నీలకంఠుల వ్యాఖ్య తప్పు కాదు. తప్పంతయు విరుద్ధముగా వ్రాసిన విమర్శకులదే అయియున్నందున వీరి వ్రాత పరాస్తమైనది.

—• 'కామయా' శబ్దమునకు నీలకంఠులు చెప్పిన అర్థముపై ఆక్షేపమును గూర్చి •—

విమర్శకుల వ్రాత యిట్లున్నది—

"శాస్త్రిగారి కథనము......నీలకంఠ వ్యాఖ్యాప్రాముఖ్యమును బ్రశంసించియుండిరి. నేనును బ్రసంగవశమున కొన్నిట నెత్తి తల్లోపముల జూపుచున్నాను—

"రామః కర్ణం చ సక్రోధ మిదం వచన మబ్రవీత్ ।
అతిదుఃఖ మిదం మూఢ న జాతు బ్రాహ్మణ స్సహేత్ ॥
క్షత్రియస్యైవ తే ధైర్యం కామయా సత్య ముచ్యతామ్ ।

టీ. కామయా=స్వరసేన."

స్వారస్యములో సరసత లేదు. భయపడకయే అని యుండవలెను. 'స్వరసేన' లో ఆ అర్థము లేదు" అట. (పు42)

ఇక్కడ చెప్పుచున్నాము— విమర్శకులు చూపిన శ్లోకముల లోని విషయ మేమనగా— కర్ణుడు విప్రుడ నని చెప్పి పరశురాముని యొద్ద ప్రవేశించి బ్రహ్మాస్త్రమును సంగ్రహించి ఆమునికి ఆదరణీయుడై యుండ నొకప్పుడు ముని. కర్ణుని తొడపై శిరస్సు బెట్టుకొని నిద్రించుచుండ నొక కీటము రక్తము కారునట్లు కర్ణుని తొడదొలుచుచున్నను గురువునకు నిద్రాభంగ మగునని కర్ణుడు సహించి కదలకుండెను. కొంతసేపటికి ముని లేచి ఆరక్తము చూచి, ఆతడు సహించి యుండుటను చూచి 'యీతడు విప్రుడ నని చెప్పినాడు- అది అసత్య మనిపించుచున్నది.' అనుకొని కర్ణునితో (సక్రోధమ్) క్రుద్ధుడై 'మూఢుడా! క్షత్రియున కుండెడి ధీరత నీయందు కనబడినది. విప్రున కిది సంభవముకాదు. 'కామయా సత్య ముచ్యతామ్' నిజము చెప్పు' ముని పలికెను. అని యున్నది.

ఇక్కడ 'కామయా' కు విమర్శకులు 'భయపడకయే' అని అర్థ మనిరి. వారనినదే నిజమైనయెడల 'సక్రోధ మబ్రవీత్' అని యుండ కూడదు. 'మూఢ' అనియు నుండరాదు. మాటలో క్రోధప్రకటనము చేయువాడు భయపడక చెప్పుమని యెన్నడును అనడు. అది

క్రోధప్రకటన మెంతమాత్రము చేయనట్టివా డనవలసిన మాట. కర్ణుడు చూపిన సహనశక్తికి సంతోషింపవలసిన ముని ఆధోరణికే రాక మాత్రి మునకు చెందియుండవలసిన యీతడు నాతో విప్రుడనని చెప్పినా డిదియేమని క్రోధముతో మాటలాడుచు నిజము చెప్పించి శాపముతో శిక్షింపబూనిన ఆముని 'భయపడక చెప్పుమనెను' అనుట అసంగతము.

"త మువాచ తతః కర్ణ శ్శాపా ద్భీతః ప్రసాదయన్ ।"

ఆ మునిమాటపై శాపభీతు డగు కర్ణుడు బ్రతిమాలుకొనుచు నిట్లనెను. అను ఉత్తరవాక్యముసుబట్టికూడ విమర్శకులనిన దసంగతమే.

ఇక సంగతార్థ మేదియో విచారింతము. కర్ణుడు మొదట ప్రవేశించినపుడు 'బ్రాహ్మణో భార్గవోఽస్మి' అని తన కులగోత్రములను చెప్పియుండెను. దాని కిప్పుడు ఆక్షేపము వచ్చినది. మునియప్పుడు నిజము చెప్పుము. అనియే అడిగినయెడల వెనుక చెప్పినదానినే కర్ణుడు చెప్పవచ్చును గురువే తండ్రియను న్యాయమునుబట్టి తాను గురువుగా భావించిన పరశురాముని యొక్క కులగోత్రములే తనవియనగు నని కర్ణు డప్పుడట్లు చెప్పెను అదియు లోకపద్ధతిని నిజమే కాని, తనజాతిని ప్రకటింపలేదు. అప్పు డాతడు చెప్పియున్నదానికి యిప్పుడు పెద్ద ఆక్షేపము వచ్చినందున 'సత్య ముచ్యతామ్' అనిన చాలదని ఆముని 'కామయా సత్య ముచ్యతామ్' అనెను.

ఇక్కడ కామశబ్దము స్త్రీలింగము, ఇచ్ఛార్థకము. నీవు సత్యము చెప్పుము. ఆచెప్పుట ఏదో చెప్పవచ్చు నను తాత్పర్యముతోగాక నిరాక్షేపముగా చెప్పవలె నను తాత్పర్యముతో చెప్పుము. అని భావము. ఇదియేనీలకంఠులు 'స్వరసేన' అను ప్రతిపదముతో వివరించిరి. ఈపదమును వాడుట శాస్త్రజ్ఞులలో పరిపాటి. ఒక దోషమును చెప్పి ఆపై రెండవదోషమును చెప్పునప్పుడు మొదటిదానిపై అస్వరసమును (ఇది దోషము కాదను ఆక్షేపము) పెట్టుచు 'ఇత్యస్వరసా దాహ' అనుచుండుట పరిపాటి. కనుక నీలకంఠులదే సంగతార్థము. ఏమియు దెలియని విమర్శకుల దసంగతప్రసంగముగుటచే వీరి వ్రాత త్రోసి వేయబడినది.

—• 'పాదౌ న ధావయే తావత్' ఇత్యాదిశ్లోకవ్యాఖ్యపై ఆక్షేపముగూర్చి •—

విమర్శకుల వ్రాతయిట్లున్నది—

1 "కర్ణుడు దుర్యోధనునితో పాండవుల గెల్చెదను. ముఖ్యముగ అర్జునుని జంపెదను. అట్లుకానిచో నేనిట్లుండెదను. అను ప్రతిజ్ఞ నొనర్చినాడు

"పాదౌ న ధావయే తావ ద్యావ న్న నిహతోఽర్జునః।
కీలాలజం న ఖాదేయం కరిష్యే చాఽసురవ్రతమ్॥
నాస్తీతి నైవ వక్ష్యామి యాచితో యేన కేనచిత్।'

2 ఇచ్చట 'న ధావయే'కు నీలకంఠుడు పాదములను కడిగించుకొన నని యర్థముచేసి 'పరేణ' (ఇతరుని చేతను) జేర్చినాడు. 'శం నో దేవీ' లోని దీనిని నీలకంఠు డెరిగియుండును. కావున పరునిచే కడిగించుకొనినాడు.

3 నేను కడుగను అని అర్థము కాని, కడిగించుకొన నని కాదు. తప్పువ్రాత యిది...'న ధావయే' కాళ్ళు గడుగు ప్రసక్తి యెట్టిది? కడిగికొనుటకాని, కడిగించుకొనుటకాని మానివైచుట సుకృత నియమము కావలెనుకదా ?

4 "పాదౌ న ధావయే" వెనుకడుగు వేయను అనుట సారస్యము. ఇట చెప్పబడిన వన్నియు తాను చేయుచున్న నిత్యకృత్యములు; వాని నిప్పటనుండి మానెదను." అట ! (పు. 43)

ఇక్కడ చెప్పుచున్నాము—ప్రథమాంశము—

కర్ణుడు అర్జునుని జంపెదను; అట్లుకానిచో నే నిట్లుండెదను; అని ప్రతిజ్ఞ నొనర్చినాడు;' అని విమర్శకులు వ్రాసిరి. ఈవ్రాతలో అప్పటి కజ్ఞాతవాసదీక్షలో ప్రవేశింపకయే యున్నట్టి అర్జునుని తాను చంపనిపక్షములో ఈప్రతిజ్ఞలు చెల్లింతు ననినట్లు వచ్చినదికాని, ఆతని జంపువరకు నేనిట్లుండెద ననినట్లు రాలేదు.

ఇది మీరుదాహరించిన—"పాదౌ న ధావయే తావత్ యావన్న నిహతోఽర్జునః" అను శ్లోకమునకు విరుద్ధము. అర్జునుని వధించునంతవరకు నేనిట్లుండెదను; అన్నట్లు శ్లోకములో నున్నది.

ఘంకోకట. అర్జునుని చంపనట్లయిన నేనిట్లుండెదను. అనునది అర్థములేనిమాట; తానాతని జంపలేనపుడు తన నాతడు చంపడా ? అప్పు డాప్రతిజ్ఞను చెల్లించు టెట్టిది ? చతుర్థాంశములో చూపినట్లు 'వాని నిప్పటినుండి మానెదను' అనినట్లున్న వీరి వ్రాతకును విరుద్ధమే యిది.

'అర్జునుని జంపెదను. అంతవరకు నేనిట్లుండెదను' అని వ్రాయవలసియుండ 'అట్లు కానిచో నేనిట్లుండెదను' అని వ్రాయుట తప్పు.

ద్వితీయాంశము—

నీలకంఠులు 'పాదౌ న ధావయే' అనుచోట 'పరేణేతి శేషః' అని వ్రాసిరి. దీనిచేత పాదములను పరునిచేత కడిగించుకొనను. అను అర్థము లభించినది. దీనిపై విమర్శకు లిట్లనిరి- 'శం నో దేవీ' లోని దీనిని అనగా పరునిచే కాళ్లుగడిగించుకొనుటను నీలకంఠు డెరిగియుండును' అని. దీనిచే నీలకంఠుడు బ్రాహ్మణార్థములలో మెలగినవాడని వీరి పరిహాసము కాబోలు. శాన్తం పాపమ్!

ఈవిమర్శకులరు పరునిచే కాళ్ళుగడిగించుకొనుమాట వినబడునంతలో 'శం నో దేవీ' స్ఫురించుట, బ్రాహ్మణార్థములు స్ఫురించుట, చూడగా అందులో వీరెంత ఆరూఢులో అని మా కాశ్చర్యమగుచున్నది. ఎవ్వని యంతర మెంతయో తెలియని వెఱ్ఱిధోరణి యిది.

తృతీయాంశము—

'నేను కడగను అని అర్థముకాని, కడిగించుకొనననికాదు. తప్పువ్రాత యిది' అనిరి. విమర్శకులు వీరనినట్లు కడుగనివి యేవి ? పాదములు, అవి యెవరివి ? పరునివా ? తనవా ? పరుని వనుటకు 'పరస్య' అని లేదు. అది తెచ్చుకొనినను పరునివి కడగను అనుటలో గల విశేష మేమి ? చతుర్థాంశములో నున్నట్లు 'అవి యాతడు చేయుచున్న నిత్యకృత్యములు' కదా. నిత్య మాతడు పరుని కాళ్ళు కడుగుచుండెనా ? కనుక నీమాట అసంగతము.

ఇక కడగనివి తన పాదములే అనినయెడల నాపాదములు నేను కడగను. అనగా కడిగికొనను అన్నట్లగును.

అప్పు డది నిత్యకృత్యమును మానివైచినట్లగును. కాని ఆనాటి నుండి సంవత్సరముమీద నగు మహాయుద్ధముదరకు కర్ణుడు కాళ్ళుకడిగి కొనకుండ భోజనము చేయుచుండె నను నింద్యార్థము వచ్చును. ఇం కొకటి. కర్ణుడు— "దివాకరం స్తౌతి మధ్యందినే ప్రాప్తే ప్రాంజలి స్సలిలోత్థితః" జలమునుండి ఉత్థితుడై దివాకరుని స్తుతించుచుండు వాడు కదా. ఇదియెట్లు సరిపడును ?

ఇంకొకటి. విమర్శకు లుదాహరించిన వెనుకటి శ్లోకములలో మద్యమాంసములు ముట్ట నను మాటలో అవి మానినను నిత్యకృత్య మైన ఆహారమును వర్జింపలేదని తెలుచున్నట్లు 'పాదౌ న ధావయే' అనుటలో పాదములు కడిగికొనుట అను నిత్యకృత్యమునకు భంగము రాకుండ విశేషాంశమును వర్జించి సత్యార్థము తెలతేను.

ఇట్టి యర్థము సిద్ధింపవలె ననియే మూలములో 'ధావయే' అను ణిజన్తప్రయోగము, 'పరేణేతి శేషః' అని నీలకంఠవ్యాఖ్య, సంభవిం చినవి. ఇప్పుడు పరునిచే పాదములు కడిగించుకొనను అని సిద్ధించినది. ఇది నిత్యకృత్యమైన పాదప్రక్షాలనములో విశేషాంశమైనందున దీనిని వర్జించినను స్వయముగా చేసికొను పాదప్రక్షాలనము జరుగుచునే వచ్చినదని అవగాహస్నానము జరుగుచునే వచ్చినదని తేలినది. అంగ రాజ్యాధిపతియైయున్న కర్ణునకు ఆధిపత్యలక్షణములనుబట్టి పరుడు పాదములు కడుగుట సంభవమే అని యూహింపవచ్చును. కనుక కడి గించుకొనననియే అర్థము. కడగను అని అర్థమును విమర్శకుల వ్రాతయే తప్పు.

తృతీయాంశశేష, చతుర్థాంశములు—

"నధావయే' కాళ్ళు కడుగుప్రసక్తి యెట్టిది? 'పాదౌ న ధావయే' వెనుక కడుగు వేయను అనుట సారస్యము; ఇట చెప్పబడిన వన్నియు తాను చేయుచున్న నిత్యకృత్యములు; వాని నిప్పటినుండి మానెదను" అని విమర్శకు లనిరి.

వీరు తీసిన సారస్యార్థము వెనుకడుగు వేయను అనుట యట! ఇది కర్ణుడు చేయుచున్న నిత్యకృత్యమేనట! అయితే వెనుకడుగు

వేయుట నిత్యకృత్యమా? వేయకుండుట నిత్యకృత్యమా? వెను కడుగువేయుటే నిత్యకృత్యమైయున్నపుడు ఈనాటినుండి వేయను అని ప్రతిజ్ఞ చేసినను ఇది దుర్యోధనున కెట్లు విశ్వసనీయ మగును? అతనికి విశ్వసనీయముకానట్టి ప్రతిజ్ఞ కేమి ప్రయోజనము?

ఇక వెనుకడుగు వేయకుండుటే నిత్యకృత్య మందురా? 'వాని (నిత్యకృత్యముల) నిప్పటినుండి మానెదను' అని యున్న వ్రాతను బట్టి నేటినుండి వెనుకడుగు వేయకుండుట మానెదను; అనగా వెను కడుగు వేయుచుందును; అను అర్థ మేర్పడును. ఇదియా కర్ణుడు దుర్యోధనుని సంతోషింపజేయుటకు చేసిన ప్రతిజ్ఞ? తుదకు విమర్శకులు. "వినాయకం ప్రకుర్వాణో రచయామాస వానరమ్" అన్నట్లు చేసినారు.

పాపము విమర్శకుల సారస్యార్థ మీస్థితికి వచ్చినది. శబ్దార్థపరిశీ లనముతో బనిలేకుండ నేదో చెప్పిన విమర్శకుల అర్థమును అభ్యుపేత్య వాదముగా దీసికొని పరిశీలింపగా వీరి దసంబద్ధాలాపమని స్పష్టమయినది.

'న ధావయే' కాళ్ళు కడుగు ప్రసక్తి యెట్టిది? అనిరి విమర్శ కులు. వీరికి వెనుకడుగువేయని ప్రసక్తిమాత్ర మెట్టిది? ధావు గతి శుద్ధ్యోః' అని ధాతుపాఠము. శుద్ధ్యర్థకముగా దీసికొనినవి మూల వ్యాఖ్యానములు. గత్యర్థకముగా దీసికొనిరి విమర్శకులు. ప్రసక్తి కభ్యంతర మేమి? పాపము విమర్శకులు వెనుకడుగువేయని పద్ధతికే దిగినారుకాని తుదకు వెనుకడుగు వేయుటే జరిగినది.

విమర్శకు లిక్కడ జెప్పిన అర్థము ఆంధ్రభారతమునకునువిరుద్ధమే. 'క...... మఘవతనూజుం గదనమున నే జయింపక పదనఖధావన మొనర్ప బార్థివముఖ్యా' శుద్ధ్యర్థకమే ఇక్కడ గ్రహింపబడినది.

శ్రీకృష్ణభారతమునకును విరుద్ధమే—

"ఉ. నావుడు గర్ణుడిట్లనియె.........సవ్యసాచిపై
నీ వెద జింత సేయకుము నే నరు గూల్చినదాక గాళ్ళులన్
ధావన మాచరింప నిశితంబు భుజింపను బాస చేసితిన్."

ఇక్కడను శుద్ధ వ్యర్థకమే. ఇట్లు సర్వథా విరుద్ధమైన వీరి వ్రాత త్రోసివేయబడినది.

ఇంతవరకు కర్ణుని మూడు ప్రతిజ్ఞలలో ప్రథమప్రతిజ్ఞాషేవ సమీక్షిత మయినది.

కర్ణుని ద్వితీయ ప్రతిజ్ఞా నిశ్చయము.—
"కీలాలజం న ఖాదేయం కరిష్యే చాఽసురవ్రతమ్।

టీ. కీలాలజం మాంసం, తద్ధి ఘనీభూతం రుధిరమేవ, 'కీలాలం రుధిరే తోయే' ఇతి మేదినీ, అసురం సురాపరహితం చ వ్రతం స్వనియమం కరిష్యే; మద్యం మాంసం చ త్యక్ష్యే ఇత్యర్థః"

ఇక్కడ విమర్శకుల వ్రాత యిట్లున్నది—
"'కీలాలజం' మాంసమనుట తగునుకాని వ్యాఖ్యలో ఘనీభూత మనుట తప్పు. ఘనీభూత మనర్థము. దీనికి రుధిరపకట్టినది. అని అర్థముకాని మాంసము కాదు" (పు 45)

ఇక్కడ చెప్పుచున్నాము— 'కీలాలజం న ఖాదేయమ్' అని మూలము. 'ఖాదృ భక్షణే' అనుటనుబట్టి ఇక్కడ ధాతువు భక్షణార్థకము. అందుచే భక్ష్యమే కీలాలజశబ్దార్థము కావలసియున్నది. కీలాల మనగా రక్తము. కీలాలజమనగా రక్తమునుండి యేర్పడినది. అదియే ఆభక్ష్యము కావలసియున్నది.

ఇక్కడ విమర్శకు లనిన మాంసమే కీలాలజమగునేని 'అహం మాంసం న ఖాదేయమ్' అని స్పష్టముగా జెప్పవలసియుండ అట్లు చెప్పక 'కీలాలజం న ఖాదేయమ్' అనుటవలన ఆ మాంసముకాక' రక్తమువలన ఏర్పడి ఘనీభూతమై మాంసప్రాయమైయున్న పదార్థ విశేషమది యని నీలకంఠులు— 'తద్ధి ఘనీభూతం రుధిరమేవ' అని వ్యాఖ్యానించిరి.

రక్తము ఘనీభవించుటనుగూర్చి మాంసాహారు లిట్లు చెప్పుదురు— జున్నుపా లుడకబెట్టగా నవి ఘనీభవించి జున్ను అయినట్లు రక్తముడకబెట్టగా నది ఘనీభవించి జున్నువలె తయారగు నని, అది మాంసప్రాయమై యుండునని చెప్పుదురు.

వేయుట నిత్యకృత్యమా ? వేయకుండుట నిత్యకృత్యమా ? వెను కడుగువేయుటే నిత్యకృత్యమైయున్నపుడు ఈనాటినుండి వేయను అని ప్రతిజ్ఞ చేసినను ఇది దుర్యోధనున కెట్లు విశ్వసనీయ మగును ? అతనికి విశ్వసనీయముకానట్టి ప్రతిజ్ఞ కేమి ప్రయోజనము ?

ఇక వెనుకడుగు వేయకుండుటే నిత్యకృత్య మందురా? 'వాని (నిత్యకృత్యముల) నిప్పటినుండి మానెదను' అని యున్న వ్రాతను బట్టి నేటినుండి వెనుకడుగు వేయకుండుట మానెదను; అనగా వెను కడుగు వేయుచుందును; అను అర్థ మేర్పడును. ఇదియా కర్ణుడు దుర్యోధనుని సంతోషింపజేయుటకు చేసిన ప్రతిజ్ఞ ? తుదకు విమర్శకులు. "వినాయకం ప్రకుర్వాణో రచయామాస వానరమ్" అన్నట్లు చేసినారు.

పాపము విమర్శకుల సారస్యార్థ మీస్థితికి వచ్చినది. శబ్దార్థపరిశీ లనముతో బనిలేకుండ నేదో చెప్పిన విమర్శకుల అర్థమును అభ్యుపేత్య వాదముగా దీసికొని పరిశీలింపగా వీరి దసంబద్ధాలాపమని స్పష్టమయినది.

'న ధావయే' కాళ్ళు కడుగు ప్రసక్తి యెట్టిది ? అనిరి విమర్శ కులు. వీరికి వెనుకడుగువేయని ప్రసక్తిమాత్ర మెట్టిది ? 'ధావు గతి శుద్ధ్యోః' అని ధాతుపాఠము. శుద్ధ్యర్థకముగా దీసికొనినవి మూల వ్యాఖ్యానములు. గత్యర్థకముగా దీసికొనిరి విమర్శకులు. ప్రసక్తి కభ్యంతర మేమి ? పాపము విమర్శకులు వెనుకడుగువేయని పద్ధతి కే దిగినారుకాని తుదకు వెనుకడుగు వేయుటే జరిగినది.

విమర్శకు లిక్కడ జెప్పిన అర్థము ఆంధ్రభారతమునకునువిరుద్ధమే. 'క...... మఘవతనూజుం గదనమున నే జయింపక పదనఖధావన మొనర్ప బార్థివముఖ్యా' శుద్ధ్యర్థకమే ఇక్కడ గ్రహింపబడినది.

శ్రీకృష్ణభారతమునకును విరుద్ధమే—

"ఉ. నాపుడు గర్ణుడిట్లనియె.........సవ్యసాచిపై
నీ వెద జింత సేయకుము నే నరు గూల్చినదాక గాళ్ళులన్
ధావన మాచరింప శిశితంబు భుజింపను బాన చేసితిన్."

ఇక్కడను శుద్ధ్యర్థకమే. ఇట్లు సర్వథా విరుద్ధమైన వీరి వ్రాత త్రోసివేయబడినది.

ఇంతవరకు కర్ణుని మూడు ప్రతిజ్ఞలలో ప్రథమప్రతిజ్ఞాపేవ సమీక్ష మయినది.

కర్ణుని ద్వితీయ ప్రతిజ్ఞా విషయము.—
"కీలాలజం న ఖాదేయం కరిష్యే చాఽసురవ్రతమ్॥

టీ. కీలాలజం మాంసం, తద్ధి ఘనీభూతం రుధిరమేవ, 'కీలాలం రుధిరే తోయే' ఇతి మేదినీ, అసురం సురారహితం చ వ్రతం స్వనియమం కరిష్యే; మద్యం మాంసం చ త్యక్ష్యే ఇత్యర్థః"

ఇక్కడ విమర్శకుల వ్రాత యిట్లున్నది—
"'కీలాలజం' మాంసమనుట తగునుకాని వ్యాఖ్యలో ఘనీభూత మనుట తప్పు. ఘనీభూత మనర్థము. దీనికి రుధిరమనుట తప్పు. ... అని అర్థముకాని మాంసము కాదు" (పు 45)

ఇక్కడ చెప్పుచున్నాము— 'కీలాలజం న ఖాదేయమ్' అని మూలము. 'ఖాదృ భక్షణే' అనుటనుబట్టి ఇక్కడ ధాతువు భక్షణార్థకము. అందుచే భక్ష్యమే కీలాలజశబ్దార్థము కావలసియున్నది. కీలాల మనగా రక్తము. కీలాలజమనగా రక్తమునుండి యేర్పడినది. అదియే ఆభక్ష్యము కావలసియున్నది.

ఇక్కడ విమర్శకు లనిన మాంసమే కీలాలజమగునేని 'అహం మాంసం న ఖాదేయమ్' అని స్పష్టముగా జెప్పవలసియుండ అట్లు చెప్పక 'కీలాలజం న ఖాదేయమ్' అనుటవలన ఆ మాంసముకాక రక్తమువలన ఏర్పడి ఘనీభూతమై మాంసప్రాయమైయున్న పదార్థ విశేషమది యని నీలకంఠులు— 'తద్ధి ఘనీభూతం రుధిరమేవ' అని వ్యాఖ్యానించిరి.

రక్తము ఘనీభవించుటనుగూర్చి మాంసాహారు లిట్లు చెప్పుదురు— జున్నుపా లుడకబెట్టగా నవి ఘనీభవించి జున్ను అయినట్లు రక్తముడకబెట్టగా నది ఘనీభవించి జున్నువలె తయారగు నని, అది మాంసప్రాయమై యుండునని చెప్పుదురు.

లోకజ్ఞుడైన వ్యాఖ్యాత ఈ విశేషమును చెప్పియుండ లోక జ్ఞానములేని విమర్శకులు 'ఘనీభూత మగుట తప్పు. దీనికి కుదపకట్టు నది అని అర్థము. మాంసము కాదు' అని స్వేచ్ఛగా మాటలాడినారు. వీరి దసంగతపద్రసంగ మగుటచే నిది త్రోసివేయఁబడినది.

—• కర్ణుని తృతీయ ప్రతిజ్ఞా విషయము •—

"నాస్తీతి నైవ వక్ష్యామి యాచితో యేన కేనచిత్ ।"

ఇక్కడ విమర్శకుల వ్రాత యిట్లున్నది—

"ఏవానిచే నయినను కోరబడి లేదనను. కర్ణు డదివరకు యాచకులకు లేదని పలుకుచుండువాడుకాబోలు. ఈ ప్రతిజ్ఞ నిట నొచి తీస్కొరక మనుకొనినాడా వ్యాసుడు ?" (పు 44)

ఓహో ! విమర్శకు లిక్కడ వ్యాఖ్యాతను విడిచి వేదవ్యాసులపై బడినారు. ఔచితి యనునది విమర్శకుల సొత్తయిపోయినది. వీరి కేమియు దోచనపుడు తమ యౌచితిని ప్రయోగింతురు. తమవ్రాత ఔచితికి చెందిన దనియే వారి తాత్పర్యముకాబోలు. కర్ణుడనిన దేమి? 'నాస్తీతి నైవ వక్ష్యామి యాచితో యేన కేనచిత్' ఎవ్వఁడు యాచించినను లేదనను. అని.

ఇక్కడ విమర్శకు లేమనినారు ? కర్ణు డదివరకు యాచకులకు లేదని పలుకుచుండెడివాడుకాబోలు. అని. అయితే 'వెనుకడుగు వేయును' అను కర్ణుని ప్రతిజ్ఞను పరిగణింపరికరించినారుకదా ! అక్కడ మరియొకరు- కర్ణు డదివరకు వెనుకడుగు వేసెనుకాబోలు, అని వీరి పైబడినచో వీరు చేయు పని యేమి ?

ఎవ్వరయినను మూలగ్రంథము నాధారముచేసికొనియే మాటలాడవలెను. అక్కడ తన బుద్ధియే పనిచేయవలె నని మూలమును త్రోసివేయవలెనని భావించువాడు నిరాధారుడై పడిపోవును.

కనుక విమర్శకుల ఈ నిరాధారధోరణి హేయ మగుటచే పరాస్తమైనది.

—• "గృహాన్ వ్రజ యథాకామం వైమనస్యం చ మా కృథాః"
• ఈ శ్లోకవ్యాఖ్యానముపై ఆక్షేపములు చూడ్డి •—

విమర్శకుల వ్రాత యిట్లున్నది—

'చిత్రసేనయుద్ధానంతరము ధర్మరాజు దుర్యోధను నిట్లు ఓదార్చినాడు. ఇట్టి పని యెప్పుడును చేయకుము. తమ్ములతో సుఖముగ నింటికి పొమ్ము

'గృహాన్ వ్రజ యథాకామం వైమనస్యం చ మా కృథాః।'

టీ. వైమనస్యం వైరం కేనచిత్సహ మా కృథాః మాకుము, విమనస్కతకు చిన్నబోవుట యర్థమైయుండ ఎవరితోగూడ విరోధమును గల్పించుకొనకుము. అనుట తగునా ?

'సహ' ఏమిటకు ? 'కేనాపి' అనగూడదా ? విగతమనస్కులు మాత్ర మిట్టి టీకల నాధారపరచుకొనెదరు.' (పు 45)

ఇక్కడ చెప్పుచున్నాము— ఘోషయాత్రలో సకుటుంబపరివారముగా బయలుదేరిన దుర్యోధనుడు గంధర్వులతో విరోధించి వారిపై డీకొని ఓడిపోయి తాను, తన స్త్రీలు ,తన పరివారము గంధర్వులచే పట్టి తీసికొనిపోబడుచున్నపుడు భీమార్జునాదులు గంధర్వులతో యుద్ధము చేసి ఓడించిన సందర్భములో గంధర్వాధిపతి చిత్రసేనుడు దుర్యోధనుని తీసికొని ధర్మజునియొద్దకు వెళ్ళి దుర్యోధనుడు ఏ దురుద్దేశముతో అప్పు డక్కడకు వచ్చినదియు తెలిపి అజాతశత్రువగు ధర్మజునిమాటపై దుర్యోధనుని అక్కడ విడిచి వెళ్లిపోయెను. అప్పుడు—

"తతో దుర్యోధనం ముక్తం...యుధిష్ఠిరస్తు ప్రణయా దిదం వచన మబ్రవీత్॥ మాస్మ తాత పునః కార్షీ రీదృశం సాహసం క్వచిత్। నహి సాహసకర్తార స్సుఖ మేధన్తి భారత। స్వస్తిమాన్ సహిత స్సర్వై ర్భ్రాతృభిః కురునందన। గృహాన్ వ్రజ యథా కామం వైమనస్యం చ మా కృథాః॥

యుధిష్ఠిరుడు ప్రణయపూర్వకముగా నిట్లు చెప్పెను— దుర్యోధనా! ఇట్టి సాహసము మరెప్పుడు చేయకుము. సాహసకర్తలకు సుఖము ఘటింపదు. శుభము కలవాడవై సోదరులతో గలిసి యింటికి వెళ్ళుము. వైమనస్యము పెట్టుకొనకుము. అని.

ఇక్కడ పెట్టుకొనకుమనిన వైమనస్యము మనఃఖేద మనవలెనా? లేక దానికి మూలమైన వైర మనవలెనా?

యుధిష్ఠిరుడు నీవిట్టిసాహసమును అనగా గంధర్వులతో విరోధించుటవంటి సాహసకృత్యమును మఱెప్పుడు చేయకు మని మొదట చెప్పియుండెను అట్లు చేయకుండుటకు ఇప్పటి సాహసకృత్యముచే ప్రాప్తించిన ఈ ఖేదమును దుర్యోధనుడు మరువక మనస్సులో పెట్టుకొనియుండవలసినదే.

ఇట్టిస్థితిలో ధర్మజుడు పెట్టుకొనకు మనిన వైమనస్యము మనఃఖేదరూపమని విమర్శకు లన్నట్లు– చిన్నబోవుట అని బుద్ధిమంతు లెవ్వ రనగలరు? ఈ మనఃఖేదమును ఈ చిన్నబోవుటను, నీవు మనస్సులో బెట్టుకొనవలదు. అని బోధించువాడు ఇట్టి సాహసకృత్యము లెప్పుడు చేయకు మని యెట్లు బోధించును? కనుక నిక్కడ వైమనస్యము– వైరము అనగా విరోధము అనియే చెప్పవలెను. అందుచేతనే నీలకంఠులు 'వైమనస్యం=వైరమ్' అని వ్యాఖ్యానించిరి.

ఇప్పు డిక్కడ నొక శంక పుట్టవచ్చును—

'మా కార్షీ రీదృశం సాహసమ్' అని చెప్పిన దానిసే' వైమనస్యం చ మా కృథాః' అని మరల చెప్పినట్లగు-చున్నదికదా! అది యెందులకు? అని.

ఇట్టి శంకను వారించుటకు మొదటివాక్యములోకంటె రెండవ వాక్యములో విశేష మున్నదని తెలిసికొనవలెను. ఆ విశేష మేమనగా- గంధర్వులవంటి ప్రబలులతో నీవు విరోధము పెట్టుకొనకుము. .అని మొదటివాక్యముచే చెప్పబడినది. ఎట్టివానితోడను నీవు విరోధము పెట్టుకొనకుము అని కడపటివాక్యముచే చెప్పబడినది.

అయితే 'వైమనస్యం చ మా కృథాః' ఇక్కడ 'ఎట్టివానితోడను' అని యేది? అందురేమో ఈవాక్యము విశేషబోధక మని చెప్పుట ఎప్పుడు తప్పలేదో అప్పుడు ఆమాటకూడ ఆవాక్యములో అన్తర్గతమైన దని అంగీకరింపవలసినదే. కనుకనే నీలకంఠులు–'వైమనస్యం వైరం కేన చిత్సహ మాకృథాః' అని వ్యాఖ్యానించిరి.

విమర్శకు లిక్కడ వ్యాఖ్యాతకు వ్రాత చేతకాదనుకొనిరి కాబోలు. 'సహ' ఎందులకు ? 'కేనాపి' అనగూడదా ? అని ఆక్షే పించిరి. ఇక్కడ గొంచము చెప్పవలసియున్నది.

వీరు 'కేనచిత్సహ' అను వ్యాఖ్యాత మాటను అంగీకరించుస్థితికి వచ్చిరియె ఆమాటలో 'సహ' ఎందులకు ? అనిరి.

ఈ'సహ'శబ్దము 'కేన' అను పదములోని తృతీయ 'సహ యుక్తేఽప్రధానే' అను సూత్రముచే అప్రధానార్థమందు వచ్చినదని తెలుపుటకు. అది మాత్రమెందు కందురా ? నీవు ఎట్టి అప్రధానునితో గూడ వైరము అనగా విరోధము పెట్టుకొనకుము. అని ధర్మజుడు చెప్పె నని తెలుపుటకు.

ఇప్పుడు వెనుక జూపిన రెండువాక్యములలో మొదటిది ప్రబ లులకు సంబంధించినది. ఈ రెండవది దుర్బలులకుగూడ సంబంధించినది. కాబట్టి పునరుక్తిదోషశంక పోయినది.

ఇంత నిగూఢమైన హృదయముతో వ్రాయబడిన నీలకంఠుల టీకను తెలిసికొను శక్తి లేని విమర్శకులు—'విగతమనస్కులు మాత్రి మిట్టిటీకల నాధారపరచుకొనెదరు.' అని వ్రాయుట కాశ్చర్యమేమి ? ఏమియు దెలియనివా రను మాట అదియే.

దీపమును జూడలేని దృష్టికలవాడు దీపము నార్పివేయబూను కొనునట్లు టీకలను చూడలేని బుద్ధికలవాడు టీకలను మాపివేయ బూనుకొనుచుండును.

అజ్ఞానాంధకారావృతమైయున్న మహాభారతపదార్థజాల మును స్పష్టముగా బుద్ధికి గోచరింపజేయగలది వ్యాఖ్యాప్రదీపమే. దృష్టిలేని వాని పట్ల దీపము వ్యర్థ మగునట్లు బుద్ధిలేనివాని పట్ల వ్యాఖ్య వ్యర్థ మగును. చక్షుష్మంతులు దీపము బట్టుకొని అంధకారగతపదార్థ ముల దెలిసికొనునట్లు బుద్ధిమంతులు వ్యాఖ్యబట్టుకొని అజ్ఞానగతపదా ర్థముల దెలిసికొనుచుందురు.

కనుక టీకల నాధారపరచుకొనువారే బుద్ధిమంతులు. వాని నాధారపరచుకొననివారే విగత మనస్కులును, విరుద్ధమనస్కులును.

ఇట్లు సమీక్షింపగా ఏమియు తెలియక వ్యాఖ్యానవిద్వేషముతో నడచిన వీరి ధోరణి హేయమైనందున త్రోసివేయబడినది.

—• "నచ పశ్యామి సమరే కర్ణం ప్రతిపలాయితుమ్"
ఈశ్లోకవ్యాఖ్యానముపై ఆక్షేపమునుగుఱ్ఱి •—

విమర్శకుల వ్రాత యిట్లున్నది—
"పశ్య పశ్య మహాబాహో భార్గవాస్త్రస్య విక్రమమ్ ।
నైత దస్త్రం హి సమరే శక్యం హన్తుం కథంచన ॥
సూతపుత్రం చ సంరబ్ధం పశ్య కృష్ణ మహారణే !
అన్తకప్రతిమం వీర్యే కుర్వాణం కర్మ దారుణమ్ ॥
అభీక్ష్ణం చోదయ న్నశ్వాన్ ప్రేక్షతే మాం ముహు ర్ముహుః ।
న చ పశ్యామి సమరే కర్ణం ప్రతిపలాయితుమ్ ॥
టీ. కర్ణంప్రతి లక్షీకృత్య పలాయితుం న పశ్యామి నిషిద్ధత్వాత్ ।"

...శాస్త్రిగారు వివరణములో 'నే నిప్పుడు కర్ణున కెదురయి ఆయస్త్ర మప్రతిహతమగుటవలన నిషిద్ధమైన పలాయనము చేయుట నా కిష్టముకాదు...(అని అర్జును డనెను.) దీనినిబట్టి కర్ణార్జునద్వంద్వ యుద్ధములో కర్ణుడు మరలిపోవుచు వచ్చినట్లు పార్థు డెన్నడును మరలిపోలే దని ప్రతివాదులు తెలిసికొనవలెను." అనిరి.

1 కర్ణుని ప్రతాపము నిసుమంతయు నీభాగము వెల్లడించుట లేదను భ్రమ నొందినారు. అర్జునుడు 'జీవన్ ధదాని పశ్యతి' అని నాడు. ఈభాగము వీరి దృష్టిని బాగుగ నాక్రమింపలేదు.

2 'కర్ణం ప్రతి పలాయితుమ్' కర్ణు నెదుర్కొనలేను అని అర్థము కాని నేను పారిపోవనని కాదు...

3 ఎదుట బడిన నేను పారిపోవుటకై వెనుదీయుట లేదు. కర్ణు శౌర్య మనుచున్నాడు...పారిపోవుట కడ్డుతగులుచున్నందువలన అవకాశము కన్పించుటలేదు. అనినా డర్జును డనవలెను." (పు.46)

ఇక్కడ చెప్పుచున్నాము—యుద్ధభూమియందు వేరు వేరు స్థలములలో నొకచోట భీముడు, మరొకచోట కర్ణుడు మరియొకచోట పార్థుడు బహుయోధులతో ప్రచండముగా యుద్ధము చేయుచుండిరి. అప్పుడు కర్ణయుధిష్ఠిరులకు సంభవించిన యుద్ధములో కర్ణుడు యుధి

ష్ఠిరుని మతగాయుక్తిని జేసి పరాఙ్ముఖుని గావించి ఆపై పాంచాలసేనపై బడి భార్గవాస్త్రమును ప్రయోగించి సర్వసంహారము చేయుచుండెను. అప్పు డావధింపబడువారు "అర్జునం వాసుదేవం చ క్రోశన్తి చ ముహు ర్ముహుః" కృష్ణార్జునుల నాక్రోశింప నారంభించిరి.

అప్పటికి పార్థుడు సంశప్తకులతో పోరిపోరి పారద్రోలి, ఆపై వచ్చిపడిన అశ్వత్థామతో ఘోరయుద్ధము చేసి పరాఙ్ముఖుని గావించి యుండెను. ఆసమయమునకు కృష్ణార్జుననామోచ్చారణపూర్వకమైన ఆర్తనాదములు పాండవసేనలనుండి వినవచ్చినవి. అప్పు డాభార్గవాస్త్ర ప్రభావమును, ఆ ఆర్తనాదములను చూచి శ్రీకృష్ణునితో పార్థు డిట్లనెను—ఘోరమైన భార్గవాస్త్రమును ప్రయోగించి కర్ణు డెట్లు విజృంభించుచుండెనో చూడుము. అది అప్రతిహతమైన అస్త్రము. అతడు నాకొరకు చూచుచుండెను. ఆభార్గవాస్త్రమునకు ప్రత్యస్త్రము లేని ఇట్టి స్థితిలో నే నిప్పుడాతని కెదురయి తరువాత నిషిద్ధమగుట పలాయనము చేయదలచుకొనలేదు. జీవించియున్న చూచు కొనవచ్చును. అని.

ఇది కర్ణునితో ద్వంద్వయుద్ధము చేయుచుండికాని, కర్ణుని యుద్ధరంగములో తానుండి కాని అనిన మాట కాదు. కనుకనే 'కర్ణార్జున ద్వంద్వయుద్ధములో కర్ణుడు మరలిపోయినట్లు పార్థు డెన్నడును మరలిపోలేదు.' అను మాహాత్మ్యకథనోక్తి నిరాక్షేపము.

"మన రథంబిప్డు మాధవ మరలనిమ్ము" అను పార్థునిమాట పేరొకయుద్ధరంగములోనుండి అనినదికాని, కర్ణునితో యుద్ధముచేయు చుండి అనినది కాదని ప్రతివాదులు తెలిసికొనవలెను. ఇట్లు ప్రథమాంశము నిరస్తము.

ద్వితీయాంశము—'కర్ణం ప్రతి పలాయితుమ్' కర్ణు నెదుర్కొనలేను అని అర్థముకాని, నేను పారిపోవ నని కాదు. అట! పలాయనము—పారిపోవుట కాదను వీరిమాట హేయము.

'ఎదుటబడిన నేను పారిపోవుటకై...అనుచున్నాడు.' అను తృతీయాంశమున కిది విరుద్ధమగుటచే స్వవచనవ్యాఘాతము.

తృతీయాంశము—'పారిపోవుట కద్భుతగులుచున్నందువలన అవకాశము కన్పించుటలేదు. అనినా డర్జునుడు' అట!

ఇది తప్పు. ఎదుటబడుటకే సంకల్పింపనట్టి పార్థునకు పారిపోవు ప్రసక్తి యెట్లు వచ్చినది. అట్టి ప్రసక్తియే లేనపుడు 'అద్భుతగులుచున్నందువలన పారిపోవుట కవకాశము కన్పించుటలేదు. అని నాడర్జునుడు' అను ఇదేమివ్రాత? ఆపై కృష్ణుడు—పార్థా! కర్ణునివలన ధర్మజుడు క్షతగాత్రుడై యున్నాడు. అతని నాశ్వాసింపజేసి 'కర్ణం పార్థ వధిష్యసి' కర్ణుని వధింపగలవు. అని చెప్పినతరువాత ధర్మజుని యొద్దకు వెళ్ళిరి.' (పు. 48) అను గ్రంథమున్నది కదా! వెళ్ళుట కవకాశములేకుండ అద్భుతగులుచున్నప్పుడు ఎట్లు వెళ్ళిరి.

కనుక అసంగతమైన వీరి వ్రాత పరాస్తమైనది.

—• "అర్జునస్య ఇమే బాణా నేమే బాణా శ్శిఖండినః"
ఈశ్లోకవ్యాఖ్యానముపై ఆక్షేపమునుగూర్చి •—

భీష్మయుద్ధములో శిఖండిని పురస్కరించుకొని పార్థుడు నిశిత శరములను భీష్మునిపై ప్రయోగింప నవి తన శరీరమును, దూసిపోవుచుండ, శిఖండి మొగముచూడ ననుప్రతిజ్ఞ కలవాడగుటచే పెడమొగము బెట్టుకొని యుద్ధముచేయు భీష్ముడు శరీరవిదారకము లగు శరములను గూర్చి అనుకొనెను—

"అర్జునస్య ఇమే బాణా నేమే బాణాశ్శిఖండినః।
కృన్తన్తి మమ గాత్రాణి మాఘమాసే గవా ఇవ॥ (భీష్మ అ119)
నీలకంఠీయమ్—'మాఘమా కర్కటీ ప్రోక్తా తదపత్యా స్తు సేగవా'
యథా, మాఘమాం కర్కటీం మాతరం సేగవాస్తదపత్యాని కృన్తన్తి; ఉదరస్థా న్యపత్యాని పృష్ఠం విదార్య బహి ర్నిర్గచ్ఛన్తి తద్వ దిత్యర్థః. తేన ప్రాణాపహారి వేదనాజనకత్వం బాణానాం, నేదం శిఖండిబాణేషు సంభవతి, తేషాం మదంగే పుష్పతుల్యత్వాత్ ॥"

ఈబాణములు పార్థునవి కాని శిఖండివి కావు. ఇవి పీతకడుపునుండి పిల్లలు వీపు చీల్చుకొని వెళ్లునట్లు, నాశరీమును చీల్చి దూసికొని పోవుచు ప్రాణాంతకమైన బాధ గలిగించుచున్నవి. నాశరీరమునకు

పుష్పప్రాయము లగు శిఖండి బాణములకు ఈస్థితి యెక్కడ? అని. ఇది గ్రంథస్థవిషయము.

ఇక్కడ విమర్శకుల వ్రాత యిట్లున్నది.—

"ఈ వ్యాఖ్యలో నిఘంటు విట్లు కలదు-'మాఘమా కర్కటీ ప్రోక్తా సేగవా తదపత్యకమ్' ఇటవివరణము...'యథా, మాఘమాం కర్కటీం... సేగవా స్తదపత్యాని.

1 కృంతంతి ఉరస్థా న్యపత్యాని..." అని.

'అపత్యాని చాలును 'ఉరస్థాని' అక్కర లేదు. ఇత రావయవములుకూడ సంతానజనకములని యెరిగియుండి వ్రాసిన వ్రాత కాబోలు. ఉరస్థములా? ఉదరస్థములా? ముద్రణములో 'ద' లోపించినది కానోపు.

2. తిక్కన అనువాదము...'కర్కట గర్భంబుకరణి గాత్రము వ్రచ్చె...మూలమున లేని వ్యాఖ్యాతగారి కర్కటిని తిక్కన తీసి కొని మూలమున గల వేలనో గ్రహింపలేదు...వ్యాఖ్యానము చూడని తిక్కననాటి కీనిఘంటునిర్మాణము జరిగియుండ దని నామతము. మాఘమాపాఠము సాధనీయ మెట్లు?...

'3 మాఘమా కర్కటీ ప్రోక్తా' అననగునుకాని వెనువెంటనే 'సేగవా తదపత్యకమ్' అనుట తగునా?...ఈసాంప్రదాయము భాషాసిద్ధమా?

4 వ్యాఖ్యలో 'సేగవా తదపత్యకమ్' కదా ఉన్నది? వివరణ ములో 'సేగవా స్తదపత్యక' మనుబహువచన మెందులకు?... సంబంధరాహితి యట్లు వ్రాయించినది కృతకనీలకంఠునిచే. నీల కంఠుడు వ్యాఖ్య వ్రాసిన దేప్రతికి? కొన్నిప్రతులలో నీ... వ్యాఖ్య లేకుండుటకు హేతువేమి?

5 మూలమున 'మాఘమా సేగవా ఇవ' కలదు. 'సేగవా అనునెడల 'సేగవేవ' కానక్కరలేదా?

6 గోజాలికి మాఘమాసము బాధాజనకమైనట్లు ఈఅర్జును బాణములు బాధను కలిగించుచున్నవి అని భీష్ముని నిర్వచనము. మాఘమాస, గవాం శబ్దములు పైపద్యమున గ్రహించవలెను."
(పు. 49. 54)

వీరి కిక్కడ చెప్పుచున్నాము—ప్రథమాంశము—

ఈవిమర్శకులు చేపట్టిన ప్రతి "1929 వావిళ్ళప్రచురణము" (పు. 49) ఆప్రతినుండి 'ఉరస్థాని అపత్యాని'. అని తీసికొని ఉదర స్థములా ? ఉరస్థములా ? అని గద్దరించుచున్నారు. తాము తీసిన ఉరస్థశబ్దములో నున్న సకారములు రెండా ? ఒకటా ? అని యేమయిన చూచుకొనినారా ? ఒక సకారమే కనబడుచున్నది. ఇది ఉరశ్శబ్దమైయుండదు. ఉదరశబ్దమైయుండును. ఈప్రతిలో దకారము పోయియుండును. అనుపరిజ్ఞానము ఇంతవిమర్శకుల కేల లేకపోయి నది. తమ తప్పు తెలిసికొనక వ్యాఖ్యానము తప్పనుట శోచనీయము.

'అపత్యాని' చాలును. 'ఉరస్థాని' అక్కరలేదట. వీరి పరిజ్ఞాన మునకు పదియు నక్కరలేదు అసలు ఆవ్యాఖ్యయే వీరి కక్కరలేదు. శరీరమునుండి వీపును భేదించుకొని పోవు బాణములకు ఉదరమునుండి వీపును భేదించుకొని పోవు కర్కటీసంతతి నుపమానముగా చెప్పుట కది కావలసివచ్చినది.

ద్వితీయాంశము—'కర్కటిగర్భంబుకరణి గాత్రము వ్రచ్చె'నను తిక్కనగారి అనువాదము చూచికూడ తమ బుద్ధిని దిద్దుకొనక తిక్కన గారినే ఆక్షేపించినారు.

'వ్యాఖ్యానము చూడని తిక్కన నాటికి ఈనిఘంటునిర్మాణము జరిగియుండదని నా మతము' అనిరి.

వీరి మతప్రకారము వ్యాఖ్యానము చూడని తిక్కననాటికే 'మాఘమాం సేగవా' పదములకు కర్కటీగర్భ మర్థము చెప్పుకొనుట ప్రసిద్ధమైనందున ఆపదములకు ఆ అర్థనిర్వచనము ఆనాటికే ఉండి నీలకంఠులచే నది ఉదాహరింపబడినదికాని నిర్మింపబడలేదని విమర్శకుల పై వాక్యమే వెల్లడించుచున్నదని మేము చెప్పుచున్నాము. 'మాఘమా

పాఠము సాధనీయమెట్లు ?' అనిరి. నీలకంఠోదాహృతనిర్వచనప్రకార మని సమాధానము.

తృతీయాంశము—'మాఘమా కర్కటీ ప్రోక్తా' అన నగును కాని వెంటనే 'సేగవా తదపత్యకమ్' అనుట తగునా ? అనిరి.

మొదటిది తగుటేమి ? రెండవది తగకపోవుటేమి ? "అప్రతిపత్తి రన్యథా ప్రతిపత్తిర్వా వ్యాఖ్యాబీజమ్" అని వ్యాఖ్యానమర్యాద. మాఘమాశబ్దమున కర్థ మెట్లు తెలియకుండునో అట్లే సేగవాశబ్దమునకును తెలియకుండెను. దానిని తెలుపునట్టిది వ్యాఖ్యానము. ఆవ్యాఖ్యానము సప్రమాణముగా తెలుపవలెను గనుక ప్రమాణభూతమైన పైనిర్వచనము నుదాహరించెను. కనుక రెండును చెప్పదగినవే.

'ఈసంప్రదాయము భాషాసిద్ధమా ?' అనిరి. భాషాసిద్ధమే అని చెప్పుచున్నాము—చూడుడు—

వాలితో సుగ్రీవుడు యుద్ధము చేయబోవునపుడు ఆనవాలుగా లక్ష్మణు డొక లతను సుగ్రీవకంఠమునకు చుట్టియుండెను. అప్పుడు శ్రీరాముడు సుగ్రీవునితో ననుచుండెను—

"శోభసే హ్యధికం వీర లతయా కంఠసక్తయా ।
విపరీత ఇవాకాశే సూర్యో నక్షత్రమాలయా ॥ (కిష్కి. స. 14)

తీర్థీయవ్యాఖ్యా—...విపరీత ఇతి సప్తమ్యన్తం, విపరీతే రాత్రౌ సూర్యః పౌర్ణమాసీచంద్రః "పరీతం తు దివా ప్రోక్తం విపరీతం తు శర్వరీ। పౌర్ణమాసీగత శ్చన్ద్ర స్సూర్య ఇత్యభిధీయతే" ఇతి వచనాత్ । రాత్రావాకాశే పూర్ణచంద్రో నక్షత్రమాలయా యథా శోభతే, తథా కంఠసక్తమాలయా త్వం శోభసే ఇతి ।"

పైశ్లోకములో విపరీతము, నక్షత్రమాలతోగూడిన సూర్యుడు అను రెండు చెప్పబడినవి. అవి యేవో తెలుపు నిర్వచనము వ్యాఖ్యాతచే నుదాహరింపబడినది. అందు విపరీతశబ్దమునకు రాత్రి అర్థమని, సూర్యశబ్దమునకు పూర్ణిమాచంద్రు డర్థ మని చెప్పబడినది.

ఇట్టి నిర్వచనములు పురాణములలోను, నిరుక్తములోను ఉండును. వానిని వ్యాఖ్యాత లుదాహరించుచుందురు. కనుక నీ సంప్రదాయము భాషాసిద్ధమే

చతుర్థాంశము--- 'వ్యాఖ్యలో 'సేగవా తదపత్యకమ్' అని కదా ఉన్నది ?' అనిరి. అట్లు లేదు. 'తదపత్యాన్త సేగవా' ఇట్లున్నది. చూడుడు మొదట మేము ప్రదర్శించిన వ్యాఖ్యలో.

'వివరణములో 'సేగవా స్తదపత్యక' మను బహువచన మెందులకు ?' అనిరి. వీరి ప్రథమాంశములోగూడ' సేగవా స్తదపత్యాని' అనియే యుండ ఇక్కడ 'తదపత్యక'మని చూచుకొనకుండ వ్రాసినారు. బహువచన మెందులకో చెప్పుచున్నాము—

మూలములో 'సేగవా ఇవ' అని బహువచన మగుటచే దాని వివరణములో నుండవలసినది బహువచనమే కనుక.

'సంబంధరాహితి కృతకనీలకంఠునిచే నట్లు వ్రాయించిన''దట! నీలకంఠులచే గాదు. అది కృతకవిమర్శకులచే నిట్లువ్రాయించినది.

నీలకంఠుడు వ్యాఖ్య వ్రాసిన దేప్రతికి?' అనిరి. ఈప్రతికి ఆప్రతికి అని కాక వేదవ్యాసమహాభారతమునకు వ్రాసెను.

'కొన్ని ప్రతులలో వ్యాఖ్యలేకుండుటకు హేతు వేమి?' అనిరి. ఆము ద్రాపకుల యొద్దకు వెళ్ళి తెలిసికొనుట మంచిది. ఇవన్నియు చొప్పదంటుప్రశ్నలు.

పంచమాంశము- - 'మూలమున...'సేగవా ఇవ' కలదు....సేగవేవ' కానక్కరలేదా?' అనిరి. వీరిక్కడ పెద్దభ్రాంతిలోబడి అది యేకవచన మనుకొనినారు. పాపము అది బహువచనాంతము. అందుచే వారి సంధి కవకాశము లేదు. వైయాకరణుల నడిగి తెలిసికొనుట మంచిది.

షష్ఠాంశము—'మాఘమాస, గవాం, శబ్దములు పైపద్యమున గ్రహించవలెను.' అనిరి. మొదటిదానికి విభక్తి నెత్తుకొనలేదు.

వీరుమూలమును ఇట్లు దిద్దినారు— 'మాఘమాం సేగవాఇవ' అనిమూలము. ఇందు 'మాం సేను 'మాసే' చేసి 'గవా ఇవ'ను 'గవామివ చేసి 'మాఘమాసే గవామివ' అని తయారుచేయుదురన్నమాట. దీని కర్థము—గోజాతికి మాఘమాసము బాధ గలిగించునట్లు ఈఅర్జున బాణములు బాధ గలిగించుచున్నవి. అనియట ! వీరి దిద్దుపాటులో వచ్చిన తప్పులు గ్రహింపవలసియున్నవి— "మాఘమాసే'లోని సప్త

మికి ప్రథమార్థము చెప్పుట తప్పు. 'మమ గాత్రాణి బాణాః కృన్తన్తి గవాం గాత్రాణి మాఘమాస ఇవ' అని కదా వాక్యాన్వయము?

ఇక్కడ ఉపమానవాక్యములోని మాఘమాసశబ్దము ఏకవచనాంతము, ఉపమేయవాక్యములోని బాణశబ్దము బహువచనాంతము అగుటచే యథాశ్రుతపాఠములో లేని వచనవ్యత్యాసదోష మొకటి వచ్చినది. మరియొకటి మూలములో 'కృన్తన్తి' అని యున్నది. దీనికి 'కృతీ ఛేదనే' అని ఛేదన మర్థము. ఇట్టి కృన్తనము ఉభయసాధారణ ధర్మము కావలయును. యథాశ్రుతపాఠములో నది సరిపడినది. వీరి దిద్దుపాటులో నది చెడినది. బాణములు శరీరమును చీల్చినట్లు కర్కటీగర్భమును చీల్చును. వీరి మాఘమాసము అట్లు చీల్చునా? కనుక యథాశ్రుతపాఠమును చక్కగా సమన్వయించిన నీలకంఠీయమే ప్రశంసనీయము. దానిని కాదనుచు బయలుదేరిన విమర్శకుల అకాండ తాండవము గర్హ్యమే.

ఈ'మాఘమాం సేగవా ఇవ' ప్రయోగ మిక్కడనే కాదు. శాంతిపర్వము (అ. 139) యందును కలదు.

పురాణం హయగ్రీవశాస్త్రిగారిచే ఆంధ్రాక్షరములతో ముద్రింపబడియున్న భారతప్రతిలో (అ. 139) గూడ 'మాగమాం సేగవా ఇవ' అనియే గకారమాత్రవ్యత్యాసముతో పాఠమున్నది.

ఇక్కడ విమర్శకులు— 'గృహాస్నేహావబద్ధానాం నరాణామల్పచేతసామ్। కుస్త్రీ ఖాదతి మాంసాని మాఘమాసే గవామివ॥' (శాంతి-అ139) అను పాఠమునుచూపి 'మాఘమాసము, గోవుల మాంసమును భక్షించునట్లు కుత్సితయువతి లగ్నమనస్కుల వేధించి మనోవ్యథనొందించునట్లు చెప్పబడినది కదా, నీలకంఠుడు వ్రాసిన నిఘంటువే గ్రాహ్యమయితే ఇట నెట్లన్వయించబడును? ఇక్కడ కర్కటీగర్భముపై నిఘంటుజల్పితమునకు కర్కటీగర్భమే" అనిరి. (పు.53.54)

వీరి 'మాఘమాసే' అను సప్తమ్యంతపాఠము నిజమైనచో దానికి 'మాఘమాసము అను వీరి అర్థము తప్పు. వీరి అర్థమే నిజమైనచో సప్తమ్యంతపాఠము తప్పు. వీరుచూపిన పాఠము అసలుపాఠము యొక్క సౌష్టవమునే సూచించుచున్నది.

ఇక్కడ నీలకంఠీయ మిట్లున్నది—

గృహేతి ఖాదతి, స్వాపరాధైస్తం సంతాపయతి శుష్కం కరోతి మాఘమాం-కర్కటీం సేగవాః తదపత్యాని, కర్కట్యా నాశహేతు ర్గర్భ ఏవేతి ప్రసిద్ధమ్ ।"

ఇక్కడ గర్భము కర్కటికి నాశహేతువైనట్లు కుస్త్రీ పురుషునకు నాశహేతు వగునని తాత్పర్యము. ఇది నిర్దుష్టము.

విమర్శకుల కున్నది మాటలలో విసురే తప్ప విషయములో పాటవ మేమియు గనబడదు. వీరికి నిష్కారణనీలకంఠవిద్వేషము శ్రేయస్కరము కాదని తెలుపుచున్నాము.

కూలంకషపాండిత్యప్రతిభ, వశ్యవాక్కు కల మహాభారతవ్యాఖ్యాతపై ఏవో పదిమాటలు నేర్చి విలువలేనివిరుద్ధపు వ్రాతలు వ్రాసి పదే పదే వినిపాతమునకుపాలగువిమర్శకమ్మన్యులు తిరుగుబడుట, భువనములుచేయు వానిపై భాండములు చేయువాడు తిరుగుబడుట వంటిదే.

తక్కువ జ్ఞానము; తప్పులపుస్తకము, తగనిఅహంకారము,తత్త్వజ్ఞదూషణము ఇవి యేకము కాగా బయలుదేరిన పుస్తకము భారతమునకు చేయునది ఉపకారమా? అపకారమా? అది సారస్వతమునకుచేయునది మేలా ? కీడా ? అది తత్త్వజిజ్ఞాసువులకు పూజ్యమా ? త్యాజ్యమా? అనునది పాఠకమహాశయులు నిర్ణయించుకొనవలసిన విషయమే.

విమర్శకులవ్రాతలోని ఆయా విషయములకు చెందియున్నవిఇంచుమించుగా100అంశములు సమీక్షింపబడినవి. అన్నియును పరాస్తమైపోయినవి.

విమర్శకుల వ్రాత ఖండితమైనది కాని తత్త్వకథనములోని వ్రాతగాని, కరపత్రములలోని వ్రాతగాని వీరి వ్రాతచే ఖండితమైనది ఏమాత్రము లేదు. ప్రిప్రథమముగా చూపబడిన వీరిమాటలు క్రియాశూన్యములే; అహంకారపూరితములే.

పాఠకమహాశయులు అశ్రద్ధచేయక ఈసమీక్షను శ్రద్ధతోచదివి విమర్శకుల కోలాహల మెట్లున్నదో దీనిచే వేదవ్యాసమహాభారతమునకు ఎట్టి దుస్థితి నాపరించుచున్నదో గ్రహించి తత్త్వగ్రహణతత్పరులై విద్వన్మార్గ—విమర్శకమార్గములలోని సారాసారములను గ్రహింపవలసినదని కోరుచు ఇంతటితో విరమించుచున్నాడను.

బ్రి. వే. కవిసార్వభౌముల ప్రథమకరపత్రము.

# కర్ణస్వరూపము.



బ్రహ్మశ్రీ బాలవ్యాస వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు అన్నవరసత్యనారాయణస్వామి కళ్యాణమహోత్సవసందర్భమున పై విషయ ముపన్యసించినారు. నేవాసభ కధ్యక్షుఁడను. శాస్త్రిగారా యుపన్యాసములో 'కుంతి చిన్నపిల్ల; పదిమాసములు మోసి కర్ణునిం గనియె' నని చెప్పినారు. కర్ణునిదాతృత్వము, ప్రభుభక్తిలోనగు నుత్తమ గుణము లేమియుం జెప్పక నరకాసురసంబంధముం గల్పించి దుష్టుఁ డని, దుష్టకార్యములు చేసినాఁడని కంఠోక్తిగాఁ జెప్పినారు. ప్రస్తుతము వారు చెప్పిన యితరవిషయము లటులుంచి పై రెండువిషయ ములు మాత్రమే విమర్శించుచున్నాను.

—• బాలాశబ్దవిచారము •—

'ఆషోడశా ద్భవే ద్బాలా' అమరము పదియారువర్షములయీడు గల స్త్రీపురుషులు, బాల యనియు, బాలుఁడనియుఁ జెప్పఁబడుదురు. కాని వానాలప్పలాడుకొను పిల్లలకుమాత్రమే బాలశబ్దముపయో గింతురననొప్పదు. ఇది భారతాదులలో నెట్లు ప్రయోగింపఁబడెనో విచారింతము.

భారతము. నలోపాఖ్యానములో-'చిత్తప్రసాదనీ బాలా దేవానా మపి సుందరీ। న దేవేషు న యక్షేషు తాదృగ్రూపవతీ క్వచిత్ ॥' ఇది దమయంతీవర్ణనము. ఈబాల దేవతాదులమోహింపజేయఁగల సుందరి. ముల్లోకముల నిట్టిదిలేదు. అనుటంబట్టి ఈబాల పదియాఱేడులలోనిదే కాక యంతకు మించినయీడుగలదనియుం దోఁచుచున్నది.

ఆరణ్యపర్వము—రామకథలో— రాముడు సీతంజూచి 'నీవు పరునింటనుంటివిగావున నిన్నుస్వీకరింపను.' అనిన సీత-'తతస్సా సహసా బాలా తచ్ఛ్రుత్వా దారుణం వచః' ఇత్యాది. ఆమె కప్పటికి భూగర్భము మొదలుకొని సుమారు నలువదిసంవత్సరములు. అట్టి సీత నిట బాల యనె వ్యాసులు.

తెలుగుభాగవతములో—'బాలామణి' రుక్మిణి అనియున్నది. రుక్మిణి పెండ్లినాటికి పురుషలక్షణముగలపిల్లగాదు. మహాప్రౌఢ. కనుకనే తండ్రిచేయుపురుషునొల్లక దూరదూరమున ముక్కును మొగ మెఱుంగని కృష్ణునకు జాబు వ్రాసి యొక బ్రాహ్మణునిచ్చి పిలిపించి వేగురు చూచుచుండ వాని రథ మెక్కి లేచిపోయినది. ఈమెను బూదెలో నాడుకొను బాలపాప యందుమా!

రామాయణములో రాముడు వనమున కేగుచు తనతో వత్తు ననుసీతను వారించుచు (అయోధ్యాకాండము 28 సర్గము) 'బాలే దుఃఖ మతో వనం' అనెను. సీత వయస్సప్పటికి సుమారు 25 సంవత్సరములు.

మఱియు భారతములో సత్యవతి భీష్మునితో నేను తొల్లి నావ నడపునపుడు 'సా కదాచి దహం తత్ర గతా ప్రథమయౌవనా। అభి భూయచ మాం బాలాం తేజసా వశమానయత్' పరాశరుఁడు వచ్చియామెతోఁగూడిన సందర్భమున నిట్లు బాలయని ప్రయోగించెను. ఇత్యాదు లనేకప్రయోగములు జూపవచ్చును. గ్రంథవిస్తరభయంబున వాని నిప్పటికి విడిచి—ముఖ్యమైన మఱియొక్కటిమాత్రము చెప్పుచున్నాము. మనశాస్త్రిగారికి 'బాలవ్యాస' అని బిరుదముకలదు. అదివారు తగుదు మనుకొని యుపయోగించుకొనుచున్నారు. వీరిని మనము చిన్నపిల్లవాడని పిలుచు టుచితమందురా? ఇట వా రేమందురో?

మఱియు నీశబ్దము కుంతిపట్ల నెట్లు ప్రయుక్తమో చూతము— ఒకకాలమున కుంతిభోజు నింటికి దుర్వాసుఁడువచ్చి మీయింట కొంత కాలముందును. నాకుభోజనభాజనాదులఁ బరిచర్య చేయింతువా? అని యడుగ నతండు దానికంగీకరించి తన దత్తపుత్రికయగు కుంతిచే పరిచర్య చేయించువాఁడై మునితో 'మమకన్యా మహాప్రాజ్ఞా పృథా నామ యశస్వినీ। శీలవృత్తాన్వితా సాధ్వీ నియతా చైవభామినీ' ఇందు యశస్వినీ, శీలవృత్తా, సాధ్వీ, నియతా అనిచెప్పి. చెమ్మచెక్కలాడుకొను బొట్టి నిట్లు చెప్పుదురా? దీనంచేసి కుంతి ప్రథమయౌవనయే కాక ప్రౌఢయనియుం దెలుచున్నది. అంత కుంతింబిలిచి 'జానామి ప్రణి

ధానం; తే బాల్యా త్ప్రభృతి నందిని'. నీపేర్మా చిన్న తనము నుండి యెఱుంగుదు ననియె. దీన నప్పుడు చిన్నతనముగాక పైనగు పెద్ద తనమే యని తెలియుటలేదా.

—• స ద్యః స్త్రా ల జ న న ము •—

ఇట్లు కయేడు సేవించినంత ముని సంతసించి ఆమెకు మంత్రి ముపదేశించెను. కుంతి మంత్రప్రభావ మరయునంతలో 'ఏవం సంచింత యంతీ సా దదర్శర్తుం యదృచ్ఛయా' ఋతుమతి (ముట్టు) అయినది. స్నాన మైనవెనుక సూర్యు నాహ్వానము చేసినది. (ఆకాలములో చంటిపిల్లలు రజస్వల లగుదు రేమో?) సూర్యుడు దర్శనమిచ్చి ఆమెతో సంగమించెను. వెంటనే గర్భమైనది. కర్ణుఁడు పుట్టెను. ఇట్లాదిపర్వము.

ఆరణ్యపర్వములో 'తతో గర్భ స్సమభవ త్ప్రథాయాః పృథి వీపతే! శుక్లే దశోత్తరే పక్షే తారాపతి రివాంబరే॥ సా బాంధవభయా ద్బాలా గర్భం తం వినిగూహతీ' ఇట 'దశోత్తరేపక్షే' అనగా చైత్రాదిపది మాసములపై నగు మాఘము మొదటిదినమున కర్ణుండు పుట్టె నని నీలకంఠాచార్యులవారు భావార్థప్రదీపికలో వ్రాసియున్నారు. ఇది నెల్లూపగ్గడ భారతములో 'దశోత్తరే' అనుచో పొరపడి పదిమాసములు మోసియని అజ్ఞులు గ్రంథము సంస్కరించియుండిరి. ఆపొరపాటును పురస్కరించుకొని మనవారు కర్ణుఁడు సద్యోగర్భసంభవుఁ డనక పది మాసములుఁ కడుపులోనుండి పిమ్మట పుట్టెనని వాదించుచున్నారు. ఈపదిమాసములు కుంతి యెట్లుగర్భమును దాచుకోగల్గెనో పరమా శ్చర్యమే. సూర్యుని వరప్రభావమున వేరును గర్భమునెఱుంగజాల కుండి రందుమా! అట్లయినచోఁ గర్ణుని గంగలో పడవేయనేమిటకని? ఇంటిలో పెరుగుచున్న నెవరికిం గానిపింపకుండునుగదా!

ఇట్లు కర్ణు డుదయించిన పదంపడి సూర్యుఁడు కుంతికి కన్యాత్వ దోషము లేకుండ వరం బొసంగి కొడుకుం దీవించి దివికిం జనినట్లున్నది. పంచమవేదములో ఇట్లే మున్ను పరాశరుడు సత్యవతియందు సద్యో గర్భమున వ్యాసునిం గని వానిం దనవెంటగొనిపోయె నని మన మెఱుంగుదుము.

శ్రీశాస్త్రిగారి యుపన్యాసములోని రెండు విషయములకు మాత్రమే నాచెప్పినచొప్పున సంక్షేపముగా సమాధానము చెప్పియున్నాను. దీనిపై అవసరముపడె దేని విపులముగా మఱియు ననేక నిదర్శనములతో చెప్పుటయేకాక పూనాలో సర్వభారతములం కోడీకరించి ముద్రించిన భారతములోనగు భారతములలోను విషయ మెట్లున్నదో తెలియం చెప్పుటయేకాక ఉత్తర దక్షిణదేశములలోని పండితుల యభిప్రాయములును స్వీకరించి సప్రమాణముగా ప్రకటించుచున్నాడనని మనవి చేయుచున్నాను. పండితసభలుం జరుపుదును.

మఱియు నీవిషయమేకాక శ్రీశాస్త్రిగారు ఈనడుమ తెలుగులో వచనముగా వ్రాసిన దుష్టచతుష్టయము లోనగు గ్రంథము లన్నియు క్రమముగా విమర్శించి వాని ప్రభావము లోకమునకుం దేటతెల్లము గావించువాఁడనై యిప్పటికింతటితో విరమించుచున్నాను.

రాజమహేంద్రవరము. 10—5—1955

ఇట్లు,
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

# శ్రీ కవిసార్వభౌముల కరపత్రమునకు సమాధానము.



శ్రీ అన్నవరదేవస్థానమునందు, దేవస్థానమువారు కోరిన "భారతము—కర్ణస్వరూపము" అను విషయముపై 3-5-55, 4-5-55 తేదీలలో ప్రస్తావోచితముగా నే నుపన్యసింప బూనుటయు, దుర్వాసో మహర్షి పరిచర్యాకాలమునకును, సూర్యసాన్నిధ్యకాలమునకును కుంతీదేవి బాలయని, మాసపూర్త్యనంతరము కర్ణజననమని, వచనోదాహరణములతో నేను చెప్పుటయు జరిగినది.

బ్రహ్మశ్రీ కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు అప్పు డావిషయమునకు విరుద్ధాభిప్రాయమును ప్రకటించి అప్పటికి కుంతి ప్రౌఢయని, కర్ణునిది సద్యస్కాలజననమని చెప్పి, ఇది యింత

టితో తేలునది కాదనియు, పత్రికాముఖమున దీనిని ప్రకటింతుననియు సభలో ప్రసంగించి 10-5-1955 తేదిని కరపత్రములు ప్రకటించి 17వ తేదీకి పోష్టుద్వారా నాకు బంపినారు.

ఇది దానికి సంక్షిప్తసమాధానము---

—: కుంతియందు బాలాశబ్దప్రయోగము :—

'బాలేతి కృత్వాఽనునయం తవాహం దదాని నాన్యానునయం లభేత।'

ఇది కుంతితో సూర్యుడన్నమాట. దీనినిబట్టి కుంతి దప్పుడు బాల్యావస్థయని తేలుచున్నది. కుంతి సూర్యునితో నిట్లన్నది—

"మయా మన్త్రబలం జ్ఞాతు మాహూత స్త్వం విభావసో ।
బాల్యా ద్బాలేతి తత్కృత్వా క్షన్తు మర్హసి మే విభో ॥"

ఇట్టి బాల్యము యౌవనములో చేరునా ?

కవిసార్వభౌములు అమరమని యుదాహరించిన వచనమయి నను—"ఆషోడశా ద్భవే ద్బాల స్తత స్తరుణ ఉచ్యతే" అని 16 సంవత్సరములలోపల బాల్యమని పిమ్మట యౌవనమని చెప్పుచున్నది. దీనిచే గూడ కుంతి యువతికాదు, బాల యని తేలుచున్నది.

ఇంకొకటి-- బాలాశబ్దము, కన్యాశబ్దము ప్రథమవయస్సును తెలుపును. కనుకనే "వయసి ప్రథమే" అను సూత్రముచే ఙీప్ వచ్చుచుండ "అజాద్యతష్టాప్" అను సూత్రముచే బాలాశబ్దమునకు టాప్ విధింపబడినది. "కన్యాయాః కనీన చ" అని కన్యాశబ్దమునకు టాప్ నిపతింపబడినది. "వయసి ప్రథమే" అను సూత్రమున కుదాహరణము కుమారీశబ్దము.

ఇట్లు 'కన్యా, బాలా, కుమారీ'శబ్దములు ప్రథమవయస్సును తెలుపునట్టివే. యౌవన మను మధ్యమవయస్సు, వార్ధకమను చరమవయస్సు కలవారియందు ఆబాలాదిశబ్దప్రయోగము గౌణప్రయోగమనబడును. కనుకనే—"వృద్ధకుమారీతి తు గౌణః ప్రయోగః" అని తత్త్వబోధిని.

ఇప్పుడు కవిసార్వభౌములు చూపిన ప్రయోగములు దమయంతియందు బాలాశబ్దము, 25, 40 వత్సరముల సీతయందు బాలా

శబ్దము, కృష్ణునకు జాబు వ్రాసి పిలిపించి వానిరథమెక్కి లేచిపోయిన దని వారన్న రుక్మిణియందు బాలాశబ్దము, గౌణప్రయోగమగుటచే శాస్త్రబాధ లేదు. ఇట్లే వారు చూపిన—

సా కదాచి దహం తత్ర గతా ప్రథమయౌవనమ్ ।
అభిభూయ చ మాం బాలాం తేజసా వశ మానయత్ ॥"

అనియున్న సత్యవతీదేవియందలి బాలాశబ్దమును గౌణార్థకమే. కనుకనే నీలకంఠాచార్యులవారు ఇక్కడ "బాలాం పుంయోగ మనిచ్ఛన్తీం బాలామివ' అని వ్యాఖ్యానించిరి.

కుంతియందును ఆ గౌణప్రయోగమే అని యనరాదు. పై శ్లోకములో సత్యవతీపరమైన బాలాశబ్దమునకు గౌణార్థము చెప్పిన నీలకంఠాచార్యులవారు కుంతీపరమైన బాలాశబ్దమున కట్లు చెప్పి నందున నిది ముఖ్యార్థకమే యనవలెను.

'బాలేతి కృత్వాఽనునయం తవాహం దదాని నాన్యానునయం లభేత ।'

అని సూర్యుడు, 'కుంతీ! నాంగా యనునయము నీవు బాల వగుటచేతనే, బాల కానిది యిట్లనునయింపబడదు.' అనుటలో గూడ నది ముఖ్యార్థకమే యని తేలుచున్నది.

ఇక వారు చూపిన "యశస్వినీ, శీలవృత్తా, సాధ్వీ, నియతా" అను కుంతీవిశేషణములయినను బాల్యావస్థయం దసంభవములు కావు కనుక వానినిబట్టి "ఆమె ప్రథమయౌవనయే కాక ప్రౌఢ" అనుట యుక్తము కాదు.

ఇక్కడ "జానామి ప్రణిధానం తే బాల్యాత్ప్రభృతి నన్దిని ।"

"కుంతీ! నీచిత్తైకాగ్ర్యము, బాల్యము (చిన్నతనము)నుండియు నెరుగుదు" నని తండ్రి యనుటలో వా రన్నట్లు అప్పటికి పెద్దతనమే వచ్చెనని భావింపరాదు. బాల్యావస్థలోని యేమధ్యమ చరమభాగ మందో ఉన్నట్టి కుంతితో ప్రథమమునుండియు నే నెరుగుదుననుటలో విరోధ మేమున్నది ?

ఇక్క బాల్యశబ్దమునకు చిన్నతనమని యర్థము చెప్పినవారు 'మయా మన్త్రబలం జ్ఞాతు మాహూత స్త్వం విభావసో । బాల్యాత్'

అను కుంతీవచనములోని బాల్యశబ్దమునకును చిన్నతనమని యర్థము చెప్పవలసినదే కనుక "బాల్యాత్ప్రభృతి" అను వాక్యమునుబట్టి, కుంతిది పెద్దతనమే, చిన్నతనము కాదనుట, ఆమెకు చిన్నతనమే యని చెప్పు కుంతి వాక్యమునకు విరుద్ధము కాదా ?

"ఏవం సంచిన్తయన్తీ సా దదర్శర్తుం యదృచ్ఛయా ।"

అని కుంతి మంత్రపరిభావ మరయునంతలో ఋతుమతియైనట్లు చెప్పబడినది. ఆ కాలములో చంటిపిల్లలు రజస్వల లగుదురేమో అని వారు వ్రాసినారు. ఆ రజోదర్శనమునుబట్టి ఆమె బాల కాదని భావించువారుందురేమో కాని, మహర్షికి పరిచర్యచేసినట్టి యామెను చంటపిల్లయని భావించువా రుండరనుకొందును. ఆ రజోదర్శనమయినను యాదృచ్ఛికమె కాని వయఃప్రయుక్తము కాదని పై శ్లోకములోని "యదృచ్ఛయా" అను పదము తెలుపుచున్నది. ఆపై—

"వ్రీడితా సాఽభవ ద్బాలా కన్యాభావే రజస్వలా"

అను ఉత్తరార్థము బాల్యములో రజోదర్శనమయినందులకు ఆమె వ్రీడితురాలయినట్లు చెప్పుచునే యున్నది.

కనుక కుంతీపరమైన బాలాశబ్దము ముఖ్యార్థకమే; ఆమెది బాల్యమే.

—• కర్ణ జననము •—

ఇది సద్యస్కాలజననమని కవిసార్వభౌముల వాదము— "కర్ణుడుపయించిన పదంపడి సూర్యుడు కుంతికి కన్యాత్వదోషము లేకుండ వరంబొసంగి కొడుకుం దీవించి దివికిం జనినట్లున్నది" అని వారువ్రాసిరి.

వారన్నట్లు పుట్టినపుత్రుని దీవించి సూర్యుడు వెళ్ళినట్లు లేదు. పుత్రుని నీవు కనగలవనియు, నీవు కన్యవే కాగలవనియు చెప్పి వెళ్ళినట్లును, ఆమె గర్భవతియైనట్లును ఉన్నది. చూడుడు—

"సాధయిష్యామి సుశ్రోణి ! పుత్రం వై జనయిష్యసి ।
సర్వశస్త్రభృతాం శ్రేష్ఠం కన్యా చైవ భవిష్యసి ॥
తతో గర్భ స్సమభవ త్పృథాయాః పృథివీపతే ।
శుక్లే దశోత్తరే పక్షే తారాపతి రివాంబరే ॥" అని.

ఆపై యామె గర్భధారణచేసియున్నట్లును, దాదియొంతురుతప్ప అది యెవ్వరు తెలిసికొనలేకపోయినట్లును, కొంతకాలమున కామె ప్రస వించినట్లును ఉన్నది. చూడుడు—

"సా బాంధవభయా ద్బాలా గర్భం తం వినిగూహతీ।
ధారయామాస సుశ్రోణీ న చైనాం బుబుధే జనః॥
న హి తాం వేద నార్యన్యా కాచి ద్ధాత్రేయికా మృతే।
తతః కాలేన సా గర్భం సుషువే వరవర్ణినీ॥" అని.

ఆంధ్రభారతమందును ఇట్లే యున్నది—

ఆ. "మత్సమాగమనమున మదిరాక్షి నీదు క
న్యావ్రతంబు చెడదు నందనుండు
నధికతేజు డుదయ మగు నిన్ను లోకనిం
దయును బొందకుండు దథ్య మబల !

వ. అని యొడంబఱిచి సూర్యుండు దత్సమాగమంబునం బ్రీతుం డయి దానికి గర్భాధానంబు సేసి గగనంబున కరిగె...గర్భం బును...అభివ్యక్తం బయ్యును బ్రభాకరు మహిమంజేసి లోక విదితంబు గాకుండె...పదియగు మాసంబున...కొడుకుగనియె."

దీనిని బట్టి కర్ణునిది సద్యస్కాల జననమనుమాట సంస్కృతాంధ్ర భారతములలో లేదని స్పష్టమగుచుండ, కవిసార్వభౌములు—

"ఎఱ్ఱాప్రగ్గడ భారతములో 'దశోత్తరే' అనుచోట పొరబడి 'పదిమాసములు మోసి' అని యజ్ఞులు గ్రంథము సంస్కరించియుం డిరి. ఆ పొరపాటును పురస్కరించుకొని మనవారు కర్ణుడు పదిమాస ములు కడుపులోనుండి పిమ్మట పుట్టెనని వాదించుచున్నారు" అని యెట్లనిరో తెలియకున్నది.

శ్లోకానుగుణమైయున్న పై యాంధ్రగ్రంథము అజ్ఞులచే సంస్క రింపబడిన దనుట న్యాయమా ?

"తతః కాలేన సా గర్భం సుషువే" అను వాక్యమునుబట్టి పది మాసములు మోసినట్లు చెప్పబడినది కాని 'దశోత్తరే' అను మాట కపార్థముచేసి యది చెప్పబడలేదు.

"దశోత్తరే పక్షే— చైత్రాది పదిమాసములపై నగు మాఘము మొదటిదినమున కర్ణుడు పుట్టెను. అని నీలకంఠాచార్యుల వారు వ్రాసియున్నారు" అని కవిసార్వభౌము లనియున్నారు. ఆ నీలకంఠాచార్యవాక్య మిట్లున్నది— "మాఘశుక్లప్రతిపది కర్ణనిషేక జన్మేత్యర్థః" అని. దీనికి ఆనాడు కర్ణుడు పుట్టెనని యర్థము కాదు. అట్లయినచో 'కర్ణజన్మ' అనిన చాలును. నిషేకశబ్దమెందులకు? అది కర్ణనిషేకజన్మకాని కర్ణజన్మ కాదనుటకే. భూపతనము కర్ణజన్మ, గర్భప్రవేశము కర్ణనిషేకజన్మ. కనుక నీలకంఠాచార్యులవారు సద్యస్కాలజననము చెప్పలేదని స్పష్టము.

"పదిమాసములు కుంతి యెట్లు గర్భము దాచుకోగల్గెనో, సూర్యుని వరప్రభావమున గర్భము నెఱుంగజాలకుండి రందురా? అట్లయినచో గర్ణుని గంగలో పడవేయనేమిటికి? ఇంటిలో పెరుగుచున్న నెవరికిం గానిపింపకుండునుగదా!" అని కవిసార్వభౌములు ప్రశ్నించుచున్నారు.

'గుహ్య మేత త్తు దేవానాం కథయిష్యామి తేఽనఘ।
క్షత్రం స్వర్గం కథం గచ్ఛే చ్ఛస్త్రపూత మితి ప్రభో॥
సంఘర్ష జనన స్తస్మా త్కన్యాగర్భో వినిర్మితః।'

యుద్ధకారణముగా వైరాగ్న్యుద్దీపకమైన కన్యాగర్భము నిర్మితమైనది. ఇది దేవరహస్యము అని నారదుడును,

'కన్యా గర్భం సమాధత్త భాస్కరా న్మాం జనార్దన।
ఆదిత్యవచనా చ్చైవ జాతం మాం సా వ్యసర్జయత్॥'

సూర్యుని యాజ్ఞచేతనే పుట్టినవెంటనే నన్ను ఆమె విడిచిపెట్టినదని కర్ణుడును చెప్పియుండుటచే ఆకర్ణుడు ఇంటిలో పెరుగుటకుబుట్టింపబడినవాడుకాడు కనుక వారిప్రశ్న కవకాశము లేదు. ఇట్లు కర్ణుడు సద్యస్కాలజాతుడు కాడు. అనంతరకాలజాతుడే. కుంతి ప్రౌఢ కాదు, బాలయే. అని సారాంశము. ఇది మహాభారతతత్త్వకథనార్థమై గ్రస్థ సమన్వయప్రధానమయిన సమాధానము.

పూజ్యులగు కవిసార్వభౌములు వ్రాయుటలో—

'శ్రీ శాస్త్రిగారు వ్రాసిన 'దుష్టచతుష్టయము' లోనగు గ్రంథము లన్నియు క్రమముగా విమర్శించి వాని ప్రభావము లోకమునకు దేటతెల్లము గావించువాడను' అని వ్రాసిరి.

ఇంత పరిపూర్ణానుగ్రహము వారు చూపబూనినందులకు నేనెంతయు సంతసించుచున్నాను.

పిఠాపురము
21-5-1955

ఇట్లు,
వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి.

# 2 కరపత్రము.

నేను ప్రకటించిన మొదటి కరపత్రమునకు సంక్షిప్త సమాధానమని బాలవ్యాస బ్రహ్మశ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఏడుపేజీల వ్యాసము వ్రాసి ప్రకటించినారు. అది మహాపండితులెందరో పరిశీలించిన వ్యాసమై యుండునని యించుక జంకితిని గాని చూచినంత దాని బండారము బట్టబయలైనది. దానిమొదట బాలా శబ్దముచేతనే కుంతి చంటిపిల్ల యనియు, తెలుగు భారతోక్తిచేతనే కర్ణుని పదిమాసములు మోసి కన్నదనియు పాడినదే పాడరా అనునట్లు పాడినారు. ఇట వారు వ్రాసినవ్రాతలు వారివాదమును పోషించునవికాక నావాదమునే పలువిధముల పోషించుచున్నవి. పాపము శాస్త్రిగారికి నేను శ్రమ గలిగించితినని విచారించితిని. ఏమి చేయుదును ? నేను నాభారతములోని వ్రాతలు సమర్థించుకోవలసిన భారము నాది కనుక యిట్లు పూజ్యపాదులతో ప్రతిఘటింపవలసినవాడ నైతిని.

శాస్త్రిగారి భారతవిమర్శనమునకుఁ గూడ మార్గదర్శిని నేనే. పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు మహాభారతమును నిరసింప నేను సర్వవిధముల వానిని ఖండించి విమర్శనము వ్రాసి ముద్రించితిని. ఆవిషయములనే స్వీకరించి శాస్త్రిగారు వ్రాత కుపక్రమించినారు. వీరు నాశత్రువునకు శత్రువులై నాకు మిత్రములైరని సంతసించితిని.

ఇప్పటి యీ ధోరణింబట్టి చూడగా శాస్త్రిగారి వ్రాతలలో నిత్యా ప్రమాదములు పడియుండునని సందేహింపనై యున్నది.

ఇట్టి శాస్త్రిగారి కరపత్రములోని వ్రాతల బలాబలముల మాత్రము విమర్శింతును. బాల యనగా 5, 6 సంవత్సరముల పిల్ల యని శాస్త్రిగారి యభిప్రాయము. అట్టిపిల్లలకేగాక ప్రథమమధ్యవ యౌవనములలోని స్త్రీలకును బాల యని వ్యాసాదులు వాడిరని నాయభిప్రాయము. శాస్త్రిగారిట కొన్ని నిదర్శనములు చూపినారు అవి హాస్యాస్పదమనిన నెగిరిపోవుననియే. తాలు.

"బాల్యా ద్బాలేతి తత్కృత్వా" అనుచో—కుంతి సూర్యు నితో నేను ఆరితేరినదానను గాను; చిన్నదానను; తెలియక నిన్నిట్లు పిలిచితిని; క్షమింపు మన్నది. లోకవ్యవహార మిట్లే యుండును. దీనం జేసి కుంతి పిల్ల యన నొప్పదు. ఇట్టిబాల్యము యౌవనమునం జేరునా యని వీరిప్రశ్న. మూమ్మాటికిని చేరునని సమాధానము.

"ఆషోడశా ద్భవే ద్బాలా" ఇది నే వ్రాసినదే. పదియాఱేండ్లది బాల యనబడును. ఇది నావాదమును బోషించునదియే. కుంతి 16 సంవత్సరముల యీడుగలదనిన నాకు సమ్మతమే. బాలా, కన్యా, కుమారీ, యీ శబ్దములు ప్రథమవయస్సు గలవారికిం జెల్లు ననిరి. ఇదియు నావాదమునకుం బనికి వచ్చునదియే, కుంతి 10యేండ్లవయస్సు గలదని వీరు చెప్పినను నా కంగీకారమే. "అత ఊర్ధ్వం రజస్వలా" యనుటం జేసి నావాదమును సరిచేసికోవచ్చును. బాలాశబ్దము వృద్ధ స్త్రీలకును బ్రయోగింతురు కాని యది గౌణమట! గౌణమన ముఖ్యము గానిది. గౌణమని వీ రెట్లు చెప్పగలరు? వృద్ధను బాలయని యెవ్వరు ప్రయోగించినారు? వ్యాసులా? వాల్మీకులా? అదియును నావాదమును బోషించు నదియే. రుక్మిణి మగనితో లేచిపోయినపుడు బాల యనుట గౌణమే నట! వీరిస్వప్నములో వ్యాసభగవానులు చెప్పి యున్నారేమో? ఇదియు నావాదమునే బలపఱుచుచున్నది.

"సా కదాచి దహం తత్ర గతా ప్రథమయౌవనం। అభిభూయచ మాం బాలాం తేజసా వశ మానయత్" ఇది నే నిచ్చినప్రయోగమే.

సత్యవతి ప్రథమయౌవనయై యున్నప్పుడు బాలయని పరియోగము. గౌణప్రయోగమనిరి. ఎట్లనిననంపుదు. ఇట నీలకంఠులు ఏమో వ్రాసి నారట! వినుండు. "బాలాం పుంయోగ మనిచ్ఛంతీం బాలా మిష" అని; కానిందు. ఇం దేమిపరిమాణమున్నది? ఒకప్పుడు యువతి కూడ పురుషసంయోగ మిచ్ఛగింపదు. ఇది యొకపరిమాణమా? కాదు.

"బాలేతి కృత్వానునయం" నీవు బాలవు; ఆరి తేరినదానివు కావు; కావున ని న్ననునయించుచున్నాను. అని సూర్యుఁ డనెను. ఇందులో చంటిపిల్ల యనునర్థము లేదు. ముమ్మాటికిని లేదు "యశస్వినీ, శీలవృత్తా, సాధ్వీ, నియతా" మంచి కీర్తిగలది; శీలవంతురాలు; సాధ్వియని చంటిపిల్లలను సంబోధింతు రని శాస్త్రిగారనుచున్నారు. "ఇవి బాల్యావస్థయందును అసంభవములు కావు" అనిరి శాస్త్రి గారు. ఇట లోకమే చెప్పును. "బాల్యాత్ప్రభృతి" బాల్యమునుండి నే నెఱుంగుదును. అనుటలో అప్పటికి బాల్యము లేదని భావింప రాదఁట! హా! హా! హా!

కర్ణజననమని వ్రాసినవ్రాతలలో కుంతిపదిమాసములు మోసి కర్ణునిం గనినట్లు లేదు. శ్లోకార్థము తెలియనివారి కందేదో యున్న దని భ్రాంతి కలిగించుట కావ్రాతలు అందులో "నీవు పుత్రునిం గందువు. వాఁడు గొప్పవాఁడగును" ఇత్యాద లున్నవి. ఇట వారి వ్రాత లోకపరితారణార్థమే.

"తతః కాలేన సా గర్భం సుషువే" ఇట కాలశబ్దముచే 10 నెల లని కాని 10 ఏండ్లని కాని చెప్పనొప్పదు. సద్యోగర్భము ౹౪ గడియ లలో జనించునని శాస్త్రము. ఇట కాలశబ్దమునకు నాకాలమే చెప్ప నగు లేకున్న నీలకంఠాచార్యులవారు "దశోత్తరేపక్షే" యనుచో "మాఘశుక్లప్రతిపది కర్ణనిషేక జన్మేత్యర్థః" అని యేమిటికి వ్రాయు దురు. ఇట మాఘశుక్ల మన నేమియర్థము చెప్పుదురు? దశోత్తరే యనుచోట అజ్ఞులు పొరపాటుపడి తెలుగులో "పదినెలలు మోసి" కర్ణునిం గనియె ననుట న్యాయ్యముకాదట! శాస్త్రిగారు తెలుగు భారతాదులు చూచియుండ రేమో? సంస్కర్తలు పాడుచేసినస్థలము లొండు రెండు చూపుదును.

ఆదిపర్వములో భీష్ముండు—— "ధృతరాష్ట్రు నాంబికేయు రాజ్యాభిషిక్తుం జేసి; కుమారాయితశక్తి నాతి ధృతరాష్ట్రుఁడు రాజ్యము చేయుచుండఁగా" అని యున్నది. మూలములో "ధృతరాష్ట్రస్త్వచక్షుష్ట్వా ద్రాజ్యం న ప్రతిపద్యత" దీనికి భిన్నముగా ధృతరాష్ట్రుఁడు రాజై సట్లున్నది. ఇట్లు చెప్పి పైన ముందే 10 పేజీలమీద "పైతృకం ఒగు లక్ష్మి పాండుభూపతి మున్ను దాల్చుటచేసి తత్తనయుఁడైన ధర్మజుఁ డిప్పుడ తాల్చు" అని దుర్యోధనుఁడు తండ్రితో చెప్పినాడు. దీనం జేసి పాండురాజు కురుదేశమునకు రాజై సట్లున్నది. మూలములో నిట్లు రెండువిధములుగా నున్నదని శాస్త్రిగారు చెప్పగలరేమో? కావున తెలుగులోని పదిమాసములు మోసెనను మాట సరియైనది కాదు. దానింబట్టి యాగులాడ నక్కఱలేదు.

ఇట్లు ఏవేవో కొన్ని యసందర్భములు వ్రాసి ఫలితార్థమని "కర్ణుఁడు సద్యస్కాలజనితుఁడు కాడు. కుంతి బాలయే (అనగా 5, 6 సంవత్సరముల చిన్నపిల్ల) యని తేల్చినారు. ఇట్లుండు వారి వ్రాతలు నాకు నచ్చవు. నా వ్రాతలు వారికి నచ్చవు. ఇంతటితో వారు గాని, నేను గాని ఇట్టివ్రాతలు వ్రాయుచు కాలక్షేపముచేయక ధర్మనిర్ణయము చేయుటకు నొక మహాపరిషత్తు ఆవశ్యకమైయున్నది. దాని విషయమై మే ముభయులమును బ్రయత్నించు టుత్తమోత్తమము.

ఓహో శాస్త్రిగారూ! మనమింక వ్రాతలు చాలించి ఈనివిషయమై సభకు ప్రయత్నింతము—మీరొక పండితుని, నేనొకపండితుని ఎన్నుకొందము. వారిద్దరు మఱియొకపండితు నెన్నుకొందురు. వారు మూవురు ఒక కమిటీగా నేర్పడ మీరు 5 వందలు నేను 5 వందలు వారిచేతికిత్తము. వారు మనదేశములో నితరదేశములలో వారికి వ్రాసి జవాబులు తెప్పించి పదుగుర సమావేశముచేసి వారిచ్చవచ్చిన చోట సభ చేయింతురు. వారే విచారము చేసి ధర్మనిర్ణయము చేయుదురు. మనము వారి తీర్మానముప్రకారము ప్రవర్తింతము. నేనోడిన నారూప్యములు వదలుకొని నాభారతము దిద్దుకొందును; మీరోడిన మీరూప్యములు వదలుకొని మీపుస్తకములు దిద్దుకొందురు. ఇట్లు

మరంగీకరించి తెలిపినచో నాపక్షపండితు నెన్నిప్రకటించుచు రూప్యములు సిద్ధముచేయుదును. మీయభిప్రాయమునకై యెదురుచూచుచున్నాను. మీఅంగీకారము 10 దినములలో తెలుపప్రార్థన.

ఇట్లు,
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

బ. వే. కవిసార్వభౌముల ద్వితీయకరపత్రమునకు

# సమాధానము.

బ్రహ్మశ్రీ కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు నేను ప్రకటించిన సమాధానపత్రముపై ద్వితీయకరపత్రమును ప్రకటించి, 6—6—55 తేదీని పోష్టుద్వారా నాకు పంపినారు. ఇది దానికి సమాధానము. మూలగ్రంథమునుబట్టి కుంతి బాల యని, కర్ణుడు అనంతరజాతుడని నామతము. కుంతి ప్రౌఢయని, కర్ణుడు సద్యస్సంజాతు డని శ్రీకవిసార్వభౌముల మతము ఇట్టి మతభేదముతో వాద మారంభమైనది.

—• కవిసార్వభౌముల మాటలు •—

“నేను ప్రకటించిన మొదటి కరపత్రమునకు సమాధాన మని శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు పదుపేజీల వ్యాసము వ్రాసి ప్రకటించినారు. అది మహాపండితు లెందరో పరిశీలించిన వ్యాసమై యుండు నని యెంచుక జంకితిని గాని చూచినంత దాని బండారము బట్టబయలైనది.”

‘దాని మొదట బాలాశబ్దముచేతనే కుంతి చంటిపిల్ల యనియు, తెలుగుభారతోక్తిచేతనే కర్ణుని పదిమాసములు మోసి కన్నదనియు ‘పాడినదే పాడరా’ అనినట్లు పాడినారు.’

“ఇట వారు వ్రాసిన వ్రాతలు వారి వాదమును పోషించునవి కాక నా వాదమునే పలువిధముల పోషించుచున్నవి.”

“పాపము ! శాస్త్రిగారికి నేను శ్రమ కలిగించితి నని విచారించితిని, ఏమి చేయుదును ? నా భారతములోని వ్రాతలు సమర్థించు

కోవలసిన భారము నాది కనుక ఇట్లు పూజ్యపాదులతో ప్రతిఘటింప వలసినవాడ నైతిని."

"శాస్త్రిగారి భారతవిమర్శనమునకుగూడ మార్గదర్శిని నేనే" అని.

ఈ మొదలైన మాటలు ప్రతివచననిరపేక్షములు.

—॰ విషయ విమర్శనము ॰—

"ఇట శాస్త్రిగారి కరపత్రములోని వ్రాతల బలాబలములు మాత్రము విమర్శింతును. బాల యనగా 5, 6 సం॥రముల పిల్ల యని శాస్త్రిగారి యభిప్రాయము. అట్టి పిల్లలకే గాక ప్రథమమధ్యమ యౌవనములలోని స్త్రీలకును బాల యని వ్యాసాదులు వాడి రని నా యభిప్రాయము" అనిరి.

ఇక్కడ వారి యభిప్రాయమును వారు చెప్పుకొనవచ్చును కాని ఇంతయని వయోనిర్దేశము చేయని నాయొక్క అభిప్రాయమును అంకెలతో వారు చూపుట యుక్తమా ? 'ప్రథమమధ్యమ యౌవనములు' అని యౌవనమునకు భాగకల్పనచేసినట్టి కవిసార్వభౌములు బాల్యమునకును భాగకల్పన చేయుట కేల సమ్మతింపరు ? సమ్మతించినపుడు— 'మయా మన్త్రబలం జ్ఞాతు మాహూత స్త్వం విభావసో ! బాల్యాత్' అను కుంతీవచనమునుబట్టి ఆమెది బాల్యావస్థయే యనియు, జానామి ప్రణిధానం తే బాల్యా త్ప్రభృతి, అను తండ్రిమాటలో ఆ బాల్యావస్థలోని ప్రథమభాగమునుండియు నిన్నెరుగుదు నని యర్థ మనియు సమన్వయించుట కడ్డేమున్నది ?

ప్రత్యేకమున వయోవాచకము బాలాశబ్ద మని శాస్త్ర ముద్ఘోషించుచుండ ఆ శాస్త్రమును వ్యాసాదులు త్రోసివేసి అనియతముగా యువతులయందును బాలాశబ్దమును వాడినా రనవలయునా ? గౌణార్థకముగా నచ్చట వాడినా రనవలయునా ?

'రుక్మిణి మగనితో లేచిపోయినపుడు బాల యనుట గౌణమే నట. వీరిస్స్వప్నములో వ్యాసభగవానులు చెప్పియున్నారేమో" అనిరి.

వీరికి గౌణప్రయోగము లనుట కిట్టనట్లున్నది. వీరు శబ్దశాస్త్రము నేమిచేయదలచినారో.

"శాస్త్రిగారట కొన్ని నిదర్శనములు చూపినారు. అవి పూర్వపక్షమనిన నెగిరిపోవునవియే" "బాల్యాద్బాలేతి తత్కృతత్వా" అనుచో కుంతి సూర్యునితో నేను చిన్నదానను, తెలియక నిన్నిట్లు పిలిచితిని. క్షమింపుమన్నది. లోకవ్యవహార మిట్లే యుండును. దీనంచేసి కుంతి పిల్లయన నొప్పదు. ఇట్టి బాల్యము యౌవనమున జేరునా? అని వీరిప్రశ్న. ముమ్మాటికిని జేరు నని సమాధానము"

"ఆషోడశా ద్భవే ద్బాలా। ఇది నేవ్రాసినదే, పదియారేండ్లది బాల యనబడును. ఇది నావాదమును పోషించునదియే." అనిరి.

వీరిక్కడ, ప్రథమ మధ్యమ వయస్సులను, బాల్యయౌవనములను ఏకము చేసినారు. వీరు ప్రమాణముగా గ్రహించిన అమరములో- "శిశుత్వం శైశవం బాల్యమ్" అనియు, "తారుణ్యం యౌవనం సమే" అనియు, బాల్యయౌవనములకు భేదము చెప్పబడినది. "ఇది నేవ్రాసినదే" అని వారన్న 'ఆ షోడశాత్' వచనము వారిచే మార్పుగా ప్రదర్శింపబడినది. అసలది అమరవ్యాఖ్యలో నిట్లున్నది— 'ఆషోడశా ద్భవేద్బాల స్తత స్తరుణ ఉచ్యతే' అని. ఇచ్చట యౌవనమునకు పూర్వస్థితి బాల్యమని, ఆ బాల్యము 16 ఏండ్లకు లోబడిన వయస్సని చెప్పబడియుండ "బాల్యము యౌవనమున ముమ్మాటికిని చేరును" 'పదియారేండ్లది బాల యనబడును' అను వారి మాటలు అమరమునకును విరుద్ధమగుచుండ 'ఇది నా వాదమును పోషించునదియే" అని వారెట్లు వ్రాసిరో తెలియకున్నది.

"బాలా కన్యా కుమారీ- ఈ శబ్దములు ప్రథమవయస్సుకలవారికి చెల్లుననిరి. ఇది నావాదమునకు బనికివచ్చునదియే, కుంతి 10 యేండ్లవయస్సు గలదని వీరు చెప్పినను నా కంగీకారమే. 'అత ఊర్ధ్వం రజస్వలా' అనుటంజేసి నావాదమును సరిచేసికోవచ్చును" అనిరి.

అయితే "అష్టవర్షా భవే ద్గౌరీ నవవర్షా తు రోహిణీ। దశవర్షా భవే త్కన్యా అత ఊర్ధ్వం రజస్వలా" అను వచనము 10 ఏండ్లది కన్య యని ఆపై వయస్సు కలది రజస్వల యని చెప్పుచుండ.

'కుంతి ప్రథమయౌవనయే కాక ప్రౌఢ యనియుం దేలుచున్నది.' 'మంత్రప్రభావ మరయునంతలో కుంతి ఋతుమతియైనది.'

అను తమవాదమును, కుంతి 10 యేండ్లవయస్సు కలదని చెప్పి నపుడు కవిసార్వభౌము లెట్లు సరిచేసికొనగలుగుదురో తెలుపగోరు చున్నాను.

"సత్యవతి ప్రథమయౌవనయై యున్నపుడు బాలయని ప్రయోగము గౌణప్రయోగ మనిరి. ఎట్లనిన నందురు నీలకంఠులు ఏమో వ్రాసినారట, ఏసుందు "బాలాం పుంయోగ మనిచ్ఛన్తీం బాలామివ" అని. కానిండు. ఇందేమి ప్రమాద మున్నది ? ఒక ప్పుడు యువతికూడ పురుషసంయోగ మిచ్ఛగింపదు. ఇది యొక ప్రమాణమా ? కాదు." అనిరి.

వీరు ప్రమాణము కాదన్నది యేది ? శ్లోకములోని బాలా శబ్దమా? నీలకంఠుల వ్యాఖ్యానమా? వీరు దాని కేమర్థము జేసికొనిరో.

"బాలేతి కృత్వాఽనునయమ్. నీవు బాలవు కావున నిన్నను నయించుచున్నాను. అని సూర్యు డనెను. ఇందులో చంటిపిల్ల యను నర్థములేదు. ముమ్మాటికిని లేదు." అనిరి.

చంటిపిల్ల యను నర్థము అందున్నదని వారికి చెప్పినవారెవరో!

"యశశ్విని...అని చంటిపిల్లలను సంబోధింతు రని శాస్త్రిగా రనుచున్నారు. 'ఇవి బాల్యావస్థయందును అసంభవములు కావు.' అనిరి."

అని వ్రాసిరి. ఈనా మాటలలో చంటిపిల్ల యని యున్నదా ?

"బాల్యాత్ప్రభృతి, బాల్యమునుండి నేనెరుంగుదును. అను టలో నప్పటికి బాల్యము లేదని భావింపరాదట, హోహోహో" అనిరి.

దీనికి ప్రతివచనము వెనుక జెప్పబడియున్నది.

విషయ మిట్లుండ, నావ్రాతలు నావాదమును పోషించునవి కాక వారివాదమునే పోషించుచున్న వని కవిసార్వభౌము లెట్లనిరో !

## —• కర్ణజననమునుగూర్చి •—

"కర్ణజనన మని వ్రాసినవ్రాతలో కుంతి పదిమాసములు కనినట్లు లేదు."

అని కవిసార్వభౌము లనిరి. అయితే సద్యస్కాలమున గనినట్లు కాని, 9 గడియలలో గనినదని కాని వారన్నట్లున్నదా ? అని నాప్రశ్న.

శ్లోకార్థము తెలియనివారి కందేదో యున్నదని భ్రాంతి కల్గించుట కావ్రాతలు ఇట వారివ్రాత లోకప్రతారణార్థమే' అని

శ్లోకార్థము తెలిసిన కవిసార్వభౌములపట్ల అభ్రాంతికాని అప్రతారణ కాని సంభవింపనివే కనుక వారి నుద్దేశించి వ్రాసిన నావ్రాత కాదోష మాపాదింపబడనేరదు.

"తతః కాలేన సా గర్భం సుషువే, ఇట కాలశబ్దముచే 10 నెలలు చెప్పనొప్పదు. సద్యోగర్భము 9 గడియలలో జనించు నని శాస్త్రము ఇట కాలశబ్దమునకు నాకాలమే చెప్పనగు, లేకున్న నీలకంఠాచార్యుల వారు- (మాఘ శుక్లప్రతిపది కర్ణనిషేకజన్మేత్యర్థః) అని యేమిటికి వ్రాయుదురు.' అనిరి.

సద్యోగర్భము 9 గడియలలో జనించునని యున్న ఆశాస్త్రమేది ? సద్యోగర్భమని మూలమం దెక్కడ నున్నది ? తతః కాలేన అనుచోట 9 గడియ అని చెప్పుటకు ఆ నీలకంఠోక్తి యుపష్టంభకమెట్లు ? ఆ నీలకంఠీయములోని (కర్ణనిషేకజన్మ) అను దాని కర్థమేమి దాని యర్థము నా ప్రథమసమాధానములో సూచింపబడి యుండ నది యగు నని, కాదని చెప్పకుండుటకు కారణమేమి ?

వారి సద్యస్కాలజనన వాదము 9 గడియలవరకు జరిగినది. ఇప్పుడు "కర్ణు డుదయించిన పదంబడి సూర్యుడు కుంతికి వరంబొసంగి కొడుకుం దీవించి దివికిం జనినట్లున్నది."

అని వారి ప్రథమకరపత్రములో నున్నట్లు సూర్యుడు 9 గడియలు అక్కడనే యుండి ఆపై వెళ్ళెనని వా రంగీకరింతురా ?

"ఏవేవో కొన్ని యసందర్భములు వ్రాసి ఫలితార్థమని 'కర్ణుడు' సద్యస్కాలజనితుడు కాడు, కుంతి బాలయే, అని తేల్చినారు. ఇట్లుండు వారి వ్రాతలునాకు నచ్చవు. నావ్రాతలు వారికి నచ్చవు." అనిరి.

మాటలు నచ్చక వ్రాతలు వచ్చినవి. అవియు నచ్చవా ? వ్రాతలు దోషసహితము లని నచ్చవా ? దోషరహితములైనను నచ్చవా ! దోషసహితములైన నచ్చకుండుట యుక్తము. నచ్చవనువారు ఆ దోషములను ప్రకటించుట యుక్తము.

"ఓహో ! శాస్త్రిగారూ మనమింక వ్రాతలు చాలించి దీని విషయమై సభకు ప్రయత్నింతము. ముగ్గురు పండితులు, మీరు 5 వందలు నేను 5 వందలు వారి చేతికిత్తము. వారీవిచారముచేసి ధర్మనిర్ణయము చేయుదురు. మనము వారి తీర్మానముప్రకారము ప్రవర్తింతము...మీ యభిప్రాయమునకై 'ఎదురుచూచుచున్నాను.'' అని వ్రాసిరి.

వారన్నట్లు హుఫ్ఫుమ్మనిన నెగిరిపోవు నిదర్శనములు గల వాదము నెగురగొట్టుటకై అయిదేసి వందలనుగూడ పరులపాలు చేయవలెనా ? అట్లు కాకుండ ధర్మనిర్ణయాభిలాషులమయిన మనము విషయప్రధానముగను, మూలగ్రంథసమన్వయప్రధానముగను వ్రాయుచుండుటలో గ్రంథతాత్పర్యమూలకమైన ధర్మనిర్ణయమా సంభవించును. పాఠకులా వ్యుత్పన్ను లగుదురు. అట్లు చేయుటే నాయభిప్రాయ మని పూజ్యపాదులగు శ్రీ కవిసార్వభౌములకు మనవి చేసికొనుచున్నాను.

ఇట్లు,

పి ఠా పు ర ము. వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి.

శ్రీ క వి సా ర్వ భౌ ము ల తృ తీ య క ర ప త్ర ము.

# నా మ వి.



శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారూ ! మన వాదోపవాదములు మాటలతో వ్రాతలతో నింతవఱకు నడచినవి. అందున ధర్మనిర్ణయము కాలేదు, కాదు. కావున మహాసభయొకటి కావింతము. సభానిర్ణయము మన మంగీకరింతము. అని తెలిపితిని. దానికి మీ రంగీకరింపక కాలక్షేపమార్గము సూచించితిరి. అదిపనికిరాదు. సభ కంగీక

రింపనివాఁడు మీ వాదమోడిపోయిన దని నేను చెప్పుటయే కాక లోకమును జెప్పును. ముల్లోకములందు నా వాదమునకే జయము నిశ్చయము.

మీద్వితీయకరపత్రములో- బాలయన 5-6 సంవత్సరములపిల్ల యని మీరు నిర్దేశము చేయలేదు, అట్లుమీయభిప్రాయమేమో యని నేనూహించి వ్రాసితిని. సరే! మీరనినబాల యెన్నిసంవత్సరములదో యిప్పుడు నిర్ణయించి చెప్పుడు. నేను యౌవమునకు భాగకల్పనము చేసినట్లు మీరిపుడు బాల్యమునకు ప్రథమ మధ్యమాదిభాగకల్పనము చేసి చెప్పుడు చూతము. మీవ్రాతలు నావాదమును బోషించునవి యని మీకుఁ దెలియదు. తెలిసిన నేమిటికట్లు సూచింతురు? "ఆషోడ శాత్" ఇట నేనపార్థముచేసికొంట ననుచున్నారు. మీ యర్థమే నా యర్థము. 16 యేండ్లదానిని బాల యనవచ్చుననిన నాకు సమ్మతమే యంటిని. నా యపార్థమేది ? ఈ సందర్భమున మీ వ్రాతలు నా వాద మును బోషించుచున్నవో లేదో మఱియొకసారి విచారింపుఁడు "బాలాం పుంయోగమనిచ్ఛంతీం" పుంయోగ మొకప్పుడు కారణాంత రములచేత యువతులు గూడ నిచ్ఛగింపరు. ఇది నా వాదమును బోషింపదా ? ఇట మీరు చాల ప్రమాదపడుచున్నారు. 'చంటిపిల్ల (అనగా చిన్నపిల్ల) అను నర్థమందున్నదని వారి కెవ్వరు చెప్పినారు?' అంటిరి. మీరే, మీ యుపన్యాసములో చెప్పినారు. కరపత్రములలో వ్రాసినారు. కాదందురా ? అయినచో ఎట్టిపిల్లయో యిప్పుడు దయచేసిచెప్పుఁడు. మీ కరపత్రము 2వ పేజీలో "ప్రథమవయోవాచ కము బాలాశబ్దమని శాస్త్రముద్ఘోషించుచుండ ఆ శాస్త్రమును వ్యాసా దులు త్రోసివేసి అనియతముగా యువకులందును బాలాశబ్దమును వాడినా రనవలయునా ? గౌణార్థముగా నచ్చట వాడినారనవల యునా ?" ఇట్లు వ్రాసినారు. అట్లేమిటికి వ్రాసినారు ? దీనికర్థ మేమి? అర్థములేని యట్టి వ్రాతలతో నింక కాలక్షేపము చేయింపకుఁడు.

పణము పెట్టి సభ చేయించుటకు మీ రొల్లరైతిరి. మీవాదము నేను, నావాదము మీరు నంగీకరింపనప్పుడు ధర్మనిర్ణయమునకు మధ్య

వర్తి యుండు టావశ్యకము కాదా ? కాని యిప్పుడు మనవ్రాఁతలు కాలక్షేపమునకే యగును. అమరమునకు విరుద్ధములు నా మాటలంటిరి. అది రుజువుచేయఁగలిగినచో నా వాదమే వదలుకొందును. నామాట లర్థముచేసికొనక వ్రాసిన మీ వ్రాఁత యర్థి. ఇంక మీరు వ్రాయుచర్విత చర్వణములకు నా ప్రత్యుత్తరము లుండవు. మీరెప్పుడు సభ కంగీకరింపకుండితిరో అప్పుడే మీ వాదమోడిపోయినదనుట నిశ్చయము. నా వాక్యములకుఁ బండితులే ప్రమాణము. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

రాజమండ్రి
23-6-55

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి.

శ్రీ కవిసార్వభౌముం తృతీయకరపత్రమునకు

# సమాధానము.

శ్రీ కవిసార్వభౌములు నా ద్వితీయసమాధానపత్రముపై తృతీయకరపత్రము ప్రకటించి 25-6-55 తేదిని పోష్టులో నాకు బంపినారు. ఇది దానికి సమాధానము.

— కవిసార్వభౌముల మాటలు —

"మన వాదోపవాదములు మాటలతో వ్రాతలతో నింతవరకు నడచినవి; అందున ధర్మనిర్ణయము కాలేదు. కాదు" అనిరి.

ఆనిర్ణయము మొదట మాటలతోను, ఆపై వ్రాతలతోను అగుననియే ఆ మాపద్ధతుల నవలంబించిరికదా ! ఇప్పు డది కాదనుచున్నారేమి !

"మీరు సభ కంగీకరింపనినాఁడు మీవాద మోడిపోయినదని నేను చెప్పుటయే కాక లోకమును చెప్పును. ముల్లోకములందు నావాదమునకే జయము నిశ్చయము." అనిరి.

పై రెండుపద్ధతులలో తేలనిది సభలో తేలునా ? అని దానికి నే నంగీకరింపనంతమాత్రమున నావాద మోడిపోయినట్లు చెప్పగల వారు మీరొక్కరు తప్ప మరెవ్వరున్నారు ? ప్రమాణోపపత్తులతో విషయనిరూపణము చేయలేని వాదమే యోడిపోయినట్లగును. త్రిలోకవిజయము నావాదమునకే అని మీరనుట చిత్రము.

"మీరనిన బాల యెన్ని సంవత్సరములదో యిప్పుడు నిర్ణయించి చెప్పుడు." అనిరి.

ఆమె సంవత్సరసంఖ్య మూలోక్తము కానపుడు మనా నిర్ణయములతో బనియేమి ? కంఠోక్తిగా నున్న ఆమె బాల్యమును విశ్వసింపక అనుక్తవిషయముపై ప్రశ్న లేమిటికి.

"నేను యౌవనమునకు భాగకల్పనము చేసినట్లు మీరిపుడు బాల్యమునకు ప్రథమ మధ్యమాది భాగకల్పన చేసి చెప్పుడు మాత్రము." అనిరి.

సరే ! యౌవనమునకు పూర్వస్థితి బాల్యము; అందు 3 అవస్థలు. వానికి క్రమముగా కౌమారము, పౌగండము, కైశోరము అని పేర్లు. అందు 5 సంవత్సరములవరకు కౌమారము. 6 మొదలు 10 వరకు పౌగండము. 11 మొదలు 15 వరకు కైశోరము. ఇదంతయు బాల్యమే. 16 మొదలు యౌవనము. ఇది శ్రీధరీయోదాహృత శ్లోకములో జెప్పబడినది.

"కౌమారం పంచమాబ్దాన్తం పౌగండం దశమావధి ।
కైశోర మాపంచదశా ద్యౌవనన్తు తతః పరమ్ ॥"

దీనినిబట్టి బాల్యము 15 సం॥లలో అయిదేసి యొక్కొక్కభాగమని, 16 యేండ్లవానిని బాల యనరాదని మనవిచేయుచున్నాను.

"చంటిపిల్ల (అనగా చిన్నపిల్ల) అను నర్థము అందున్నదని వారి కెవ్వరు చెప్పినారు ? అంటిరి. మీరే కాదందురా ? అయినచో ఎట్టిపిల్లయో యిప్పుడు దయచేసి చెప్పుడు." అనిరి.

ఆబాలాశబ్దమునకు చంటిపిల్లయని యర్థము చెప్పి యాక్షే పించినవారు తామే. అది నేననినదియు గాదు, వ్రాసినదియు గాదు. ఆమె యెట్టిపిల్లయనగా చిన్నపిల్ల. చంటిపిల్లకాదు. పాలుగుడుచు శిశువు చంటిపిల్ల యనబడును. తమ ప్రథమకరపత్రములో "శాస్త్రిగారు యుపన్యాసములో కుంతి చిన్నపిల్ల అని చెప్పినారు." అనియే వ్రాసియున్నారు. చూడుడు.

"శబ్దశాస్త్రమును వ్యాసాదులు త్రోసివేసి బాలాశబ్దమునువాడినారనవలయునా? గౌణార్థముగా నచ్చట వాడినా రనవలయునా? ఇట్లు మీరు వ్రాసినారు. దీని కర్థ మేమి? అర్థము లేని యిట్టి వ్రాతలతో కాలక్షేపము చేయింపకుడు" అనిరి.

ఔరా!! అది యర్థములేని వ్రాత యని తమ కనిపించెనా? తాము త్రిలోకవిజయము నుద్ఘోషించుచున్నారా?

ఆనాటి యుపన్యాసములో కుంతి బాల యని నే నంటిని. కాదు ప్రౌఢ యని మీ రంటిరి. నే నరినట్లు ఆమె బాలయే యని ప్రమాణోపపత్తులతో నిరూపించి స్థిరపరచియున్నాను.

ప్రౌఢ యనుటకు ప్రమాణము ప్రదర్శింపని మీరు 'కుంతి ప్రథమయౌవనయే కాక ప్రౌఢ యనియుం దెలుచున్నది' 'అప్పుడు చిన్నతనముగాక పై నగు పెద్దతనమే' 'ఆమె ఋతుమతియైనది' (1) 'కుంతి 16 సం॥ ముల యీడు గలదనిన నాకు సమ్మతమే' '10యేండ్లదని చెప్పినను నా కంగీకారమే' (2) అని వ్రాసినారు.

ఆమె ఋతుమతియగుట వయఃప్రయుక్తము కాదని నిరూపించితిని. ఆమెకు పదియేండ్ల నంగీకరించు మీరు, ఆమె ప్రౌఢయను మీ వాదమును; 16 ఏండ్ల దను మీ మాటలను ఎట్లు సమర్థించుకొనగలరు? ద్వితీయసమాధానములోని నా ప్రశ్నలకు మీ తృతీయకరపత్రములో ప్రత్యుత్తరము లేనే లేదు. ఓడిపోయినది నా వాద మెట్లగును? నేను ప్రశ్నించియున్నను మీ తృతీయకరపత్రములో కర్ణజననవిషయమును

వారు స్పృశింపనే లేదు. అది మనవాదములోని కొందవయంశము కనుక దానిపై గొన్ని మాటలు చెప్పి విడిచెదను.

కర్ణుడు సద్యస్కాలజనితుడు— సద్యోగర్భ సంభవుడు. అని మీ మాటలు. సద్యస్కాలజననము- ఇక్కడ "సద్య స్సపది తత్క్షణే" అను అమరమును బట్టి తత్క్షణమందు జనన మని యర్థము. ఏ క్షణమందు? సూర్యసమావేశ క్షణమందు. ఆ క్షణమందే కర్ణజననమని యామాట కర్థము. ఇది 'సద్యోగర్భము 9 ఘడియలలో జనించును' (2) అను మీ మాటకు విరుద్ధ మగుచున్నది.

సద్యోగర్భ సంభవుడు— ఇక్కడ సద్యశ్శబ్దమును గర్భ మనుదన్వయించి సద్యోగర్భమువలన సంభవించినవాడని యర్థమా? సంభవ క్రియయం దన్వయించి గర్భమువలన సద్యస్సంభవుడని యర్థమా? గర్భమందును, సంభవక్రియయందును ఉభయత్ర అన్వయించి సద్యోగర్భమువలన సద్యస్సంభవుడని యర్థమా?

ఉభయత్రాన్వయము— "సకృ దుచ్చరిత శ్శబ్ద సకృ దేవార్థం గమయతి" అను న్యాయమునకు విరుద్ధ మగుటచే కూడదు.

సంభవక్రియయం దన్వయము "సద్యోగర్భము 9 ఘడియలలో జనించును" అను మీ మాటకును, "నీవు సద్యోగర్భంబున బుత్రు డుద్భవిల్లు" అను నన్నయభారతమునకును విరుద్ధము. ఉభయత్రాన్వయమునకును విరుద్ధమే యిది. సద్యోగర్భము అని, గర్భమందే అన్వయమా. అది సర్వసమ్మతము. ఇప్పుడు సద్యోగర్భసంభవుడను మాటచే సద్యస్కాలజనితుడను మాట ప్రతిహత మగుచున్నది.

—• పదియవమాసమున కర్ణుని గనుటనుగూర్చి •—

అరణ్యపర్వమూలములో కుంతీదేవికి, గర్భోత్పత్తి- గర్భధారణ- గర్భగోపన- సకాలప్రసవ— రూపములైన అవస్థలు క్రమముగా చెప్పబడినవి. ఆ శ్లోకములు ప్రథమసమాధానములో నుదహరింపబడినవి—

"తతో గర్భ స్సమభవ త్పృథాయాః... శుక్లే దశోత్తరే పక్షే

తారాపతి రివాంబరే" కుంతికి దశోత్తరశుక్లపక్షమందు గర్భో త్పత్తియైనది.

"సా బాంధవభయా ద్బాలా గర్భం తం వినిగూహతీ। ధారయామాస...నచైనాం బుబుధే జనః" ఆగర్భమును ఆబాల బంధువులు తెలిసికొనకుండునట్లు చేయుచు గర్భధారణ చేసియుండెను. గర్భవతియైన ఆమెను జనులు తెలుసుకొనలేకుండిరి.

"న హి తాం వేద నార్యన్యా కాచిత్ ధాత్రేయికాం మృతే" ఒక్క పరిచారికతప్ప మరి యేస్త్రీయును ఆమె గర్భవతియని గుర్తింపనేలేదు.

దీనినిబట్టి ఆమెను చూచినజనులు ఈమె గర్భవతియని గుర్తింపగలుగుట యెంతకాలమునకు సంభవించునో అంతకాలము ఆమె గుప్తముగా గర్భధారణ చేసినట్లు ఒప్పుకొనక తప్పదు. సద్యః ప్రసవమునో, నవఘటికాప్రసవమునో చెప్పుట కిది బాధకము కాదా!

ఇంకొకటి. "తతో గర్భ స్సమభవత్...శుక్లే...పక్షే తారాపతి రివాంబరే" అనుచోట కుంతికి సంభవించిన గర్భమునకు శుక్లపక్షచంద్రసామ్యము చెప్పబడినది. ఈసామ్యము దినదినాభివృద్ధికే కాని తత్క్షణాభివృద్ధికి కాదని సుప్రసిద్ధము. గర్భోత్పత్తియైన వెంటనే ప్రసవించె ననుట కిది బాధకము.

ఇంకొకటి ఆశుక్లపక్షచంద్రుని చెప్పుటలో ఈతిథినాటిచంద్రుడని తిథివిశేషము చెప్పబడలేదు. శుక్లపక్షమున కాది ప్రతిపత్తు అయియున్నది. కున్తికుక్షిగతమై అప్పుడు అనభివ్యక్తమై ఆగర్భమున్నది. అట్టిగర్భమునకు, ఆ మీద దినదినాభివృద్ధినొందు గర్భమునకు ఆకాశగతుడై మొదట అనభివ్యక్తుడై యుండు ప్రతిపచ్చంద్రుని సామ్యమే మూలకారునకు వివక్షితమై యుండును. కనుక శుక్లప్రతిపత్తిథియే గ్రాహ్యము.

ఈ యభిప్రాయమును బట్టియే నీలకంఠులు-'మాఘశుక్లప్రతిపది కర్ణనిషేకజన్మేత్యర్థః' అని వ్రాసి కర్ణునకు ఆప్రతిపత్తునందే కుంతీ గర్భప్రవేశమును చెప్పియున్నారు. ఆప్రతిపచ్ఛందప్రసామ్యము ప్రతి పత్తున అభివ్యక్తిరూపమైన కర్ణజననము చెప్పుటకు బాధకము "నిషేక జన్మ' అను నీలకంఠీయమును బాధకమే.

ఇంకొకటి. కుంతికి సూర్యసమావేశకాలము ఉదయకాలము కర్ణజననకాలము, పరిత్యాగకాలము నిశాకాలము. ఈ విషయము శ్రీకృష్ణభారతమందును ఇట్లు కలదు—

అంతం గుంతియు...నొక్కనా డుదితుండై లోచనగోచరుం డైన దివాకరు నాహ్వానంబు సేయుటయు" (ఆది.)

'చైత్రాది దశోత్తరంబైన మాసంబునం దాదిమదివసంబున గర్భంబు దాల్చె నాగర్భం బంతలోనన శుక్లపక్షపాకరుని చందంబు నం బ్రివృద్ధి నొందుటయు...నంత, కనియెం గుంతికుమారు... ఇట్లు కనినంతన కుంతి... జాతమాత్రుండైన పుత్రుంబెట్టి పెట్టి యం బదిలంబుగా...అశ్వనదిం బడ విడుచుచు...నన్నిశీథినీ సమ యంబున" (అరణ్య)

సద్యోగర్భ- సద్యఃప్రసవ- సద్యఃపరిత్యాగ వాదములో నవి యన్నియు పూర్వాహ్ణమందే జరిగినట్లు చెప్పవలసివచ్చును. దానికి జననము పరిత్యాగము నిశాకాలమం దయిన ట్లున్న వారి గ్రంథమే బాధకము.

ఇంకొకటి- మూలములో, గర్భోత్పత్తి, గర్భధారణ, గర్భ నిగూహనములు చెప్పబడినతర్వాత-'తతః కాలేన సా గర్భం సుషువే అని ప్రసవము చెప్పబడినది. గర్భోత్పత్తి— ప్రసవములకు మధ్య చెప్పబడిన గర్భధారణ-నిగూహనములు సద్యఃప్రసవవాదమునకు బాధ కములు.

ఆపై 'సుషువే గర్భం కాలేన' అనుటలో 'కాలేన' అనునదియు బాధకమే. సద్యఃప్రసవ మైనపుడు కాలవ్యవధాన మే మున్నది ?

మూలములో 'కాలేన' అను పదము ప్రసవకాలమున ప్రసవించెనని తెలుపుచున్నది. ఆ ప్రసవకాలము- 'దశమే మాసి సూతవే' అను శ్రుతినిబట్టి దశమమాస మయి యున్నది. సద్యఃప్రసవవాద మున కిదియు బాధకమే. ఎర్రాప్రగ్గడ భారతము— "పూర్వపక్షంబున చంద్రుడునుంబోలె గర్భంబు గ్రమంబున బ్రవర్ధనంబు నొందుచు... పదియగుమాసంబున నొక్కనాటి నిశాసమయంబున......కొడుకుఁ గనియె" అని యున్నది.

ఇది మూలశ్లోకానుగతము. అజ్ఞకల్పిత మనదగినది కాదు. నాటి యుపన్యాసములోని రెండవదగు కర్ణజననవిషయముయొక్క నిర్ణయ మిది. ఇది గ్రంథ సమన్వయప్రధానమైన సమాధానము. నాది తత్త్వకథనతాత్పర్యమేకాని వ్యక్తినిరసనతాత్పర్యము కాదు.

"ఇంక మీరు వ్రాయు చర్వితచర్వణములకు నా ప్రత్యుత్తరము లుండవు" అనిరి.

వ్రాయుటకు బూనుకొనిన మీరు ఇష్టములేనిచో మానవచ్చును కాని నావి చర్వితచర్వణము లనుట యుక్తము కాదు.

"మీరెప్పుడు సభ కంగీకరింపకుండితిరో అప్పుడే మీవాద మోడిపోయినదనుట నిశ్చయము." అనిరి.

నాది, మీరు హుష్వమనిన నెగిరిపోవు వాదమంటిరి. ఆ పనికై పత్రికావాదమునకు దిగితిరి. దాని నింతలోనే విరమింపవలసినపని యేమి ? పరస్పరప్రశ్నోత్తరములతో బయలుదేరిన మన వాదోపవాదములను నిష్ప్రశ్నముగనో, నిరుత్తరముగనో నిరూపించుటపూర్తియైనదా ? మన నిరూపణము పూర్తియై ఆపై నావశ్యకమైనచో నపుడు సభ !

కర్ణ జననవాదముపై మీప్రశ్నలింక లేకున్న నావాదమే నెగ్గినట్లగును.

'కుంతీబాల్యవాదమునుగూర్చి కూడ మీ ప్రశ్నలకు సమాధాన మీయబడినది. 'ఇంక నా ప్రత్యుత్తరము లుండవు' అని మీరనుట, నావాదము నిర్వివాదమైన దనియే తెలుపుచున్నదని మనవిచేయు చున్నాను.

ఇట్లు,
వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి.




